# యాత్రికుని ప్రయాణము

జా॥ బన్య॥ 

స్వప్నసాదృశ్య రీతిగా రచించినది

అనువాదము

పి. సాలమన్ రాజు






క్రిష్టియన్ పబ్లిషింగ్ హౌస్
పోస్టు బాక్సు 36, రాజమండ్రి.
1954

# Pilgrim's Progress

by John Bunyan



Translated and Published by

**Christian Publishing House,**

P. O. Box 36, RAJAHMUNDRY. (S. India)

Originally Published by

**Moody Press, Chicago, U. S. A.**

# ముఖచిత్రము

సువార్తికుడు :- అదిగో దూరమందు ప్రకాశించుచున్న దీపము కనబడుచున్నదా?

క్రైస్తవుడు:–అవును కనబడుచున్నట్లు నాకు తోచుచున్నది.

సువార్తికుడు:–ఆ వెలుగునే దృష్టియందుంచి తిన్నగా దానియొద్దకుపొమ్ము. అప్పుడు నీకా ద్వారము కనబడును. దానిని తట్టిన యెడల నీవేమి చేయవలెనో నీకు తెలుపబడును.

శాక్య ప్రెస్ : : రాజమండ్రి

మొదటికూర్పు ౩000 ప్రతులు

# యాత్రికుని ప్రయాణము.

ఒకానొకనాడు యిహలోకమను అరణ్యమునందు తిరుగుచుండగా నొకచోట నా కొక గుహ కనుపించినది. ఆ గుహలో కొంచెము విశ్రమించి నిద్రించుచుండగా నేనొక కల గంటిని. నా కలయందు ఇదిగో, చింకి గుడ్డలు ధరించు కొన్న వాడొకడు నాకు కనుపించెను. ఆతని ముఖము తన యింటిని వెనుక జేసుకొని యుండెను. ఆతని చేతి యందొక మహాగ్రంథమును, ఆతని వీపుమీద పెద్ద భారమును గలవు. (యెష 64 : 6; లూకా 14 : 33; కీర్తన 38 : 4) నేను చూచుచుండగా నతడా మహాగ్రంథమును విప్పి చదువు చుండెను. చదువుచుండగా నతడు కన్నీరు కార్చుచు వణక నాగెను. తన దుఃఖము నిక ఆపుకొనజాలక "నేనేమి చేయ వలయును?" అని యరచుచు వాపోయెను. (అపొ 2 : 37; 16 : 30; హబ 1 : 2,3)

ఈ దుస్థితి యందతడు తన గృహమునకుపోయి తన విచారమును భార్య బిడ్డలెరుగకుండ మరుగు పరచ జూచెను. అయితే అతని దుఃఖ భారమెక్కువైనందున అత డూరకుండ లేకపోయెను. అందుచేత తుదకతడు తన మనోభారమును తన భార్య బిడ్డల కిట్లు తెలియజేసెను:

ప్రేయసీ, వినుము. ముద్దుబిడ్డలారా, ఆలకింపుడు. మీ ప్రియమిత్రుడనైన నేను నన్నణచివేయుచున్న హృదయభారముచేత నలిగిపోతిని. మరియు మనమున్న యీ పట్టణము ఆకాశమునుండి అగ్నివచ్చి దహించివేయునని నిశ్చయముగ నేను వింటిని. ఆ మహా విపత్తునపడి నా భార్య బిడ్డలగు మీరును నేనును నశించి పోవుట నిజము. దీనినుండి తప్పించుకొను మార్గము నా కింకను ఒక్కటియు కూడ కనుపించుటలేదు.

ఈ మాటలు వినుసరికి అతని భార్య బిడ్డలకు అమితమైన యాశ్చర్యమైనది. ఎందుకనగా అతడు చెప్పిన దంతయు నిజమని వారు నమ్మినందున కాదుగాని నిశ్చయముగా నొక అర్థములేని పిచ్చి ఆందోళన అతనియందు ప్రవేశించినదని వారు తలంచిరి. అందువలన సాయంకాలమగుచుండగా నిద్రయందతని మనస్సు స్థిమితపడునని వారు ఆశించి అతనిని త్వరగా నిద్ర పుచ్చిరి. అయితే పగటి బాధకన్న రాత్రి దుఃఖమెక్కువైనది. అతడు సుఖముగా నిద్రించుటకు బదులు మూల్గులతోను కన్నీటితోను రాత్రి యంతయు గడిపెను. ఉదయమైనప్పుడు అతని మంచి చెడ్డలను వారు విచారింపగా నతడు వారితో, "అంతకంతకును నాకు భయ మెక్కువగుచున్నది" అని చెప్పెను.

క్రిందటివలెనే వారితో నతడు చెప్ప మొదలిడెను గాని వారు మరింత కఠినమైరి. గద్దింపులతోను కఠినముగ

మాటలతోను అతని పిరికి తనమును పోగొట్టుటకు కూడ వారు ప్రయత్నించిరి. ఒక్కొక్క సారి హేళన చేసియు మరొక సారి తిట్టియు, ఇంకొక సారి విసియు నిర్లక్ష్యారకుండియు అతని వారింప జూచిరి. అందుచేత వారిపై జాలిపడి వారి కొరకు ప్రార్థించుటకును, తన దుఃఖమునకు శాంతి బొందుటకును తాను తన గదిలోనికి పోవుచుండువాడు. మరియు ఒక్కొక్కసారి చదువుకొనుచును మరియొక్కసారి ప్రార్థించుచును అతడు పొలములందొంటరిగ తిరుగువాడు. ఈ రీతిగ కొన్ని దినముల పాటు తన కాలము నతడు గడిపెను.

మరియు నేను చూచుచుండగా నతడు తన పద్ధతి చొప్పున పొలములో తిరుగుచు అమితమైన మనోభారము చేత క్రుంగినవాడై తనచేత నున్న మహాగ్రంథమును చదువుచుండెను. అతడట్లు చదువుచు మునుపటివలెనే దుఃఖముతో, "రక్షణ పొందుటకు నే నేమిచేయవలెను?" (అపొ 16 : 30,31) అని అరచెను.

మరియు పరుగెత్తవలెనని కాబోలును, అతడిటునటు వెదుకులాడుటకూడ నేను చూచితిని. అయినను ఎటుపోవలెనో తోచక అతడట్లే నిలువబడి యున్నట్లు నేను గ్రహించితిని.

## యాత్రికుడు సువార్తికుని కలిసి కొనుట.

నేను చూచుచుండగా సువార్తికుడను పేరుగల యొక డతని సమీపించి నీవెందుకు దుఃఖించుచుంటివి? అని యతని

నడిగెను. అందుకతడు అయ్యో, నాకు మరణశిక్ష విధింప
బడినదనియు ఆ పిమ్మట తీర్పులోనికి రావలసి యున్నదనియు
నా చేతనున్న యీ మహా గ్రంథము చెప్పుచున్నది.
(హెబ్రీ 9 : 27) మరణశిక్షకు నా మనస్సొప్పుటలేదు.
(యోబు 16 : 21, 22) మరియు తీర్పులో నిలుచుటకు నేను
సిద్ధముగా లేను. (యెహె 22 : 14) అప్పుడు సువార్తి
కుడు : ఈ జీవితమునందిన్ని బాధలుండగా చచ్చుటకు నీకెందు
కిష్టములేదు ? అని యడిగెను. అందు కాతడిట్లనెను : ఎందు
కనగా నా మీద చాల భారమైన మూటగలదు. ఈ బరువు
చేత సమాధిలోనికే గాక యింకను అడుగునకు పోవుదు
ననియు యెష 30 : 33 లో చెప్పబడిన హేయమగు
అగ్ని గుండములోనికి దిగిపోవుదునని నాకు భయమగుచున్నది.
అయ్యో, నేను ఖైదుకు పోలేను, అక్కడనుండి తీర్పునకును
మరణశిక్షకునుకూడ నేను పోలేను. ఈ యోచనలచేత
నా గుండె పగిలి దుఃఖము వచ్చుచున్నది.

అందుకు సువార్తికుడు : నీస్థితి యిట్టిదని యెరిగియుండి
యు నీవు కదలక నిలిచియుంటివేమి యని ప్రశ్నించెను. ఎటు
పోవలెనో యెరుగక యిట్లుపడి యుంటినని యా మనుష్యుడు
జవాబిచ్చెను. అప్పుడు సువార్తికుడు అతనికొక కాగితపు
చుట్ట నందించెను. దాని యందిట్లు వ్రాయబడి యుండెను.
'రాబోవు యుగ్రతనుండి పారిపోవుడి' (మత్త 3 : 7.)

ఆ మనుష్యుడా వాక్యమును చదివి సువార్తికునివంక దీక్షతో చూచి నేనెక్కడికి పారిపోవలెను? అని యడిగెను. అందుకు సువార్తికుడు తన చేతివ్రేలితో పెద్దపొలమువైపుకు చూపి: అదిగో దూరమునందున్న దిడ్డిగుమ్మము కనబడుచున్నదా? అని యతని నడిగెను. (మత్తయి 7 : 13,14) కనబడుటలేదని యా మనుష్యుడు బదులుచెప్పెను. అయితే అదిగో దూరమందు ప్రకాశించుచున్న దీపము కనబడుచున్నదా? యని సువార్తికుడు మరల ప్రశ్నించెను. (కీర్త 119 : 105 ; II పేతు 1 : 19)

అందు కతడు: అవును కనబడుచున్నట్టు నాకుతోచుచున్నది. అని జవాబిచ్చెను. అప్పుడు సువార్తికుడు: ఆ వెలుగు నీ దృష్టియందుంచి తిన్నగా దాని యొద్దకు పొమ్ము. అప్పుడు నీకా ద్వారము కనబడును. దానిని తట్టిన యెడల నీవేమి చేయవలెనో నీకు తెలుపబడును. అని హెచ్చరించెను. అప్పుడు నేను నా స్వప్నమునందు చూచుచుండగ నా మనుష్యుడు పరుగెత్తనాగెను. తన యింటిద్వారము నుండి పరుగెత్తుచు నతడు దూరముగ పోయినప్పుడు అతని భార్యాబిడ్డలు చూచి వెనుకకు మళ్ళుమని అతని కేకలు పెట్టిరి. అయితే ఆ మనుష్యుడు తన చేతివ్రేళ్ళతో చెవులు మూసుకొని: "జీవము, జీవము, నిత్య జీవము" అని యరచుచు పరుగెత్తిపోయెను. (లూకా 14 : 26.) అయితే

అతడు వెనుకకు తిరుగలేదు. (ఆది 19 : 17) గాని తన యెదుటనున్న మైదానము మధ్యకు పారిపోయెను.

అతని చూచుటకు తన యిరుగుపొరుగులుకూడ బయటికి వచ్చిరి. (యిర్మి 20 : 10.) వారిలో కొందరతడు పరుగెత్తుచుండగా హేళన చేసిరి; కొందరు భయపెట్టిరి, మరి కొందరతని వెనుకకు రమ్మని కేకలు పెట్టిరి. ఇట్లు చేసిన వారిలో నిద్దరు మనుష్యులు ఇతనినెట్లయినను బలవంతముగా వెనుకకు తీసుకురావలయునని నిశ్చయించుకొనిరి.

## మొండియు మెత్తనయును అతని వెంబడించుట.

వీరిద్దరిలో నొకని పేరు మొండి; వేరొకని పేరు మెత్తన. ఇంతలో నా మనుష్యుడు వారి యొద్దనుండి చాలదూరము పోయెను. అయినను వారెట్లయిన నతని వెంబడించి పట్టుకొన వలయునని పరుగెత్తిరి. తుదకు వారతని సమీపించిరి. అప్పుడా మనుష్యుడు వారితో మిత్రులారా, మీరెందుకు నన్ను వెంబడించి వచ్చియున్నారు? అనెను. అందుకు వారు : నిన్ను బలవంతపెట్టి వెనుకకు తీసుకొనిపోవుటకే అనిరి. అయితే అతడు : ఇది ఎంతమాత్రమును జరుగదు. మీరు నివసించుచున్నది నాశన పురము. నేనుకూడ అక్కడనే పుట్టితిని.

అది నాశనపురమని నేను గ్రహించితిని. మీరక్కడనే చని పోయిన యెడల చావుకన్న అగాధ స్థలమునకు మీరు దిగి పోవుదురు. అక్కడ అగ్నియు గంధకమును మండుచుండును. గనుక సుబుద్ధులగు మిత్రులారా, దయచేసి మీరును నాతో కూడరండి. అని వారి నర్థించెను.

మొండి:-ఏమి చెప్పితివి! మా స్నేహితులను మా సౌఖ్యములను ఇక్కడనే విడిచిపెట్టి వేయమందువా?

క్రైస్తవుడు (ఇది ఆ మనుష్యుని పేరు):-అవును. నేను పొంద బోవునది కొంచమైనను ఇక్కడ గల సమస్తము కన్న విలువగలది. (II కొరిం 4 : 18.) మీరును నేను పోవుమార్గమును పట్టుకొని దాని వెంబడించిన యెడల నాతోపాటు మీరును ఆ యానందము ననుభవింతురు. ఎందుకనగా నేను పోవు ఆ స్థలమందు మన కందరకును చాలినంత గలదు. (లూకా 15:17, మీరుకూడ నాతో రండి అప్పుడు నా మాటలు నిజమని గ్రహించగలరు.

మొండి:-నీవు లోకమునంతయు విడిచిపెట్టి వేటికొరకు వెదకుచున్నావు?

క్రైస్త:-అక్షయమైనదియు నిర్మలమైనదియు వాడబారనిదియునైన స్వాస్థ్యమును నేను వెదకుచున్నాను. (I పేతు 1:4) అది పరలోకసంబంధమైన శ్రేష్ఠమైన దేశము. అది

పరలోకములో భద్రపరచ బడియున్నది. (హెబ్రీ 11 : 16) దానిని జాగ్రత్తగా వెదకు వారికి తగిన కాలమందు అది అనుగ్రహింపబడును. ఈ సంగతులు ఉన్నవి ఉన్నట్టు నీకిష్టమైన యెడల యీ గ్రంథము నందు చదివి చూడుము.

మొండి:-పిచ్చివాడా, నీ పుస్తక మెవనికి కావలయును; ముందునాతో తిరిగి వచ్చెదవా, లేదా ?

క్రైస్త:-నేను మాత్రము రానేరాను. ఎందుకనగా నాగటిపై చెయ్యినుంచి వెనుకకు చూచుట నాకు తగదు. (లూకా 9 :62)

మొండి:-అయితే సోదరుడా, మెత్తనా, మనము వెనుకకు పోదము రమ్ము. ఇతడు రాడు. తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళని వాదించు యీ పిచ్చివాళ్లు తమ వాదమును విడువరు. వెయ్యిమంది వచ్చి సహేతుకముగ బుద్ధి చెప్పినను ఇట్టివారి పిచ్చిబుద్ధి మారనే మారదు.

మెత్తన:-వద్దు వద్దు. క్రైస్తవుని దూషించవద్దు. ఒకవేళ యితడు చెప్పు సంగతులే నిజమైన యెడల మనము వెదకులాడు చెత్తకన్న యితడాశించు మేలిమి నే మంచిది. ఇతనితో పోవలయునని నా హృదయము కూడ మొగ్గుచున్నది.

మొండి :-ఏమి నీకుకూడ ఈపిచ్చియేపట్టినదా? నేను చెప్పిన హితవు విని వెనుకకు రమ్ము. మతిభ్రమించిన వీడు నిన్నెక్కడ ముంచునో యెవరికెరుక! నామాట విని బుద్ధిమంతుడవై తివేని తిరిగి రమ్ము.

క్రైస్త :-సోదరా, మెత్తనా, నా వెంబడియే రమ్ము. నేను పోవు స్థలమందు యిప్పుడు నేను చెప్పినవియే గాక వీటితోపాటు మరెన్నియైన భాగ్యము లుండును. నా మాట నీ కనుమానముగానున్న యెడల యీ గ్రంథమును చదువుకొనుము. దీనియందు వ్రాయ బడిన సంగతులు నిజమని దానిని వ్రాయించిన వాని రక్తమే బలపరచు చున్నది. (హెబ్రీ 9 : 17-21.)

మెత్త:-అవును సోదరుడైన మొండీ, నేనిదే నిశ్చయముచేసి కొనుచున్నాను. నే నీబుద్ధిమంతునితో పోదలచి యు న్నాను. అతనితోపాటు నేనును అన్నిటి యందును పాలు పొందుదును. అయితే సుబుద్ధియగు సోద రుడా, మనము పోదలచిన స్థలమునకు నీకు మార్గ మెట్లో తెలియునా?

క్రైస్త :-మన కెదురుగానున్న చిన్నద్వారము కడకు పోవల యుననియు, అక్కడ మనము పోవలసినమార్గమును గూర్చి సలహా లన్నియు ఇవ్వబడుననియు సువార్తి కుడు నాకు సెలవిచ్చెను.

మెత్త:-అయితే రమ్ము సహోదరుడా, మనము పోవుదము.
అక్కడ నుండి వారిద్దరును కలసి ప్రయాణముచేయు చుండిరి. అయితే వారిద్దరిని మొండి అసహ్యించుకొని యిట్టి పిచ్చివారితో కలసి తప్పుదారిని నేను మాత్రము పోను. నాదారిని నేను వెనుకకు పోదు ననుకొని వారిని విడిచి పోయెను.

అప్పుడు నా కలలో నేను చూడగా మొండి వెనుకకు పోయెను. మెత్తనయు క్రైస్తవుడును ఆ మైదానము మీదుగా తమదారిని నడచు చుండిరి. వారు పోవుచు నిట్లు సంభాషించిరి.

క్రైస్త:-సోదరుడా - మెత్తనా, రమ్ము. ప్రయాణ మెట్లున్నది? నీవు నాతో కూడ వచ్చుటకు నిశ్చయించుకొన్నందున నా కెంతో ఆనందముగా నున్నది. రాబోవు శక్తులయొక్కయు మహావిపత్తుల యొక్కయు మర్మమైయున్న భయంకరత్వమునుగూర్చి నేను ఆందోళన పడినట్లే మొండియును ఆందోళనపడిన యెడల నేడు మనలను విసర్జించి అతడు వెనుకకు పోకుండెడి వాడే.

మెత్త:-క్రైస్తవా, సహోదరుడా, రమ్ము. ఈ సమీపమందు మన మిరువురమును తప్ప మరెవరును లేరు. మనము పోవు ఆ స్థలమందే యే భాగ్యము లున్నవో వాటి నెట్లనుభవింప గలమో నాకు వివరింపుము.

క్రైస్త:-ఆ భాగ్యములను నోటితో చెప్పుట కష్టముగాని మనస్సునందుకొంతవరకు ఊహించ గలను.అయినను నీకు తెలిసికొనుట ఆశగా నున్నదనుచున్నావు గనుక వాటిని గూర్చిన విషయములను నాచేత నున్న గ్రంథమునందు చదివెదను.

మెత్త:-అయితే ఆ గ్రంథము నందలి విషయములు మరి అనుమానము లేకుండా సత్యమేనా?

క్రైస్త:-ముమ్మాటికిని సత్యమే. దానిని వ్రాయించినవాడు అబద్ధమాడువాడు కాడు. ( తీతు 1 : 2 )

మెత్త:-మంచిది. నీవు చదువ గోరిన యా విషయము లేవి?

క్రైస్త:-మనము నివసించుటకు శాశ్వతమైన రాజ్యమును మనము పొందుటకు నిత్యజీవమును, గలవు. మనము నిత్యమును నివసించి శాశ్వత రాజ్యమును స్వాస్థ్య పరచు కొందుము. ( యెష 45 : 17; యోహా 10 : 27,29 )

మెత్త:-మంచిది. మరి యింకను యేమేమి గలవు?

క్రైస్త:-మనకిన్నా బ్రదుకుకు మహిమ కిరీటములు గలవు. ఆకాశమండలమందు సూర్యునివలె ప్రకాశింప జేయు వస్త్రములు గలవు.(II తిమొ 4: 8, ప్రక 22:5,మత్త13:43)

మెత్త:-అహా, ఇది యద్భుతముగా నున్నది. మరి యింకేమి గలవు?

క్రైస్త:-ఇక దుఃఖమైనను యేడ్పుఅయినను ఉండవు. ఎందు కనగా అచట నాథు డగువాడు మన ప్రతి బాష్ప బిందువును తుడిచి వేయును. ( యెష 25 : 8; ప్రక 7 : 16,17; 21 : 4.)

మెత్త:-అయితే మనకచట సహవాసు లెవరుందురు?

క్రైస్త:-మన మక్కడ సెరూపులతోను ఖెరూబులతో వసి యింతుము. (యెష 6 : 2; I థెస్స 6 : 16,17; ప్రక 5 : 11) ఈ జీవులవైపు మనము చూచినపుడు మన కండ్లు మిరుమిట్లు గొనును. ఆ స్థలమునకు మనకంటె ముందుగా పోయిన వేల వేలాది విశ్వాసులనుకూడ మనము కలుసుకొందుము. వారిలో నెవరును మన కపకారులుగా నుండరు గాని బహుమైత్రిగాను పరి శుద్ధముగాను ఉందురు.ఒక్కొక్కరును దేవుని సమక్ష మునసంచరించుచుయెన్నటెన్నటికిని కృపనొందినవా రై ఆయన సన్నిధియందుందురు.ఒక్కమాటలో చెప్పి నయెడల మహిమ పరచబడి బంగారుకిరీటములు ధరిం చిన పెద్దలును (ప్రక 4 : 4) బంగారు వీణెలు మీటి పాటలు పాడుచున్న కన్యకలును ( ప్రక 14 : 1-5) మనకు కనబడుదురు. లోకముచేత ముక్కలుగ నరు కబడినవారును, మంటలలో కాల్చ బడినవారును, మృగములచేత చంపబడినవారును, సముద్రములందు

ముంచబడినవారును సజీవులై మనకు కనబడుదురు. ఎందుకనగా ఆ మహిమ పురమునకు నాథుడగు వానిపేరిట వారన్ని శ్రమలను భరించిరి. (యోహా 12 : 25.) వారిప్పుడు చక్కని మహిమశరీరులై అమర్త్యత్వమును వస్త్రముగా కప్పుకొని మనకు కనబడుదురు. (II కొరిం 5 : 2, 3, 5.)

మెత్త :–దీనిని వినుటచేతనే హృదయము పొంగుచున్నది. గాని వీటినన్నిటిని యనుభవించ బోవుచున్నామా? ఇట్టి గొప్ప వాటియందు పాలివారమగుటకు మన మేమి చేయవలయును?

క్రైస్త :–మనమా దీవెనల నెట్లు పొందగలమో యీరాజ్యమునకు పరిపాలకుడగు ప్రభువు యీ గ్రంథమునందు భద్రపరచి యున్నాడు. (యెష 55 : 1, 2; యోహా 6 : 37, 7 : 37; ప్రక 21 : 6; 22 :17.) ఈవాక్యముల సారాంశమేమనగా; మనము నిజముగా నిచ్ఛయించిన యెడల దానిని తానే మనకు ఉచితముగా ననుగ్రహించును.

మెత్త :–ఆహా, మిత్రుడా! ఇవన్నియు వినుటకు నాకు చాల ఆహ్లాదకరముగా నున్నది; మనము శీఘ్రముగా నడచుదము.

క్రైస్త :-అయ్యో, త్వరగా పోవలయునని ఆశయున్నది గాని అడుగుముందుకు త్వరపడుటలేదు. ఎందుకనగా నా మీద నున్న భారము నన్ను క్రిందికి అణచివేయు చున్నది.

## నిరాశయను దొంగయూబి

అప్పుడు నేను నా స్వప్నమునందు చూడగా, వారిద్దరును మాటలాడు కొనుచు నా మైదానమునకు మధ్యనున్న జిగట యూబిగల గుంటనొద్దకు జేరిరి. వారు అజాగ్రత్తగా నడచుచున్నందు యిద్దరును అగుంటలో హటాత్తుగా బడిరి. ఆ గుంటపేరు నిరాశ. ఈగుంట యందు బడి వారు కాళ్లను లాగలేక లాగుచు ఆయాసపడుచు ముందుకు జరుగ జూచిరి గాని వారికది సాధ్యము గాకుండెను. తన మీదనున్న బరువు చేత క్రైస్తవుడంత కంతకు క్రిందికి దిగబడి పోవుచుండెను.

మెత్త :-అయ్యో మిత్రుడా, క్రైస్తవుడా, నీ విప్పుడెక్కడ యున్నావు?

క్రైస్త :-ఎక్కడ నుంటినో సరిగా చెప్పలేకున్నాను.

మెత్త :-ఈ సమయమునందు మెత్తన బహుగా నభ్యంతర పడినవాడై కోపముతో నతని సహచరున కిట్లనెను; ఇంతసేపును నీవు నాకు చెప్పుచు వచ్చిన యానందమిదియేనా? ఆదిలోనే హంసపాదన్నట్టు, మొట్టమొద

టనే యిట్టి దుర్గతి పట్టినదిగదా, యిక మన గమ్యస్థానమును చేరులోపల నెన్ని యిడుమలు కనిపెట్టుకొని యున్నవో గదా! ప్రాణములో నిప్పుడు బైటపడిన నాకంతియే చాలును. ఆ మహాభాగ్యము లేవిగలవో నావంతును నీవంతును నీవే యనుభవింపుము.

ఈ మాటలు చెప్పి మెత్తన తన బలముకొలదిని ఒకటి రెండు సార్లు పోరాడి ఎట్టకేలకు తన యింటివైపున నున్న యొడ్డునకే యాగుంటనుండి బైటపడెను. పడినదే తడవుగ నతడు తన యింటికి దారితీసెను. పిదప అతని నెన్నడును క్రైస్తవుడు చూడలేదు.

ఇట్లు జరిగిన నందున క్రైస్తవు డొంటరిగా నిరాశయను గుంట యందు బడి కొట్టుకొనవలసి వచ్చెను. అయితే ధైర్యమును విడువక పోరాడి యెట్టకేలకు తన యింటివైపు యొడ్డునకుగాక దిడ్డిగుమ్మమున్న వైపునకే ఆగుంట యొడ్డుదరికి జేరెను. అయితే యతడింకను తన మీదనున్న బరువువలన గట్టుమీదకు ప్రాక లేకుండెను.

# సహాయకు డనువాడు క్రైస్తవుని రక్షించుట

అయితే నేను నాస్వప్నమునందు చూడగా సహాయకుడు అను పేరు గలవాడొక డచటికి వచ్చి క్రైస్తవు డచట యేమిచేయుచుండెనో యని ప్రశ్నించెను.

క్రైస్త :-అయ్యా, నన్నీమార్గమున పొమ్మని సువార్తికుడను పేరుగల మిత్రుడు సలహానిచ్చెను. దూరమందున్న యాదిడ్డిగుమ్మమును కూడ యతడు చూపించి రాబో వు యుగ్రతనుండి నన్ను తప్పించుకొనుమని హెచ్చ రించెను. అక్కడికి పోవయత్నించు చుండగా నిక్కడ చిక్కుబడి మూలుగుచుంటిని.

సహా :-అయితే నీ ప్రక్కన గల మెట్లనెందుకు గమనింపక పోతివి?

క్రైస్త :-అయ్యో, భయమను వాడు నన్ను గట్టిగా తరిమి నందున అవతలి ప్రక్కకు బోయి మెట్లుచూడక యీ గుంటయందు బడితిని.

సహా :-సరియే, నీ చేతినిటు యందించుము. అంతట క్రైస్త వుడు చేతినియ్యగా సహాయకుడు అతని వెలుపలికి లాగి గట్టున నిలిపెను (కీర్త 40 : 2) పిమ్మట పోయి రమ్మని యతని సాగనంపెను.

అప్పుడు నేను సహాయకుని సమీపించి యిట్లడిగితిని; అయ్యా, నాశనపురమునుండి దూరమందున్న యాదిడ్డిగుమ్మ మునకు పోవుటకు మార్గమిది గదా? యాత్రికులు మోసము లో పడి యీ గుంటయందు చిక్కుబడకుండా దీనినెందుకు బాగుచేయ గూడదు?

అందుకతడిట్లు జవాబిచ్చెను; ఈ యూబిగుంట చక్క- బరచ శక్యముగాదు. పాప విషయమై పశ్చాత్తాపము కలిగి

నపుడు దానితో పుట్టుతెట్టును మురికియు నీ గుంటలోనికి పారుచుండును. అందుచేతనే దీనికి నిరాశయను గుంటయని పేరు. ఎందుకనగాపాపి తన దౌర్భాగ్యస్థితిని గ్రహించినపు డతని హృదయములో అనేక భయములును అనుమానము లును నిరాశను కలిగించు తలంపులునుపుట్టును. అవియన్నియు కలసి ప్రవహించి యీ స్థలమందు కూడుకొనును. అందు చేతనే యీ స్థలమంత పాడుగా నున్నది.

ఈ స్థలమింత పాడుగానుండుట (నిత్యజీవపు) రాజున కిష్టముగాలేదు. ( యెష 35 : 3, 4. ) ఆయన సేవకులు కూడ నీగతించిన రెండువేల సంవత్సరముల నుండియు నీగుం టను పూడ్చి బాగుచేయవలెనని తలంచుచున్నారు. అవును; నే నెరిగినంతమట్టుకు(ఈమాటలు సహాకుడే చెప్పెను.)ఈస్థల మందు యిరువదివేల బండ్లు లేక కోటానుకోట్ల హితవాక్య ములు మునిగిపోయినవి గాని యీ గుంట పూడనేలేదు. వీటిని యీ సామ్రాజ్యములో నానాచోట్లనుండి ఆయాకాలము లందు తెప్పించి పోసిరి. (ఈ స్థలమును బాగుపరచి గట్టినేలగా చేయుట కదియే మంచి గట్టి సరుకని తెలిసిన పెద్దలు చెప్పు దురు). ఇదియే నిజమైనయెడల నీగుంటపూడి యీ స్థలము బాగుపడియుండెడిదే; అయితే నిది నిరాశగుంట గనుక ఎవ రెంత కష్టపడినను దీనిస్థితి మారదు.

అయితే ధర్మకర్తయగు రాజుయొక్క ఆజ్ఞప్రకారము యీ బురదమధ్య నుండి కూడ కొన్ని స్థిరమైన మెట్లు వేయబడినవి. అయితే ఒకొక్క ఋతువునందు ఈ గుంటయందు మురికి యెక్కువై మెట్లు కనుపించవు; ఒకవేళ కనుపించినను మనుష్యులు తమ తలలయందున్న మబ్బుచేత తప్పటడుగు వేసి మెట్లు తొలగి బురదలో పడిపోవుదురు. అయితే వారు కష్టపడి దిడ్డిగుమ్మమును సమీపించిన యెడల అక్కడనుండి నేల చక్కగా నుండును. ( 1 సమూ 12 : 23. )

ఇంతలో నా కలయందు చూడగా మెత్తనీ తన స్వగృహమును జేరెను. అప్పుడతని యిరుగు పొరుగువార లతని చూడవచ్చిరి. అతడు తిరిగి వచ్చినందుకు కొందరతనిని జ్ఞానియని పొగడిరి. క్రైస్తవునితో కలిసి సాహసించినందుకు మరి కొందరతనిని బుద్ధిహీనుడనిరి. ఇంకను కొందరతనిని పిరికివాడని హేళనచేసిరి. ఒకసారి తెగించి కొద్ది కష్టములు రాగానే వెనుకకు మళ్లుట యుక్తము కాదని వారి వాదము, గనుక మెత్తన వారందరి యెదుటను బడి దిక్కులు వెదకుచుండెను. అయితే రాను రాను అతనికి ధైర్యము కలుగగా అతని నపహసించు వారందరును తగ్గి క్రైస్తవుని నపహాస్యము చేయజొచ్చిరి. ఇంతటితో మెత్తన యనువాని సంగతి సరి.

# క్రైస్తవుడు లోకజ్ఞానిని కలుసుకొనుట

ఆ తరువాత క్రైస్తవుడు ఒంటరిగా నడచి యా మైదానమున బడి పోవుచుండగా అతని కలిసికొనుటకు వచ్చుచున్న యొకనిని దూరమునుండి చూచెను. వారొకరి కొకరెదురై ఒండొరులను కలిసికొనుట తటస్థించినది. అతనిని కలసికొన్న పెద్దమనిషి పేరు లోకజ్ఞాని. అతడు శరీరధర్మమను పట్టణవాసి. ఇది యొక పెద్దపట్టణమును క్రైస్తవుని గ్రామమునకు పొరుగున నున్నది. అప్పుడా మనుష్యుడు క్రైస్తవుని కనుగొని యతనిని కొద్దిగా గుర్తుపట్టెను. ఎందుకనగా క్రైస్తవుడు నాశన పురమునుండి బైలుదేరి పోయెనను వార్త చుట్టుప్రక్క లెల్లను వ్యాపించిపోయినది. అతని స్వగ్రామము నందు గుసగుసలే గాక పక్క గ్రామములందును ఇతని గూర్చిన ప్రస్తావనలు హెచ్చెనవి. అందుచేత వీపుపైనున్న భారముతో కాళ్లీడ్చుకొనుచు నడచుచున్న క్రైస్తవుని నిట్టూర్పులును మూలుగులును గమనించి అతడే క్రైస్తవుడై యుండునని గ్రహించెను. అప్పుడతడు క్రైస్తవునితో కొంత సంభాషణ సాగించెను.

లోక :-ఓహో, మిత్రుడా, యీ భారము మోసికొనుచు నెంతవరకు ప్రయాణము ?

క్రైస్త :- నిజమే. భారమే. నే నెన్నడు నింత భారము మోయు వానిని చూడనే లేదు. ఎక్కడికని నన్నడిగితివి

గనుక చెప్పుచున్నాను వినుము. అదిగో నాయెదుట నున్న ఆ దిడ్డి గుమ్మము నొద్దకు పోవుచున్నాను. ఎందుకనగా నా భారమును పోగొట్టుకొను మార్గము నాకక్కడ దొరుకునని నాకు తెలియ వచ్చినది.

లోక :- నీకు భార్య బిడ్డలున్నారా ?

క్రైస్త:-ఉన్నారు. గాని యీ భారము చేత యింతకు ముందువలె వారి యందు నే నానందింప లేకున్నాను. వారున్నను నాకు వారు లేనట్టే యున్నది. (1 కొరిం7:29)

లోక :- అయితే నీకొక్క బుద్ధి మాట చెప్పెదను విందువా?

క్రైస్త :-అది మేలయిన మాటయైనచో తప్పక విందును. ఎందుకనగా నాకు మంచి సలహా అవసరమైయున్నది.

లోక :- అయితే నీవు వెంటనే నీమీది భారమును దింపివేసుకొనుమని నాసలహా. ఎందుకనగా ఆ భారము పోవు వరకును నీబుద్ధి కుదుట బడదు. మరియు అంతవరకు దేవుడు నీ కనుగ్రహించిన భాగ్యములను నీ వనుభవింప లేవు.

క్రైస్త :- దానికొరకే నేనును వెదుకుచున్నాను. ఈ భారము నుండి విడిపింపబడుటయే నా కోరిక. గాని దానిని విడిపించు కొనుట నాకు మాత్రము సాధ్యముగా కున్నది. అందుచేతనే నీ కింతకు ముందు చెప్పినట్లు యీ మార్గమున పోవుచున్నాను.

లోక :- నీ భారమును పోగొట్టుకొనుటకీ మార్గమున పొమ్మని నీ కెవడు చెప్పెను.

క్రైస్త :- ఒక గౌరవనీయుడు నాకు కనబడి నాకట్లు బోధించెను. అతని పేరు సువార్తికుడని నాకు జ్ఞాపకము.

లోక :- వాని సలహా మంచిదికాదు. వాడు నీకు చూపిన యీ మార్గము లోకములోని మార్గములలో కెల్ల అపాయకరమైనదియును కష్టమైనదియును, ఈ సలహా నీవు తల దాల్చి పోయిన యెడల ఆకష్టమేమో నీకే తెలియును. ఆకష్ట నిష్ఠూరములలో కొంత యిప్పటికే నీకు తెలిసినదని నేననుకొనుచున్నాను. ఎందుకనగా నిరాశ యూబిగుంటలో నీకు తల తునకలైనది. అయితే ఆ యూబిగుంట నీ యిడుమలకు ప్రారంభము మాత్రమే. ఈ మార్గమున పోవు వారికి వచ్చుము సళ్ల పండుగ యింకను ముందున్నది. నేను నీకన్న పెద్దవాడను నామాట వినుము. నీవు పోవు మార్గమునందు, అలసటయు, బాధయును, ఆకలియు, అపాయములును, వస్త్రహీనతయు, కత్తిదెబ్బలును. పులులు, సింగములును, కటికి చీకటియు, ఇవి యవి యననేల చివరకు మరణమును ఇంకెన్నియైనను నీకు సంభవింపక మానవు. ఈ మాటలు ముమ్మాటికి నిజము ఇవి నిజమనుటకు అనేక సాక్ష్యములున్నవి. ఎవడో

ద్వారినిపోవు వానిమాట విని యిన్ని యిడుమలకు తల యొడ్డుట మనకు తగునా ?

క్రైస్త :- అయ్యో, స్వామి. నీవు చెప్పిన వెన్నియైనను వాటి కన్న నాభుజముల మీద నున్న యీ మూటయే నాకు భయంకరముగ నున్నది. వేయేల, నా మీది భార మును వదలించుకొనుట కెన్ని కష్టము లయినను నాకు లెక్కకురావు.

లోక :-అయితే నీకీ భారమున్నట్టు నీకు మొదట యెట్లు తెలిసినది.

క్రైస్త :-నా చేతనున్న యీ గ్రంథమును చదివి తెలిసికొంటిని.

లోక :-అదియే నేననుకొంటిని. నీబోటి దుర్బల హృదయుల కిట్లనే జరుగుచుండును. వారికి అందని అగోచర విషయముల జోలికి పోయి నీకువలెనే తప్పిపోవు మందమతులున్నారు. ఈ తప్పుడు బోధలు పిరికి తనమును పుట్టించుటయే గాక ఏదియో అర్థమెరుగని ఫలముల నందుకొనుటకు తెగించ ప్రోత్సహించుచుండును. సరిగా నీకును యీ గతియే పట్టినది.

క్రైస్త :-నాగురి యేమియో నాకు తెలియును, నాకది అర్థమెరుగని లక్ష్యము కాదు. నాభారము నుండి విముక్తి పొందుటయే నా కోరిక,

లోక :- విముక్తి కిదేమి మార్గమయ్యా పిచ్చివాడా. వెనముకనుండి జారి పొయ్యిలోబడినట్లు మరెంత కష్టమైన మార్గమున బడితివే! వినుటకు ఓర్పుగలదేని నాసలహా వినుము. నీ యాప్సిత మీడేరు మార్గము నేను నీకు చూపుదును. నీవు పోవు యీ మార్గములోని అపాయములకు నీవు గురికానక్కర లేదు. నిజముగా సూక్ష్మములో మోక్షమన్నట్లున్నది, నేను చూపు దారి. మరియు నీవు నమ్ముదువో లేదో గాని నేను చూపు మార్గమునందు పైన చెప్పిన అపాయము లుండవు గాని క్షేమమును, సత్సాంగత్యమును, సంతృప్తియు నీకు దొరుకును.

క్రైస్త:-అయ్యా! ఆ మర్మమగు మార్గమేదో చెప్పి నన్ను రక్షింపుడు!

లోక:-పెద్ద మర్మమేమియు లేదు. అదిగో, ఆ కనబడుచున్నదే ధర్మ కాండమను పట్టణము. అందు కర్మకాండు డను వాడు గలడు. అతడు చాల న్యాయబుద్ధి. ప్రఖ్యాతిగలవాడు. నీవలె భుజములపై భారము గలిగి బాధపడు వారి కందరికి సహాయపడు నేర్పు అతని కున్నది. నిజముగా నా యెరుకనే అనేక మంది కతడీ విధముగా సాయపడినాడు. ఇంతేకాదు తమ బాధలచేత మతి చెడిన వారినికూడ ఆయన బాగు చేయగలడు.

నేను చెప్పినట్టు ఆయన యొద్దకు వెళ్ళిన వెంటనే సహాయము పొందవచ్చును. ఆతని యిల్లు ఇక్కడికి ఒక మైలు లోపున నున్నది. ఒకవేళ అతడు తన యింటి యొద్దలేని యెడల అతని కొక చక్కని కుమారుడు గలడు. అతని పేరు మర్యాదకాండుడు. ఇతడు కూడ తన తండ్రియైన ధర్మకాండునివలెనే యీ పనిని నీకు చేయగలడు. అక్కడ నీ భారము తొలగి పోవునని నేను గట్టిగా చెప్పుచున్నాను. అప్పుడు ఒకవేళ నీ పూర్వ నివాసమునకు వెళ్ళుటకు నీ కిష్టము లేని యెడల మంచిది, నీ భార్య పిల్లల నిక్కడికే తెప్పించుకొని యీ గ్రామమందు నివసించవచ్చును. ఇక్కడ అనేక గృహములు ఖాళీగా నున్నవి. స్వల్ప బాడుగ కొక యింటిని తీసికొని నివసింపవచ్చును. అక్కడ భోజనపు సరుకులు కూడ తక్కువ వెలకు దొరుకును. ఇంతకంటె ముఖ్యమైన దేమనగా యిక్కడ నీకు మంచి మర్యాదగల యిరుగుపొరుగుల చేత ఆనందమును సుఖమునైన జీవితము దొరుకును.

అప్పుడు క్రైస్తవుడు కొంచెము సంధిగ్ధములో పడెను. ఈ దొడ్డవాడు చెప్పిన సలహా సత్యమైన యెడల నే నీ మార్గమునే పోవుట లాభకరమని యతడను కొనెను. ఈ భావము నతడిట్లు మాటలాడెను.

క్రైస్త:-అయ్యా, ఆ విశ్వాస పాత్రుని యింటికి దారి యేది ?
లోక:- అదిగో, ఆ పెద్దకొండ కనుపించు చున్నదా ?
క్రైస్త:-ఆహా, చక్కగా కనుపించుచున్నది.
లోక: ఆ కొండ ప్రక్కగా పొమ్ము. నీకు కనబడు మొదటి యిల్లు కర్మకాండునిదే.

# కర్మకాండుని యింటికి ప్రయాణము.

గనుక క్రైస్తవుడు తన దారి విడిచి సహాయముకొరకు కర్మకాండుని యింటి తట్టు మళ్ళెను. అయితే ఇదిగో అతడా కొండను సమీపించు చుండగా అది బహు ఉన్నతమై యుండి దారివైపున కున్నదాని యంచు బహుగా వాలి మీద బడునట్లుండెను. అందుచేత అది విరిగి తన తలపై బడునేమో యని క్రైస్తవుడు మిగుల భయపడి ముందుకు సాగలేక ఆగిపోయెను. అతడు ముందుకు పోవను వెనుకకు తిరుగను తోచక నిలచి యుండెను. అతడు తన మార్గమునందున్నప్పటికన్న యిప్పుడు మరింత బరువైనట్టు అతని భారము కనబడెను. ఆ కొండ ప్రక్కలనుండి అగ్నిమంటలు బైలు దేరి నలువంకల కొట్టుచుండెను (నిర్గ 19 : 16, 18.) వీటిని చూచినపుడు కాలి పోవుదు నేమో యని క్రైస్తవునికి భయ

ముకలిగెను. ఇక్కడ అతనికి భయమును వణకును పుట్టి ముచ్చెమటలు క్రమ్మెను.

లోకజ్ఞాని మాట నెందుకు వింటినా యని అతడు వగజెంద సాగెను. ఇట్టి యోచనలందుండగా దూర మందతనికి సువార్తికుడు కనబడెను. అతడు క్రైస్తవుని కలసికొనుటకై వచ్చుచుండెను. అతని చూచినప్పుడు సిగ్గుచేత క్రైస్తవుని ముఖము చిన్నబోయెను. అందుచేత సువార్తికు డతని నంత కంతకును సమీపించి అతని వైపు కఠినముగను తీక్షణముగను చూచి అతని నిట్లు మందలింప సాగెను.

సువా :- క్రైస్తవా, యిక్కడ నీ వేమి చేయుచుంటివి ? ఈ మాటలతో క్రైస్తవునికి నోట మాట రాలేదు. కొంత తడవు కిక్కురు మనక అతడట్లే నిలిచి యుండెను. మరియు సువార్తికు డిట్లనెను. నాశనపురము గోడల వెలుపల దుఃఖించుచు పడియుండగా నాకు కనబడిన వాడవు నీవు కాదా ?

క్రైస్త :-అవును, అయ్యా, నేనే వానిని.

సువా :-ఆ కనబడుచున్న దిడ్డి గుమ్మమునకు పొమ్మని నేను నేకు దారి జూపలేదా ?

క్రైస్త :-చూపితివి స్వామి, చూపితివి.

సువా :-అయితే నీవిపుడు తప్పుదారి యందున్నావు. ఇంతలోనే దారి తొలగుట యెట్లు తటస్థించినది ?

క్రైస్త:-నేను నిరాశ యను బురద గుంటనుండి బైటపడగానే నాకొక. పెద్దమనిషి కనుపించెను. నా భారమును తొలగించుకొనుటకీ యెదుట కనబడుచున్న గ్రామమునకుపొమ్మని నన్నతడు బలవంత పెట్టెను.

సువా :- అతని వృత్తి యేమి?

క్రైస్త :-ఏమో. అతడొక మర్యాదస్తునివలె మాత్రము నాకు కనుపించెను. అతడు నాతో విస్తరించి మాటలాడి చివరకు నన్ను ఒప్పించెను. అందుచేత నేనిచటకు వచ్చితిని. గాని యిక్కడి కొండను ఇది త్రోవ మీదికి బాగుగా వ్రాలి యుండుటను చూచినపుడు నా కాళ్లాడుట లేదు. అది నాతలమీద పడునేమో యను భయముచే. నేను హఠాత్తుగా నిలచిపోతిని.

సువా :-ఆ పెద్దమనిషి నీతో నేమిచెప్పెను?

క్రైస్త :- నీవెక్కడికి వెళ్లుచున్నావని యతడు నన్నడిగెను. అప్పుడు నేను నాప్రయాణమును గూర్చి చెప్పితిని.

సువా :-అందుకతడేమనెను?

క్రైస్త :-నీకు కుటుంబము గలదాయని అతడు ప్రశ్నించెను. ఉన్నదని నేనుచెప్పితిని. గాని నామీదనుండి అణచి వేయుచున్న భారముచేత మునుపటివలె వారితో నే నానందింపలేకున్నానని కూడ నేను చెప్పితిని.

సువా :-దీని కతడేమనెను?

క్రైస్త :-నాభారమును త్వరగా తొలగించుకొనుమని యతడు సలహానిచ్చెను. ఎంతో వేగిరముగా తొలగించుకొన నాశపడుచున్నానని నేనంటిని. అందుచేతనే ఆ కన బడుచున్న దిడ్డిగుమ్మము యొద్దకుపోయి విమోచనా స్థలమునకు పోవుమార్గమునుగూర్చి బోధనొందవలెనని పయనమైతినని కూడ నేనతనికి చెప్పితిని. అయితేఅతడు మరింత ప్రశస్తమైన వేరొకస్థలమును నాకు చూపుదు నని ఆశపెట్టెను. మీరుచూపిన మార్గమునందున్న కష్టములు ఆ మార్గమం దుండవనియు, అది యింత కన్న దగ్గరమార్గమనియు నన్ను భ్రమపెట్టెను. అతడు చూపిన మార్గమున పోయినయెడల నాభార మును తీయ నేర్పుగల యొక పెద్ద మనిషి యింటికి నేను పోగలనని యతడు చెప్పెను. అందువలన నేనతని మాటనమ్మి నిజముగా నీ మార్గమునందు పోయిన యెడల నాభారము త్వరగా తొలగిపోవునేమోయని ఆశించి ముందుమార్గమును విడచితిని. అయితే యిక్క డికి వచ్చి యీమార్గముయొక్క నిజస్థితిని గ్రహించి నపుడు గొప్ప అపాయకరమైన స్థితియందుంటినని గ్రహించి మిగుల భయపడితిని. గాని యిప్పుడు కర్త వ్యము గనుపించక వగచుచున్నాను.

సువా :-కొద్దిగా నిలువుము. నేను నీకు దేవునివాక్యములను వినిపింతును.

అంతట క్రైస్తవుడు వణకుచు నిలువబడెను.

సువా :-'మీకు బుద్ధి చెప్పుచున్న వానిని నిరాకరింపకుండు నట్లు చూచుకొనుడి. వారు భూమిమీదనుండి బుద్ధి చెప్పినవానిని నిరాకరించినప్పుడు తప్పించుకొనక పోయినయెడల పరలోకమునుండి బుద్ధిచెప్పుచున్న వానిని విసర్జించు మనము తప్పించుకొనకపోవుట మరి నిశ్చయముగదా' (హెబ్రీ 12 : 25) మరియు, 'నా యెదుట నీతిమంతుడైనవాడు విశ్వాసమూలముగా జీవించునుగాని అతడు వెనుకతీసినయెడల అతనియందు నా ఆత్మకు సంతోషముండదు' (హెబ్రీ 10 : 38) సువార్తికు డింకను యిట్లని అన్వయించెను: నీవు దుఃఖమునకు పరుగెత్తుచున్నవాడవు. మహోన్నతుని యుపదేశమును నీవు నిర్లక్ష్యముచేయ మొదలిడితివి. సమాధాన మార్గమునుండి నీకాలు వెనుకకు తీయ జూచితివి. చివరకు ఇంచుమించుగా నాశనమునకు జారిపోతివి.

అప్పుడు క్రైస్తవుడు "అయ్యో నాకుశ్రమ, నేను నశించిపోతినే" యని అరచుచు సువార్తకుని పాదములయొద్ద చచ్చినవానివలె కూలబడెను. ఇదిచూడగానే సువార్తికు డతని కుడిచేతినెత్తి పట్టుకొని 'ప్రతిపాపమును దూషణయును మనుష్యులకు క్షమింపబడును' (మత్త 12 : 31) అనియు

'అవిశ్వాసివికాక విశ్వాసివై యుండుము' (యోహా 20 : 27) అనియు చెప్పి అతని నోదార్చెను.

అంతట క్రైస్తవుడు కొంతసేద దేరి లేచి ముందు వలెనే వణకుచు సువార్తికుని యెదుట నిలువబడెను. అప్పుడు సువార్తికుడు ఇంకను యిట్లు చెప్పసాగెను. నేను నీ కిపుడు చెప్పబోవు విషయములను సావధానుడవై విని గైకొనుము. నిన్ను భ్రమపెట్టి మోసపుచ్చిన వాడెవడో, వాడెవని యొద్దకు నిన్ను పంప జూచెనో నీకు వివరించెదను. నిన్ను కలసికొన్నవాడు లోకజ్ఞాని. వాని పేరు వానికెంతయు తగియే యున్నది. ఎందుకనగా నీ లోక సంబంధమైన సిద్ధాంత వాదమే అతనికి రుచి. ( I యోహా 4 : 5. ) (అందుకనియే వాడు ధర్మకాండ మనుపురమునకు ఆరాధింప వెళ్లును.) మరియు నీ లోకసిద్ధాంత బోధ వానిని సిలువ యొద్దకు పోవలసిన శ్రమ లేకుండ చేసినందున ఆ బోధ యన్నచో వానికి అత్యంతమగు ప్రేమ(గల 6:12) ఇంతేగాదు. అతడు శరీరానుసారమైన హృదయస్థితిగల వాడగుటచేత నామార్గములు సరళమైనవైనను వాటిని తారుమారు చేయును. వీని బోధ యందు నీవు కేవలము హేయముగా నెంచవలసినవి మూడు విషయము లున్నవి :-

1. వాడు నిన్ను సత్యమార్గము నుండి తప్పించుట.

2. సిలువ యందు నీ కసహ్యము పుట్టించుటకు శ్రమపడుట.

3. మరణ శిక్ష గల మార్గమునకు నీ పాదములను మళ్లించుట.

మొట్టమొదట వాడు నిన్ను సత్యమార్గమునుండిమళ్లించినందుకు నీకు హేయముగా నుండవలెను. ఇంతేగాదు. వాని మాట నీవు విని దారి తొలగుటయే నీకు హేయమైనది. ఎందుకనగా నీవు చేసిన యీ పని దైవజ్ఞానమును విడిచి లోకజ్ఞాని సలహా పొందుటయే. ఇరుకు ద్వారమున ప్రవేశించుడి అని ప్రభువు చెప్పుచున్నాడు. (లూకా 13 : 24.) అదియే నేను నీకు చూపించిన ద్వారము. ఎందుకనగా నిత్యజీవమునకు పోవు ద్వారము యిరుకును ఆ దారి సంకుచితమునై యున్నది. దాని కనుగొనువారు కొందరే. అని ప్రభువు చెప్పుచున్నాడు. ( మత్త 7 : 13, 14. ) ఈ దిడ్డిగుమ్మము నుండియు దాని దారి నుండియు ఆదుర్బుద్ధి నిన్ను తొలగించి నిన్ను ఇంచుమించుగా నాశనమునకు తెచ్చియున్నాడు. గనుక దారి తొలగినందుకు దుఃఖించి వాని మాట వినినందుకు నిన్ను నీవే అసహ్యించుకొనుము.

రెండవదిగా వాడు నీకు సిలువయందు కలిగించిన నిర్లక్ష్యతకు నీవు హేయపడవలెను. ఎందుకనగా ఐగుప్తదేశపు ధనరాసుల కన్న క్రీస్తు సిలువ నీకు అతి ప్రియముగా నుండవలెను. (హెబ్రీ 11 : 25, 26.) మరియు తన ప్రాణమును రక్షించుకొనగోరువాడు దానిని పోగొట్టుకొనును అని

మహిమ రాజు సెలవిచ్చుచున్నాడు. మరియు ఎవడైనను ఆయనను వెంబడించి తన తల్లిని, తండ్రిని, భార్యను, పిల్లలను అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను తుదకు తన ప్రాణమును సహా ద్వేషించని వాడు ఆయనకు పాత్రుడు కాడు. (మార్కు 8 : 38; యోహా 12 : 25; మత్త 10 : 39; లూకా 14:26;) ఏది లేకుండ నిత్యజీవముండదని సత్యము చెప్పుచున్నదో అదియే నీకు మరణమగునని వరుడు బోధించెను. ఇట్టి దుర్బోధను నీవు అసహించుకొనవలెను.

మూడవదిగా నీపాదముల నతడు పెడదారిని పెట్టి మరణ మార్గమున వాటినుంచుటను హేయముగా నీవు పరిగణింపవలెను. వాడు నిన్నెవని యొద్దకు పంపగోరెనో ఆ కర్మకాండుని గూర్చియు నీ భారమును తొలగించుట కతడెంత యశక్తుడో అదియు నీకు తెలిసిన యెడల యీ మార్గము మరణ మార్గమని నీవుగ్రహింప గలవు.

## కర్మకాండుడు.

నీ భారవిమోచనకై యెవని యొద్దకు పంపబడితివో అతని పేరు కర్మకాండుడు. అతని తల్లి యొక దాసి. ఆమె యింకను జీవించియే యున్నది. అది దాని పిల్లలతో కూడ నేడు దాస్యము నందున్నది. ( గల 4 : 22, 27 )

అది గూఢార్థమునందు నీకు భయము కలిగించిన ఈ అపాయకరమగు సీనాయి కొండయే. అయితే ఆమెయు ఆమె పిల్లలును తామే దాస్యము నందుండగా వారు నీ కెట్లు విమోచనము నియ్యగలరు ? గనుక యీ కర్మ కాండుడను వాడు నీ భారమును తీయనే లేడు. ఇంతకు ముందెన్నడును యెవడును తన భారము నుండి ఇతనిచేత విడుదల పొందలేదు. ఇకముందును ఎవడును పొందనులేడు. ధర్మశాస్త్రము చేత నీతిమంతులని యెంచబడుట అసాధ్యము. నీతికార్యములచే నెవ్వడును విమోచనము పొందలేడు. కావున లోకజ్ఞాని పరదేశియు కర్మకాండుడు మోసగాడునై యున్నారు. మరి వాని కొడుకు మర్యాదకాండుడైనను ముఖము తేటయేగాని హృదయమందు వేషధారణ. నీ భారము తీయుటకు వానికిని చేతకాదు. నా మాట నమ్ముము. మూర్ఖులగు యీ మనుష్యులు నీకు చెప్పిన డంబపు మాట లన్నియు వట్టివి. రక్షణ మార్గమునుండి నిన్ను మోసపుచ్చి చీలదీసి నేను నీకు చూపిన దారిలో నుండి నిన్ను తప్పించుటకే ఈ మాటలు చెప్పబడినవి గాని మరెందుకును గాదు.

ఈ మాటలైన పిమ్మట తాను చెప్పిన దంతయు నిజమని ధృఢపరచుమని ఆకాశమువైపు గొప్ప శబ్దముతో పిలచెను. అంతట క్రైస్తవుడు నిలచిన స్థలమందున్న కొండలో నుండి అగ్నియు మాటలును వెలువడగా క్రైస్తవుడు మిగుల

విభ్రాంతు డయ్యెను; అతని శరీరము పులకరించెను. అప్పుడీ మాటలు వినబడెను. "ధర్మశాస్త్రోక్త క్రియాసంబంధు లందరును శాపమునకు లోనై యున్నారు. ఎందుకనగా ధర్మశాస్త్ర గ్రంథమందు వ్రాయబడిన విధులన్నియు చేయుటయందు నిలకడగా నుండని ప్రతివాడును శాపగ్రస్తుడు-అని వ్రాయబడి యున్నది." (గల 3 : 10.)

అప్పుడు క్రైస్తవుడు మరణమును మాత్రమేవాంఛించెను. దుఃఖముతో నతడు కేకలు పెట్టెను. లోకజ్ఞానినే ఈ పాడు గడియలో కలిసికొంటినాయని నిందించుకొనజొచ్చెను. ఇంతేగాక వానిమాట విన్నందుకు తానొక దౌర్భాగ్యుడనని పదేపదే తిట్టుకొనెను. ఔరా, ఆ పెద్ద మనుష్యుని తర్కవాదము శరీరాను సారమైనదే యైనను నన్ను దారి తొలగుటకునచ్చజెప్పునంతటి సమాయానుకూలమై యుండెనే అని క్రైస్తవుడు బహు సిగ్గుపడెను. ఇదియైన పిమ్మట మరి యొకసారి క్రైస్తవుడు మనస్ఫూర్తిగా దీన వాక్కులతో సువార్తికుని నిట్లు బ్రతిమాలెను.

క్రైస్త:-అయ్యా, ఏమి సెలవు, నాకేమైన దారిగలదా? నేను వెనుకకు తిరిగిపోయి దిడ్డిగుమ్మమునకు పోగలనా? నేనీ పని చేసినందు కక్కడ నన్ను విసిరికొట్టి వెనుకకు పంపివేయరు గదా? నేనీ మనుష్యుని సలహా విన్నందుకు బాగుగా బుద్ధివచ్చినది; అయితే నాకు క్షమాపణ దొరుకదా?

సువా:-నీ పాపము చాల ఘోరమైనది. ఎందుకనగా దీనితో నీవు రెండు దుష్కార్యములను చేసితివి. పోరాని మార్గములందు పోవుటకై నీవు క్షేమ మార్గమును విడచితివి. అయినను ఆ ద్వారము నందున్నవాడు నిన్ను చేర్చుకొనును. ఎందుకనగా ఆయనకు మానవులయందు కటాక్షము మెండు. అయితే ఒకటె మాత్రము జాగ్రత్త ! నీవు తిరిగి యీ మార్గమును విడువకుండ జాగ్రత్తపడుము. ఎందుకనగా విడచిన యెడల ఆయన కోపము కొద్దిమాత్రము రగులుకొని నను నీవు మార్గమునందు నశింతువు. (కీర్త 2 : 12).

అప్పుడు క్రైస్తవుడు వెనుకకు పోవుటకు ఆయత్త పడెను. సువార్తికు డతనిని ముద్దుబెట్టుకొని చిరునవ్వు నవ్వి యతని దీవించి పంపెను. అంత నతడు త్వరగా తన దారిని పోయెను. మార్గమందత డెవరితోను మాటలాడలేదు. ఎవరైన నేదైన అడిగిన యెడల వారికి జవాబియ్యను లేదు. తన మార్గమందతడును అపాయకరమైన పోరాని స్థలములందు నడచినట్టే నడచి తిరిగి తానెక్కడ లోకజ్ఞానిమాటలు విని దారి తొలగెనో అక్కడికి వచ్చి చేరెను. అందుచేత కాలక్రమమున క్రైస్తవుడు దిడ్డి గుమ్మమును జేరెను.

# క్రైస్తవుడు ద్వారమున ప్రవేశించుట.

"తట్టుడి మీకు తీయబడును" అను మాటలు ఆ ద్వారముపైన వ్రాయబడి యుండెను. (మత్తై 7 : 7) అందుచేత క్రైస్తవుడు పదేపదే తట్టుచు నీ పాట పాడెను:

ఇందు చేరవచ్చునా - స్వామిచోటు నిచ్చునా
దారి తప్పిపోతిని - ఘోరపాపి నైతిని.
చేరి పాట పాడుకొందు - ఉన్నత స్థలంబులో
సన్నుతింతు స్వామిని - ఇందు చేరవచ్చునా

అతడింకను తట్టుచుండగా ప్రసన్న చిత్తుడను గౌరవనీయుడొకడు గుమ్మము నొద్దకు వచ్చి నీవెవరవు? ఎక్కడి నుండి వచ్చితివి, నీకేమి కావలయును. అని క్రైస్తవుని నడిగెను.

క్రైస్త:-అయ్యా నేను పాపభారము మోసికొనుచున్న యొక దౌర్భాగ్యుడను. నాశనపురమునుండి బైలుదేరివచ్చితిని గాని సియోనుకొండకు ప్రయాణమై పోవుచున్నాను. రాబోవుయుగ్రతనుండి తప్పించుకొనుటకై అక్కడకు పోవుచుంటిని. ఈ ద్వారముగుండా అక్కడకు మార్గమున్నదని వింటిని గనుక స్వామీ, దయతో నన్ను లోనికి రానిచ్చుట మీ కిష్టమా యని ప్రార్థించుచున్నాను.

ప్రస:- నాకు మనసార యిష్టమే. ఈ మాట యనుచు అతడు ద్వారమును తెరచెను. అంతట క్రైస్తవుడు కాలు లోనికి పెట్టుచుండగా ప్రసన్నచిత్తు డతనిని తటాలున ముందుకు లాగెను. అందుకు క్రైస్తవుడు ఎందుకిట్లు చేసితివని ప్రసన్నచిత్తు నడుగగా అతడిట్లు జవాబిచ్చెను.

ఈ ద్వారమునకు కొద్దిదూరము నందొక పెద్ద కోట గలదు. దానికి బయల్జెబూబు అనువాడు అధిపతి. వాడును వాని యనుచరులును ఇక్కడకు వచ్చువారిమీద బాణము వేసి బాటసారులను లోనికి రాకముందే చంపజూతురు. అందుకు క్రైస్తవుడు తన కానందమును వణకును కూడ కలుగుచున్నదని చెప్పెను. అతడు లోపలికి పోయినపుడు తనకు దారి చూపిన వారెవరని ప్రసన్నచిత్తుడు ప్రశ్నించెను.

క్రైస్త:- సువార్తికుడు నన్నిక్కడకు పోయి తలుపుతట్టుమని ఆజ్ఞాపించెను; నే నట్లేచేసితిని. మరియు నేను పోవలసిన మార్గమును తమరు నా కెరుగింతురనికూడ సువార్తికుడు చెప్పెను.

ప్రస:- నీయెదుట తీయబడిన ద్వారమొకటి గలదు; దాని నెవడును వేయలేడు.

క్రైస్త:- ఆహా నాకష్టములకు ఫలము నేడుగదా దగ్గిరపడుచున్నది.

ప్రస:- అయితే నీవు ఒంటరిగానే వచ్చితివేల?

క్రైస్త:- ఎందుకనగా నా యపాయస్థితిని నేను గుర్తించితిని గాని నా పొరుగువారు తమ యపాయస్థితిని గమనింపనే లేదు.

ప్రస:- నీవు వచ్చుచున్నట్లు వారెవరైన నెరుగుదురా ?

క్రైస్త:- ఎరుగకేమి, నా భార్య బిడ్డలు నేను మొదటబయలు దేరుచుండగా చూచిరి. మరియు వెనుకకు మళ్ళుమని వారు నన్ను కేకలు పెట్టిరి. ఇంతే కాదు. నాయిరుగు పొరుగులు కొందరు నా వెనుక అరచుచు వెనుకకు రమ్మని బొబ్బలిడిరి. గాని నేను మాత్రము చెవులయందు వ్రేళ్లుంచుకుని నా దారిని బడి వచ్చితిని.

ప్రస:- అయితే నిన్ను బలవంతపెట్టి వెనుకకు మళ్లించుటకు వారెవరును నిన్ను వెంబడింపలేదా ?

క్రైస్త:- ఆహా వచ్చిరి. మొండియు మెత్తనయు నన్ను వెంబడించిరి. గాని వారు నన్నొప్పించలేనివారై మొండి నన్ను తిట్టుకొనుచు వెనుకకు పోయెను. అయితే మెత్తన మరి కొంతదూరము నాతో వచ్చెను.

ప్రస:- అయితే అతడు ఇంతవరకును రాలేదేల ?

క్రైస్త:- నిజమునకు నిరాశగుంట వరకును వచ్చితిమి. దానిలో మేమిద్దరము పడుటకూడ జరిగినది. అప్పుడు నాసహచరుడు మెత్తన మెత్తబడిపోయెను. అతడికరా తెగింపలేదు. అందుచేత గుంటలోనుండి తన యింటి

వైపున గట్టునెక్కి ఆధీర దేశమును నీవే యనుభవింపుము, నాకక్కర లేదనుచు నన్ను విడిచి తనయింటికి పోయెను. నేను మాత్రము నా దారిని వచ్చితిని. మెత్తన పోయి మొండిని జేరెను. నేను వచ్చి యీ గుమ్మమును జేరితిని.

ప్రస:- అయ్యో. వెర్రివాడు. నిత్యమహిమను చేరుటకు కొద్ది మాత్రపు కష్టములను సహించలేకపోయెనే. ఆ నిత్య మహిమ యొక్క విలువ నెంత చులకనగా జూచినాడు!

క్రైస్త:- నిజమే. మెత్తనను గూర్చి నీ యెదుట నిజము పలికితిని. గాని అప్పటి నానిజస్థితిని కూడ చెప్పిన యెడల నేనును అతనికన్న బుద్ధిమంతునివలె ప్రవర్తించ లేదు. అతడు వెనుకకు దిరిగి తన యింటికి పోయెను. నేనయితే వెనుకకు పోలేదు గాని దారిమాత్రము తప్పితిని. లోకజ్ఞాని యిచ్చకపు మాటలు విని నేనును జీవమార్గమును వదలి మరణమార్గమున బడితిని.

ప్రస:- ఓహో వాడు నీకు కూడ కనుపించెనా? కర్మకాండు నిచేత నీ భారమును పోగొట్టుకొనుమని నిన్ను నమ్మించి అతడు నిన్ను మోసపెట్టినా యేమి? వారిద్దరును బహు మోసగాండ్రు. నీవు వాని మాట విన లేదు గదా?

క్రైస్త:- విని కొంతవరకు తెగించితిని. కర్మకాండుని యింటిని వెదకుకొనుచు కొంతదూరము పోతిని. గాని అతని

యింటివద్దనున్న కొండ విరిగి నా నెత్తినబడి నలుగ
గొట్టునని భయపడి ఆగిపోతిని. ఇకముందుకు కాళ్లు
సాగలేదు.

ప్రస:- అవును ఆ పర్వతము మునుపనేకులను పొట్టను బెట్టు
కొన్నది, ఇక ముందుకూడ అనేకులు దాని పాలుబ
డనున్నారు. ఇంకను మేలు. నీవు దానిక్రింద బడి
తుత్తునియలు గాకుండ తప్పించుకొని వచ్చితివి.

క్రైస్త:-మేలుగాకమరేమి? నేనక్కడదుఃఖములోబడి యోచిం
చుచుండగా నా యదృష్టవశాత్తు సువార్తికుడు
మరలవచ్చి నన్ను కలిసికొనని యెడల నా పనియేమై
యుండెడిదో గదా! గాని అతడు వచ్చుట దేవుని
కృపయే. లేనియెడల యిక్కడకు వచ్చు భాగ్యము
నాకు దొరకకపోవును. నేను నిజముగా వచ్చి ప్రభు
వగు నీతో మాట్లాడుటకు తగినవాడనుకాను గాని
అక్కడ ఆకొండ క్రింద నలిగి చచ్చుటకే తగిన
వాడను. అట్టి వాడనెట్లో యిచటకు రాగలిగితిని. ఇది
నాకెంతటి భాగ్యము! అపాత్రుడనైన నన్ను చేర్చు
కొనుటయందు మీ కెంతటి కృప!

ప్రస:-ఇక్కడకు రాకముందు ఎవరెవరెన్నెన్ని చేసినను వారు
వచ్చినపుడు వారిని చిన్నచూపు చూడను. నాయొ
ద్దకు వచ్చు వానిని నేనెంత మాత్రమును త్రోసి

వేయును. (యోహా 6 : 37.) గనుక సుబుద్ధియగు క్రైస్తవుడా, నా వెంబడి కొంచెము సాగిరమ్ము నీవు పోవలసిన మార్గమును బోధించెదను. నీ యెదుట చక్కగా చూడుము. ఈసన్నని మార్గము నీకగపడు చున్నదా? అదియే నీవు పోవలసిన మార్గము. పితరుల వలనను, ప్రవక్తల వలనను క్రీస్తువలనను ఆయన అపొస్తలుల వలనను వేయబడినది. ఒకడు గీతగీచినట్లు ఆదారి తిన్నగానున్నది. ఇదియే నీవు పోవలసినమార్గము.

క్రైస్త : అయితే క్రొత్తవారు దారితప్పినట్లు ఈమార్గమందేమైన వంకరలునుచుట్టులును లేవా?

ప్రస : అవును; ఉన్నవి. దీనితోకలియు దారులనేకములున్నవి. గాని అవి విశాలమైనవియు వంకరమైనవియును. అందుచేతసరియైన మార్గమును తప్పుడు మార్గమును నీవు త్వరగా గుర్తుపట్టవచ్చును. ఎందుకనగా సరియైన మార్గమే యిరుకుగాను తిన్నగాను ఉండునది. (మత్త 7 : 14)

అప్పుడు నేను నా స్వప్నమునందు చూడగా క్రైస్తవుడు తన భుజములపై నున్న భారమును తొలగించి రక్షించరా, యని ప్రసన్నచిత్తు నడిగెను. ఎందుకనగా తన భారమింకను తొలగిపోలేదు, పైగా ఒకరి సహాయమైనను

లేకుండ దాని తొలగించుకొను శక్తియును అతనికి లేదు. అప్పుడు ప్రసన్నచిత్తుడు క్రైస్తవునితో విమోచనాస్థానమునకు నీవు వెళ్లువరకును దానిని ఓర్చుకొని భరించుము. అప్పుడు దానికదియే నీవీపుపై నుండి పడిపోవునని చెప్పెను. అంతట క్రైస్తవుడు తన నడికట్టును బిగించుకొని తన మార్గమున పోవుటకు సన్నద్ధుడయ్యెను. అప్పుడు ప్రసన్నచిత్తుడతనితో నీవు కొంత దూరము ద్వారమునుండి వెళ్లుసరికి నీకు భావసూచకు డనువానియిల్లు కానవచ్చును. అతడు ప్రశస్తమైనవాటిని నీకు చూపునని చెప్పెను. క్రైస్తవుడంతట తన స్నేహితుడగు ప్రసన్నచిత్తుని యొద్ద సెలవు పుచ్చుకొని వెడలిపోయెను.

## భావసూచకుని గృహము

క్రైస్తవుడు నడచిపోయి భావసూచకుని యింటిముందు చేరి అతని తలుపుమీద మరల మరల తట్టెను. తుదకొకడు గుమ్మము నొద్దకు వచ్చి యెవరని ప్రశ్నించెను.

క్రైస్త :- అయ్యా, నేనొక బాటసారిని, ఒకానొక ప్రయోజనార్థము ఈయింటి యజమానిని కలుసుకొనుమని నామిత్రుడు సలహా నిచ్చెను. గనుక నీ గృహస్థునితో మాటలాడ గోరుచున్నాను.

అందుకొ వచ్చినవాడు పోయి తనగృహయజమానుని పిలచెను. అతడు వచ్చి క్రైస్తవుని కలిసికొని అతని యభీష్టమేమని ప్రశ్నించెను.

క్రైస్త :- అయ్యా, నేను నాశనపురవాసిని; సియోను పర్వతమునకు పయనించుచున్నాను. ఈ మార్గమునకు అగ్రమందున్నవాడు ఇక్కడ విచారించిన యెడల మీరు ప్రశస్తవిషయములను నాకు చూపుదురనియు, అవి నా ప్రయాణమందు నాకత్యంత ప్రయోజనకరములగుననియు నాకు చెప్పెను.

భావ :- అట్లయిన లోనికిరమ్ము. నీకు లాభకరమగు వాటిని చూపెదను.

దీపమును వెలిగింపుమని అతని పనివానికి చెప్పి భావసూచకుడు క్రైస్తవుని వెంటబెట్టుకొని వెళ్ళెను. వీరొక లోపలి మందిరమునకు వెళ్లినపుడు తలుపు తీయుమని భావసూచకుడు తన పనివానికి చెప్పెను. అతడు తలుపు తీయగా గోడను వ్రేలాడుచున్న యొక మహాపురుషుని పటము క్రైస్తవునకు కనుపించెను. ఆ పటము లక్షణమిట్లుండెను; అందలి మూర్తి యొక్క కన్నులు ఆకాశము తట్టుపైకెత్తబడి యుండెను. చేతియందు మహోత్తమ గ్రంథములును, పెదవులపై సత్యధర్మమును ఆయన వెనుకవైపున యావత్తు ప్రపంచమును ఉండెను. ఆయన నరులను బ్రతిమాలుచున్న

ట్లుండెను. ఆయన తలపైన బంగారు కిరీటము వెలయుచుండెను.

క్రైస్త :- దీని భావమేమి ?

భావ :- ఈ పటమునందున్నవాడు వేయిమందిలో శ్రేష్ఠుడు. అపొస్తలుడైన పౌలు ద్వారా పలికినట్లు ఆయన యిట్లనుచున్నాడు. 'క్రీస్తునందు మీకు ఉపదేశకులు పదివేలమంది యున్నను తండ్రులు అనేకులు లేరు. యేసు క్రీస్తునందు సువార్త ద్వారా నేను మిమ్మునుకంటిని. గనుక మీరు నన్ను పోలి నడచుకొనువారై యుండవలెనని మిమ్మును బతిమాలు కొనుచున్నాను. నాపిల్లలారా, క్రీస్తు స్వరూపము మీయందేర్పడు పర్యంతము నీ విషయమై మరలనాకు ప్రసవవేదన కలుగుచున్నది.' ( 1 కొరిం 4:15, గల 4 : 19.) మరియు ఆకాశమువైపు కన్నులెత్తినట్లును మహోత్తమ గ్రంథములు చేతనున్నట్లును సత్యధర్మము పెదవులపై వ్రాయబడినట్లును ఆయన నీకు కనబడుచున్నాడు గనుక దీని యర్థమేమనగా మర్మమైన విషయముల నెరిగి పాపులకు వాటిని బయలు పరచుట ఆయనపని. అందుచేతనే నరులను బ్రతిమాలుచున్నట్లుకూడ ఆయన నీకు కనబడుచున్నాడు లోకమతని వెనుక తట్టున పడియున్నట్టును ఆతని

తలపై కిరీట ముంచబడినట్టును నీవు చూచితివి గదా! దీని యర్థ మేమనగా తన యజమానుని సేవ నిమిత్తము ప్రస్తుత సౌఖ్యములను విసర్జించి నందున రాబోవు లోకమందతనికి మహిమ ఫలము దొరుకునని నీకు తెలియజేయుటకై యున్నది. మరియు భావసూచ కుడు క్రైస్తవునితో నిట్లనెను. ఇదిగో నీ కీ పటమును ముందుగా చూపితిని. ఎందుకనగా నీవు పోవుచున్న పట్టణపు రాజు ఈయననే యేకైక మార్గదర్శిగా నియమించి నీకనుగ్రహించెను. నీ మార్గమందు నీకెదురగు సర్వకష్టముల యందును ఈయనే నీకు మార్గదర్శకుడు. గనుక నేను నీకు చూపిన దానిని బాగుగా గమనింపుము. గమనించిన దానిని మనస్సున బాగుగా జ్ఞాపకముంచుకొనుము. ఎందుకనగా నీమార్గమందు చక్కని మార్గమును చూపు వారివలె అనేకులగుపడుదురు. గాని వారి మార్గము మరణమునకే నడుపును.

## ధూళి నిండిన గది

అంతట భావసూచకుడతని చేయిపట్టుకొని ధూళితో నిండిన పెద్దగదిలోని కతని తీసుకొనిపోయెను. ఆగది యెన్నడును ఊడ్చబడలేదు. దీనిని కొంతసేపు పరిశీలించిన పిదప

దానిని తుడుచుటకు భావసూచకు డొకమనుష్యుని పిలచెను. వాడా గదిని తుడుచుచుండగా నందలి ధూళి విస్తారముగా పైకి లేచినందున క్రైస్తవునికి ఊపిరాడలేదు. అప్పుడు భావసూచకు డక్కడ నిలచియున్న యొక చిన్నదానిని చూచి, నీళ్లుకొంచెము తెచ్చి యిచట చల్లుమనెను. ఆమె యట్లు చేసినపుడు ధూళి రేగకుండ చక్కగా నాగదిని తుడవ వీలయ్యెను.

క్రైస్త :- దీని భావమేమి ?

భావ :- సువార్తయను కమ్మని కృపచేత యెన్నడును పరిశుద్ధము చేయబడని యొక హృదయమే యీ గది. అందున్న యాదిపాపములును అంతరంగమందలి అపరాధములును అతనినిసంపూర్ణముగ నపవిత్రపరచినవి. అవియే యీ ధూళి. మొదట తుడువ జూచినవాడు ధర్మశాస్త్రము. అయితే నీళ్లుతెచ్చి చల్లినది సువార్త. నీవు చూచినట్లుగా మొదటివాడు గదిని తుడిచి శుభ్రపరచ జూచినపుడది శుభ్రపడలేదు. గాని ధూళి మరింత పైకెగసి నీకు ఉక్కిరి బిక్కిరియైనది. ధర్మశాస్త్రము పాపికి చేయు పనినిది నీకు సూచనగా చూపుచున్నది. అది పాపిహృదయమును శుద్ధిచేయలేదు గాని పడియున్న పాపమున కది మరల జీవము నిచ్చును. ( రోమా 7 : 9 ) దానికి లేనిసత్తువను

తెచ్చిపెట్టును. ( 1 కొరిం 15 : 56 ) మరియు ఆత్మ యందు దానిని విస్తరింప జేయును.(రోమా 5 : 20) అది పాపమునుచూపి దానిని ఖండించునేగాని పాపము నణచి వేయుటకు హృదయమునకు శక్తి నీయదు. మరియు నొక చిన్నది నీటిని చల్లినపుడు ఆగది చక్కగా హాయిగా శుభ్రమగుట నీవు చూచితివి. దీని భావమేమనగా, మధురమును ప్రశస్తమునగుతన శక్తితో సువార్త హృదయమునందు ప్రవేశించిన యెడల నీటిని చల్లినపుడు ధూళి అణగిపోయినట్లే పాపముకూడ లొంగిపోయి అణగిపోవును. అపుడు హృదయము శుభ్రమై దాని విశ్వాసము చేత మహిమ రాజు ప్రవేశించి నివసించుటకు తగినదగును. ( యోహా 15 : 3; ఎఫె 5 : 26; అపొ 15 : 9; రోమా 16 : 25, 26; యోహా 15 : 13. )

# ఒడిదుడుకు - ఓరిమి

మరియు నేను 'నాస్వప్నమందు చూచుచుండగా భావ సూచకుడు క్రీస్తువుని చేయి పట్టుకొని ఒక చిన్న గదిలోనికి తీసుకొని పోయెను. అక్కడ యిద్దరు చిన్నవాండ్రు తమ తమ ఆసనములపై కూర్చుండి యుండిరి. అందు పెద్దవాని పేరు ఒడదుడుకు చిన్నవానిపేరు ఓరిమి. ఒడిదుడుకు చాల

అసంతృప్తిగా కనుపించెను. గాని ఓరిమి ముఖమునందు నెమ్మది తాండవించుచుండెను. అపుడు క్రైస్తవుడిట్లు ప్రశ్నించెను.

క్రైస్త :- ఒడిదుడుకు చాల అసంతృప్తిగానున్నాడేల ?

భావ :_ ప్రశస్తమైన వాటిని పొందుటకు ఒకసంవత్సరము వరకు ఆగుడని వారి పోషకుడు చెప్పుచున్నాడు. అయితే ఒడిదుడుకు అవియన్నియు యిప్పుడే కావలె ననుచున్నాడు. గాని ఓరిమి మాత్రము ఆగియుండుట కిష్టపడుచున్నాడు.

అప్పుడు నేను చూచుచుండగా నొకడు ఒడిదుడుకు నొద్దకొకసంచిని తెచ్చి అందలి నిధి నంతటిని అతనికాళ్ల యొద్ద కుమ్మరించెను. అంతనాతడు వాటిని సేకరించుకొని ముఖమును చేటంత చేసికొని ఓరిమిని హేళణ చేయుచు నవ్వసాగెను. గాని నేనింకను చూచుచుండగా వాడు వాటినన్నిటిని పాడుచేసికొని చివరకు చింకిపాతల పాలయ్యెను.

అపుడు క్రైస్తవుడు నాకీ విషయము నింకను విస్తరముగా వివరింపుమని భావసూచకుని కోరెను. అందుకు భావసూచకుడిట్లు వివరించెను. ఈ యిద్దరు బాలురును ఉపమానములు. ఒడిదుడుకు ఈలోక సంబంధులకు గుర్తు ఓరిమి రాబోవులోక సంబంధులకు సూచన. నీవు చూచినట్టుగా ఒడిదుడుకు అన్నియు నేడే అనగా నీలోకమందే కావలయునని

కోరును. అట్లే యీ లోకసంబంధులగు వారుకూడ సమస్త సుఖములును యీ లోకములోనే అనుభవింపవలెనని కోరుదురు. వారి ఫలమును పొందుటకు రాబోవు లోకము వరకును ఆగుటకు వారికి ఓర్పుండదు. 'డొంకలోని నెమలికన్న చేతిలోనికి తిత్తిరియే మేలు'- అనుసామెత వారికి సర్వప్రధానముగాని రాబోవు లోకమునందలి ప్రశస్తతను గూర్చి దైవ వాగ్దానము లెన్ని యున్నను వారికి లెక్కలేదు. గాని నీవు చూచినట్లు ఒడిదుడుకు వాటినన్నిటిని పాడుచేసి కొనగా నీతనికి చింకిగుడ్డలు తప్ప మరేమియు మిగులలేదు గదా! అట్టి వారిగతి లోకాంత మందట్లే యుండును.

క్రైస్త:-ఆహా, ఓరిమి మిక్కిలి జ్ఞానియని నాకిపుడు అర్థమైనది గదా! దీనికనేక కారణములున్నవి. ఏవనగా; అతడు ప్రశస్తమైన వాటికొరకు వేచియున్నాడు. మరియు తన యెదుటవానికి చింకిగుడ్డలుతప్ప మరేమియులేనిసమయమందు ఓరిమికి తన మహిమ దొరకుచున్నది.

భావ:-ఇంతేకాదు మరొక విషయమును కూడ నీవు గమనింపవలయును రాబోవులోకములోని మహిమ యెన్నడును వాడబారదు. ఇహలోకపు సౌఖ్యములైతే హఠాత్తుగా మాయమగును. అందుచేత ఓరిమినిచూచి ఒడిదుడుకు అంతగానవ్వ పనిలేదు. ఎందుకనగా వానికి కొద్దిమేలయినవి మొదట కలిగినను ఓరిమికి మరింత

ప్రశస్తమైనవి, అత్యుత్తమమైనవి ముందు దొరికి నపుడు ఒడిదుడుకు మరింత సిగ్గు పడవలెను గదా ? రెండవానికి దీవెనలు కలిగినపుడు మొదటివాడు తొలగ వలెను. గాని రెండవవాడు మరెవరికిని తొలగన క్కరలేదు; ఎందుకనగా వానిని తొలగించువాడు మరొకడెవడును లేడు, తన మొదటి భాగమును మొదట పొందినవాడు వానిని ఖర్చుచేసి కొనకతీరదు. గాని అంతమందు తన ఫలమును పొందినవాడు నిత్య మును వాటిననుభవించుచునేయుండును. అందుకనియే ధనవంతుడు లాజరు చరిత్రయందు ధనవంతుని కీ మాట చెప్పబడినది; 'కుమారుడా నీవు నీ జీవితకాల మంతయు నీకిష్టమైనట్లు సుఖమును అనుభవించితివి, ఆలాగుననే లాజరు కష్టమును అనుభవించెనని జ్ఞాప కము చేసికొనుము. ఇప్పుడైతే వాడిక్కడ నెమ్మది పొందుచున్నాడు, నీవు యాతన పడుచున్నావు' (లూకా 16 : 25.)

క్రైస్త :- ఆహా, అట్లయినచో ఇహలోకపు సంపదలను ఆశింపక రాబోవు మహిమ కొరకు వేచియుం డుట సర్వోత్తమ మని నాకిపుడు గ్రాహ్యమగు చున్నది.

భావ:- మున్మాటికి నిజము పలికితివి. ఎందుకనగా దృశ్య మైనవి నశించిపోవును. అదృశ్యమైనవి నిత్యము నిలు

చును. (IIకొరిం 4 : 18.) ఇది సత్యమే నైనను దృశ్య మగు లోకభోగములును మన శరీరేచ్ఛయు మిగుల మిత్రములు. రాజ్యపు మహిమయు, మన నేత్రా శయు ఒకదాని నొకటి యెరుగవు, ఈకారణ ముచేత ఇహలోక భోగములు శరీరేచ్ఛను త్వరగా సంతోషపెట్టును గాని శరీరేచ్ఛ రాజ్యపు మహిమను త్వరగా గుర్తింపజాలదు. ( రోమా 7 : 15-25.)

# కృ పా గ్ని.

అంతట నేను నా కలయందు చూడగా భావసూచ కుడు క్రైస్తవుని చెయ్యిపట్టి నడిపించుకొని యొక చోటికి తీసు కొనివచ్చెను. అక్కడ యొకగోడ ప్రక్కనొక మంటమండు చుండెను. దానికడ నొకడు నిలుచుండి ఆ యగ్ని నార్పి వేయుటకు ఎక్కువగా నీళ్లు దానిపై పోయుచుండెను. అయితే ఆ యగ్నిమాత్రము అంతకంతకు పైకెగయుచు మరింత తీక్షణమగుచుండెను.

దీనిభావమేమని క్రైస్తవు డడుగగా భావసూచకు డిట్లు చెప్పసాగెను: మానవహృదయమునందు దైవకృప జరిగించు పనియే నీ యగ్ని. దానిపై నీటినిపోసి ఆర్పజూచువాడు అప వాది. గాని వాడెంత ప్రయత్నించినను ఆ యగ్ని మరింత

పై కెగయుచు తీక్షణమగుట నీవు చూచితివి గదా! దానికి హేతువేమియో నీకు చూపెదను రమ్ము. ఇట్లు చెప్పుచు భావసూచకు డతనిని గోడ కవతలివైపునకు తీసుకొని పోయెను. అక్కడ నూనె పాత్రను పట్టుకొనియున్న యొక డుండెను. అతడా నూనెను రహస్యముగా మంటలోనికి మానక పోయుచుండెను.

అదిచూచి క్రైస్తవు డిది యేమని యడిగెను. అందుకు భావసూచకుడు : ఈయన ప్రభువైన క్రీస్తు. హృదయము నందు మొదలు బెట్టిన పనిని తన కృపా సమృద్ధియను నూనె చేత మానక కొనసాగించు చుండెను. ఈ నూనె అందు చున్నందున సాతానెన్ని ప్రయత్నములు చేసినను ఆయన బిడ్డల హృదయములందు కృపాగ్ని ఆరిపోదు. ( 2 కొరింథి 12 : 9.) అయితే నూనె పోయుచున్న ఆ మనుష్యుడు గోడ వెనుక నిలువబడియున్నట్టు నీవు చూచితివిగదా, దీని భావ మేమనగా ఆత్మయందు దేవునికృప యెట్లు నిలచియుండ గలుగుచున్నదో శోధింపబడు విశ్వాసికి మర్మముగా నుండు నని నీకు బోధించుటకే నీకిట్లు చూపబడినది.

## రాజనగరు.

నేను చూచుచుండగా భావసూచకుడు క్రైస్తవుని చేయిపట్టుకొని యొక శృంగారమైన స్థలమునకు తీసుకొని

వచ్చెను. అక్కడ యొక గొప్ప మహారాజభవన ముండెను. అది చూచుటకు రమ్యముగా నుండెను. దానిని చూడగా క్రైస్తవునికి బహు ఆనందము కలిగెను. దాని యంతస్థుపైన బంగారు వస్త్రములు కట్టుకొనియున్న కొందరటు నిటు నడచుచుండగా క్రైస్తవుడు చూచెను.

అప్పుడు క్రైస్తవుడు : మనము లోపలికి పోవచ్చునా అని యడిగెను. అందుకు భావసూచకు డతని చేయి పట్టుకొని ఆ భవన ద్వారము తట్టు తీసికొనివెళ్ళెను. అదిగో, ఆ ద్వారమువద్ద కోటాన కోట్ల నరులు గుంపులుగా నుండి లోనికి పోవ యత్నించుచుండిరి గాని వారు పోలేకపోవుచుండిరి. ఆ ద్వారమునకు కొంచెము దూరమందొక బల్ల యొద్ద ఒక వ్యక్తి కూర్చుండి యుండెను. అతని బల్లపై సిరాయు గ్రంథమును గలవు. లోనికి పోవువారి పేర్లను వ్రాసికొనుటకు అతడు కూర్చుండెను. మరియు ద్వారము వెలుపల కొందరు శత్రువులు ఆయుధములు ధరించి లోనికి పోవువారికి కీడు చేయవలెనని కాచియుండిరి. ఇదంతయు చూచినపుడు క్రైస్తవునికి కొంత యాశ్చర్యము కలిగెను.

చివరకు ఆయుధ సన్నద్ధులగు శత్రువులకు భయపడి అందరును వెనుకకు తప్పుకొనగా ధృఢమైన ముఖవర్చస్సు గలవాడొకడు ముందు కడుగిడి బల్లవద్ద కూర్చున్నవానితో అయ్యా, లోపలికి పోవుటకు నా పేరు వ్రాయుమని చెప్పుట

క్రైస్తవునికి కనబడెను. మరియు నా ధృఢకాయుడు తన కత్తిని దూసి తలకు శిరస్త్రాణమును ధరించి ద్వారము నొద్దనున్న శత్రువుల పైకి బలముగా నురికెను. వారతనికి గాఢమగు గాయములను కలిగించిరి గాని యతడు మాత్రము భయపడక వారిని చిందర వందరగా చీల్చి చెదరగొట్టసాగెను. అంతట తాను అనేక దెబ్బలు తిని తన నడ్డుపెట్టువారి ననేక దెబ్బలు కొట్టిన పిమ్మట వారిని నడిమికిచీల్చుకొని ముందుకు పోయి నగరమున ప్రవేశించెను. (మత్త 11 : 12 అ.కా. 14 : 22) అంతట లోపల నున్నవారును, మేడపై సువర్ణవస్త్రములు ధరించుకొని తిరుగువారును చక్కని స్వరముతో నిట్లు పాడసాగిరి.

రమ్ము రమ్ము సోదరా!
నిత్యమహిమ నీదెరా!!

అప్పుడతడు లోనికిపోయి వారికున్నట్లే మహిమ వస్త్రములను పొందెను. దీనియర్థమునాకు నిశ్చయముగా తెలిసియే యున్నదని క్రైస్తవుడనెను.

## నిరాశ.

అంతక్రైస్తవుడు నాకిక సెలవిచ్చినయెడల పోదుననెను. గాని భావసూచకు డడ్డువచ్చినద్దు–ఇంకను కొన్నివిషయ, ములు నేను నీకు చూపిన పిమ్మట నీ దారిని పోవచ్చుననెను.

ఈమాట చెప్పి యతడు క్రైస్తవుని చేయిపట్టుకొని యొక చీకటి గదిలోనికి తీసుకొని పోయెను. అక్కడ యినుప పంజరములో కూర్చుండియున్న మనుష్యుడొకడుండెను. వాడు చూచుటకు బహుదుఃఖముగనుండెను. వానిచేతులు కట్టుకొని నేలవైపుకు జూచుచు గుండెపగులునట్లు నిట్టూర్పులు విడుచుచుండెను.

అపుడు క్రైస్తవుడు; ఇదేమి యని ప్రశ్నించగా ఆతనితో మాటలాడి చూడుమని భావసూచకుడు క్రైస్తవునికి సలహా నిచ్చెను.

క్రైస్త :- ఓయీ, నీవెవడవు ?

మను :- ఎవరినైననేమి మధ్యలోనే నాకీగతి పట్టినది.

క్రైస్త : అసలు మొదట నీ స్థితియేమి?

మను:- మొదట నేను చక్కని ప్రఖ్యాతిగల మతస్థుడను. (లూకా 8 : 13.) నాదృష్టికినేమును, ఇతరులదృష్టికిని కూడ నేను యోగ్యునివలెనుంటిని. అప్పటిలోపరమపురమునకుసరియైనమార్గమునందేపోవుచుంటిననుకొని అందలియానందమునుగూర్చి కలలు కనుచుండెడివాడను.

క్రైస్త : అయితే యిప్పుడు నీ స్థితియేమి ?

మను : అయ్యో, యిప్పుడునేను నిరాశలో చిక్కుకొనినవాడను. ఈ యినుప పంజరమే ఆ నిరాశ. నేనిక వెలుపలికి రాలేను. అయ్యో నాపని యింతే!

క్రైస్త:-అయితే యీ స్థితిలో నీ వెట్లు పడిపోతివి ?

మను:-నేను మెళకువ గలిగి కనిపెట్టుట మానివేసితిని. నా కోరికలను గుర్రములకు కళ్లెము పెట్టక విడచితిని. దైవవాక్యమును దేవునికృపను యెదిరించి పాపము చేసితిని. నేను దేవుని యాత్మను దుఃఖపరచినందున ఆయన నన్ను విడిచి పోయెను. నేను సాతానును స్నేహించితిని; అతడు వచ్చి నాయందు పీఠము వేసెను. దేవునికి కోపము రేపితిని గనుక ఆయన నన్ను విడిచి పెట్టెను. నా హృదయమును మరి పశ్చాత్తాపము పొందలేనంతగా నేను కఠినపరచుకొంటిని.

క్రైస్త:-ఇట్టిస్థితిలోనికి నిన్ను నీవే యేల తెచ్చుకొంటివి?

మను:-ఎందులకా? శరీరాశలు, నేత్రాశలు లోకభోగముల కొరకై యింత పని చేసికొంటిని. వీటిని అనుభవించుటచేత అమితమగు ఆనందము కలదని యనుకొంటిని. గాని యిప్పుడైతే అవి యన్నియు కుమ్మరి పురుగులవలె నన్ను కరచి పీకి తినుచున్నవి.

ఈ సమయమునందు భావసూచకుడు క్రైస్తవునితో నిట్లనెను: ఈ మనుష్యుని దుస్థితి బాగుగా జ్ఞాపకముంచుకొనుము. అది నీకు నిత్యమును మేలుకొలుపుగా నుండును గాక.

క్రైస్త:-నిజమే, యిది బహు భయంకరమగు స్థితి. నేను మెళకువగానుండి కనిపెట్టునట్లును ఈ మనుష్యుని దుస్థితి

కేది కారణమో దానికి దూరముగా నుండుటకును
దేవుడు నాకు తన కృప ననుగ్రహించునుగాక. సరి;
యిక నేను పోవుటకు వేళయైనది సెలవిప్పింతురా?

భావ:-ఇంకను ఒక్క విషయమును మాత్రము చూపనిమ్ము.
ఆ పిమ్మట నీ దారిని నీవు పోవచ్చును.

ఈ మాట చెప్పుచు క్రైస్తవుని చేయిపట్టుకొని భావ సూచకుడు లోపలనున్న యొక గదిలోనికి తీసుకొనిపోయెను అక్కడ ఒకడు తన పడకనుండి అప్పుడే లేచుచుండెను. అతడు తన బట్టలు ధరించుచు బహుగా అదరి వణకుచుండెను. ఇత డిట్లు వణకుచున్నాడేమి? యని క్రైస్తవుడు ప్రశ్నించెను. అందుకు భావసూచకు డామనుష్యుని చూచి నీ వెందుకు వణకుచున్నావో యీ మిత్రునికి చెప్పుమని యా మనుష్యునితో చెప్పెను.

## న్యాయ తీర్పును గూర్చిన కల

అప్పుడతడీ క్రిందిరీతిగా చెప్పసాగెను:—

"ఈ రాత్రి నిద్రించు చుండగా నేనొక కలగంటిని. ఆ కలయందు చూచుచుండగా, యిదిగో ఆకాశములు బహు నల్లగా మారిపోయెను. మరియు భయంకరమైన మెరుపులును ఉరుములును పుట్టగా నా గుండె మరణావస్థ ననుభ

వించెను. నా కలయందు నేను కన్నులెత్తి చూచినపుడు మేఘములు విపరీతమైన వేగమున పరుగులెత్తెను. అప్పుడు నేనొక మహా ఘోరధ్వనిని వింటిని. మరియు నేను చూచు చుండగా మనుష్య కుమారుని పోలిన యొకడు మేఘారూఢుడై వేలాది తన ఆకాశసైన్యములతో వచ్చెను. వారందరును జ్వలించుచున్న అగ్ని నాలుకలవలె నుండిరి. మరియు ఆకాశమంతయు కాలుచున్న అగ్ని గుండముగా కనుపించెను. అప్పుడు గొప్పశబ్దము 'మృతులారా లేచిరండి తీర్పులోనికి రండి' అని చెప్పుట నేను వింటిని. ఈ శబ్దముతోనే కొండలు పగిలి సమాధులు తెరువబడి అందున్న మృతులు సజీవులై పైకివచ్చిరి. అందు కొందరు బహు ఆనందముతో ఆకాశము వైపు చూచుచుండిరి. అయితే మరికొందరు మిగుల విభ్రాంతులై మమ్మును కప్పుడని కొండలతోను గుట్టలతోను చెప్పుచుండిరి. అప్పుడు నేను చూచు చుండగా మేఘారూఢుడైన మనుష్యకుమారుడు తన చేతనున్న గ్రంథమును విప్పి లోకమంతయు తన యెదుట నిలువవలెనని ఆజ్ఞ యిచ్చెను. అయితే ఆయనకును లోకస్థులకును మధ్య యొక అగ్ని తెర యున్నందున న్యాయాధికారి యెదుట నిలువబడు నేరస్థులవలె వారందరును దూరము నందే నిలచిరిగాని దగ్గరకు రాలేకపోయిరి. (I కొరిం 15 : 51–58 ; 1 థెస్స 4 : 16; యూదా 15; యోహా 5 : 23, 29 ; II థెస్స 1 : 8–10;

ప్రక 20 : 11-14; యెష 26 : 21; మీకా 7 : 13, 17; కీర్త 5 : 4; 50 1-3; మలా 3 : 2, 3; దాని 7 : 9, 10) గురుగులను, పొట్టును, చెత్తను ప్రోగుచేసి అగ్నిగుండమునందు వాటిని పడవేయుడని ఆ మనుష్య కుమారుని యనుచరులకు ప్రకటింపబడుట వింటిని. (మత్త 3 : 12; 13 : 30; 24 : 30; మలా 4 : 1.) అంతలో నేనున్న స్థలమునకు సమీపముగానే మహా అగాధము తెరువబడుట నేను చూచితిని. దాని నుండి ఆ ద్వారముగుండా విస్తారమైన పొగలును, అగ్నియు భయంకరమగు యేడ్పులును పైకి వచ్చెను. ఆయన యనుచరులకే మరల యిట్లు చెప్పబడుట వింటిని. గోధుమలను కొట్లలో సమకూర్చుడి. (లూకా 3 : 17) ఇంతలో అనేకులు మేఘములమీద పైకెత్తబడి కొనిపోబడుట చూచితిని; గాని నేను మాత్రము విడిచి పెట్టబడితిని. ( 1థెస్స 4:16,17) నే నెక్కడనైన దాగుకొనవలెనని కూడ ప్రయత్నించితిని గాని సాధ్యము కాలేదు. ఎందుకనగా నే నెక్కడకు పోయినను మేఘాసీనుడైన వాడు నన్ను చూచుచునే యుండెను. నా పాపములు కూడ నాకెదురయినట్లుండెను. మరియు నా మనస్సాక్షి అనేక విధముల నాపై దోషారోపణచేయుచుండెను. (రోమా 2 : 14, 15) ఇంతలో నేను మేల్కొంటిని'. ఇట్లుచెప్పి యీ వణకుచున్న మనుష్యుడు తన కలను చాలించెను.

క్రైస్త :- ఈ చూచిన దృశ్యమునందు నిన్నంత భయ పెట్టినదేది ?

మను :- ఇంకేమి కావలయును ? న్యాయతీర్పు దినము వచ్చిన దనియు దానికి నేను సిద్ధపడి యుండలేదనియు నేనను కొంటిని. మరియు దేవదూతలు పలువురను సమకూ ర్చుకొని పోవుటయు నేను విడిచి పెట్టబడుటయు చూడగా నాకత్యంత భీతికలిగినది. మరియు నేనున్న చోటనే నరకకూపము నోరు తెరచినందున మిగుల భయపడితిని. నామనస్సాక్షికూడ నన్ను హింసించి బాధలు పెట్టినది. తీక్షణమైన క్రోధదృష్టితో న్యాయా ధిపతి నావైపునకే చూచుచున్నాడని నేననుకొంటిని,

అప్పుడు భావసూచకుడు క్రైస్తవునితో నిట్లనెను; ఈ విషయములన్నిటిని గమనించితివా ?

క్రైస్త :- ఆహా, ఇవి యన్నియు చూడగా నాకు నిరీక్ష ణయు, భయమును కూడ కలుగుచున్నది.

భావ :- మంచిది. ఇవన్నియు నీ ప్రక్కకు మెళుకువ గొలుపు మునుకోలలై నీ మార్గమునందు నిన్ను చక్కగా నడుపునట్లు వీటిని నీ హృదయమునందు జాగ్రత్తగా భద్రము చేసికొనుము.

అంతట క్రైస్తవుడు తన నడికట్టును బిగించుకొని తన ప్రయాణమునకు సన్నద్ధుడగు చుండెను. అప్పుడు భావసూ

చకు డతనితో నిట్లనెను; మంచివాడవగు క్రైస్తవుడా, నిన్ను ఆపట్టణము పోవుమార్గమున నడిపించుటకు ఆదరణకర్త నీతో నెల్లపుడును యుండునుగాక.

# క్రైస్తవుడు సిలువయొద్దకు చేరుట

అంతట నేను నాకలయందు చూడగా క్రైస్తవుడు నడచుచున్న రాజబాట కిరువైపులను భద్రతకొరకెత్తయిన గోడయుండెను. ఈ గోడకు రక్షణ యని పేరు (యెష26 : 1). కాబట్టి భారము మోసుకొనుచు క్రైస్తవుడు ఈమార్గమునందే పరుగెత్తెను. అయితే తన వీపుపైనున్న భారముచేత మహాకష్టముతో సాగిపోయెను.

అతడట్లు పరుగెత్తుచు రానురాను యెత్తగుచున్న యొకస్థలమున వచ్చెను. ఆ యున్నత స్థలమునందొక సిలువ యుండెను; దానికి కొంచెము క్రిందుగా అడుగుభాగమున యొక సమాధి యుండెను. అప్పుడు నేను చూచుచుండగా క్రైస్తవుడు సిలువ యొద్దకు వచ్చినపుడు అతని వీపుమీదనున్న భారము కదలింపబడి జారిక్రిందపడి దొర్లుకొనుచు క్రిందనున్న సమాధిలో పడిపోయెను. పిమ్మట అది యెన్నడును నాకు కనబడలేదు. అంతట క్రైస్తవుని హృదయ భారము తొలగిపోయి ఆనందముతో నిట్లు పాడసాగెను.

'చింతనొంది ప్రభువు నాకు సౌఖ్యమిచ్చెను-
మరణమొంది యేసునాకు జీవమిచ్చెను.'

అప్పుడతడొక గడియ నిశ్చేష్టుడై ఆశ్చర్యముతో చూచుచు నిలువబడెను. ఎందుకనగా సిలువ ప్రత్యక్షమైన పుడు తన భారమంత సులభముగా తొలగిపోవుట అతని కడు చిత్రముగా నుండెను. అందుచేత నతడు సిలువవైపు తిరిగి తిరిగి కన్నీళ్ళు కారువరకు చూచెను. (జెక 12 : 10.) అతడట్లు చూచుచు యేడ్చుచు నుండగా ఇదిగో ప్రకాశించు చున్న ముగ్గురువచ్చి నీకు సమాధానము కలుగుగాక! అని అతనికి శుభము చెప్పిరి. వారిలో మొదటివాడు తనతో 'నీ పాపములు క్షమింపబడియున్న'వనెను. ( మార్కు 2 : 5 ) రెండవ వాడతని చింకి గుడ్డలను తీసివేసి క్రొత్తవస్త్రులను ధరింపజేసెను. (జెక 1 : 13.) మూడవవాడతని నొసటిమీద ముద్రవేసెను. ( ఎఫె 1 : 13 ) వేసి అతని చేతికొక ముద్ర గలిగిన కాగితపు చుట్టను ఇచ్చి, నీవు పరుగుత్తుచుండగా దీనిని చూడుమనియు, మోక్షనగరి గుమ్మమువద్ద దాని నప్పగించుమనియు, చెప్పెను. అప్పుడు వారు తమ దారిని తాముపోయిరి. క్రైస్తవుడు ఆనందముచేత గంతులువేయుచు నీ క్రిందిపాటను పాడెను.

ఇంతవరకు పాపభారము-మోసికొంటిని
నాదుచింత తీసివేయ - లేకయుంటిని
ఇక్కడ నాచింతపోయె - చిక్కులన్ని తీరిపోయె ॥ఇంత॥

ఇదియేనా సంతసపు - పునాది యంటిని
ఇదియేనా విమోచన - చోటు అంటిని
ఇక్కడ నా చింతపోయె - చిక్కులన్ని తీరిపోయె ॥ఇంత॥
పాప పాశమిచట తెగుట - తెలిసికొంటిని
సిలువ సమాధులకు స్తుతులు - పాడుకొంటిని
ఇందుగదా యేసుస్వామి - పొందె మరణ బాధనాకై ॥ఇంత॥

# మతిహీనుడు-మందకొడి-మొండితెగువ.

నేనింకను నా స్వప్నమందు చూడగా, క్రైస్తవుడు నడచి నడచి కొండ పల్లమునకు సాగుచుండెను. అక్కడ కొంచెము దారిప్రక్కగా ముగ్గురు మనుష్యులు కాళ్ళకు సంకెళ్లు గలిగి గాఢ నిద్రయందుండిరి. అందొకని పేరు మతి హీనుడు, రెండవవాని పేరు మందకొడి, మూడవవాని పేరు మొండితెగువ. ఈరీతిగావారు పడియుండుట క్రైస్తవుడుచూచి నపుడు ఒకవేళ వారిని మేల్కొలుప గలనేమో యని వారిని సమీపించి యిట్లని అరచెను; 'ఓడకొయ్యమీద ఒళ్లుమరచి నిద్రించు చున్నట్టున్న బుద్ధిహీనులారా లెండి;(సామె 23:34) మృత్యుసముద్రము మిమ్మును మ్రింగివేయుచున్నది. అగాధ మగు గోతిలో మీరు పడనున్నారు. త్వరగా లేచి, తప్పించు కొని రండి. మీసంకెళ్లను మీకిష్టమైన యెడల నేనులాగి వేతును గర్జించుసింహమువలె తిరుగువాడు (1 పేతు 5 : 8)

సమీపించినయెడల వాని కొరకల కెరమైన వారు నశింతురని'
క్రైస్తవుడు వారికి చెప్పెను.

ఈ మాట విని వారుకన్నులు పైకెత్తి అతని వైపు
చూచి; 'ఎక్కడి అపాయమయ్యా, నాకు నమ్మకములేదు'
అని మతిహీనుడనెను. 'ఇంకను కొంచెముసేపు నిద్రపోనిమ్ము'
అని మందకొడి యనెను. 'నీపని నీవు చూసుకొనుము'ని
మొండితెగువ యనెను. ఇట్లని వారుముగ్గురును తిరిగి నిద్రలో
పడిరి. క్రైస్తవుడు మాత్రము తనదారిని పోయెను. ఆహా,
దయదలచి నేనే అపాయమునందు నిద్రించుచున్న వారిని
వేడితిని, సలహా నిచ్చితిని, వారి సంకెళ్ళను సహితము విడ
గొట్టెదనంటిని. అంతటి యపాయము నందున్నను నా సహా
యమును వారు నిర్లక్ష్యపెట్టి త్రోసివేసిరి గదా యని క్రైస్త
వుని హృదయము వారికొరకు చింతించుచునే యుండెను.

## ఆచారవాది - వేషధారి.

క్రైస్తవు డిట్లు చింతించుచు పోవుచుండగా నొకచోట
త్రోవ కెడమవైపు గోడమీదనుండి యిద్దరు మనుష్యులు
దొర్లుచు పడి యతనిని కలిసికొనిరి. అందొకనిపేరు ఆచార
వాది, రెండవ వానిపేరు వేషధారి. వారిద్దరును క్రైస్తవుని
కలిసికొనినపుడు అతనితో వారు సంభాషణకు మొదలిడిరి.

క్రైస్త:-అయ్యలారా, మీ రెక్కడివారు? ఎక్కడికి పోవు చున్నారు ?

ఆచా. వేష:-మేము డంభకీర్తి యను దేశస్థులము. పొగడ్త సంపాదించుటకు సియోను కొండకు వెళ్లుచున్నాము.

క్రైస్త:-అయితే యీ మార్గమునకు కట్టెదుట నున్న ద్వారముగుండా మీరేల రాలేదు? ద్వారముకాని ద్వారమున ప్రవేశించువాడు దొంగయు దోచుకొను వాడునై యున్నాడను మాటను మీరుచదువలేదా? (యోహా 10 : 1)

ఆచా. వేష:-ఆ ద్వారముగుండా ప్రవేశింపజూచుట చుట్టును, కష్టమును అని మా దేశస్థులు చెప్పిరి. అందుచేత మేము సాధారణముగా దగ్గరగానున్న సులభ మార్గమును చూచుకొందుము. ఇప్పుడు మేము దుమికినట్లు గోడమీదనుండి దుమికిన యెడల సులభముగా తేలి పోవును.

క్రైస్త:-అయితే మనము పోవుచున్న పట్టణపు ప్రభువు చూపిన మార్గమును అతిక్రమించిన యెడల అది ఆయన యెడల నేరము గదా?

ఆచా. వేష:-దీని విషయమై నీవింత వేదన పడనక్కరలేదు. మేమిప్పుడు చేసినపని క్రొత్తగాదు. ఇప్పటికి వేలాది

సంవత్సరములనుండియు ఈ పద్ధతి ఉండనే యున్నది. కావలసిన యెడల దీనికి సాక్షులను చూపగలము.

క్రైస్త:-మీకు పద్ధతి యుండిన నుండవచ్చును గాని అది న్యాయ సమ్మతమా?

ఆచా. వేష:-కాకేమి? న్యాయాధికారి న్యాయమాలోచింపవలయునేగాని తాతముత్తాతలనాటినుండియు నున్న యాచారము ధర్మ సమ్మతము కాకుండునా? ఇంతే కాదు. అసలు యెట్లు ప్రవేశించినను మార్గమునందు ప్రవేశించితిమా, లేదా? దారిలో నుండుటయే ముఖ్యముగాని ఎట్లు వచ్చిననేమి? నీవు ద్వారముగుండా వచ్చితివి కాబోలును. మేము గోడమీదనుండి వచ్చితిమి. నీవు మార్గమందుంటివి, మేమును మార్గమునందే యున్నాము. ఇంక నీగొప్పయేమి? మాతక్కువయేమి?

క్రైస్త :-నేను నా యజమానుని నిర్ణయముచొప్పున నడచుచున్నాను. మీరైతే మీ మూర్ఖపుబుద్ధినిబట్టి నడచుచున్నారు. ఈ మార్గమునకు ప్రభువైనవాడు అప్పుడే మిమ్మునుదొంగలనిలెక్కగట్టినాడు. ఈమార్గముయొక్క గమ్యస్థానమునందు మీరు యథార్థవర్తనులుగా పరిగణింప బడరేమో! ఆయన నడిపింపలేకుండ మీకు మీరే వచ్చుచున్నందున ఆయన కృప లేకుండా మీకు మీరే వెలుపలికి పోవలసి యుండునేమో!

దీనికి వారేమియు జవాబియ్యలేదు. నీపని నీవు చూచుకొనుమని మాత్రము చెప్పిరి. అంతట నేను స్వప్నమందు చూడగా వారొకనితో నొకడు విస్తరించి మాట్లాడక యెవరి దారిని వారు పోవుచుండిరి. గాని వారొక మాటమాత్రము క్రైస్తవునికి చెప్పిరి- "ధర్మశాస్త్రమును, న్యాయకట్టడలను నీవే కాదు. మేముకూడ హృదయపూర్తిగా ననుసరించుచుము. నీకును మాకును భేదమేమనగా నీపైనున్న ఆ పైవస్త్రము తప్ప మరొక భేదము లేదు. దిసమొల సిగ్గు కనబడకుండునట్లు ఎవడో దానిని నీకు పారవేసిరని మాకు తోచుచున్నది."

దానికి క్రైస్తవుడిట్లు ప్రత్యుత్తర మియ్యసాగెను: మీరు ద్వారముగుండా రాలేదు గనుక ధర్మశాస్త్రముచేతనైనను, మతాచారముల చేతనైనను రక్షింపబడలేదు. (గల 2 : 16) నాపైనున్న వస్త్రముసంగతి యేమందురా? నేను పోవుచున్న ఆ పట్టణపు ప్రభువు నాకిది యనుగ్రహించెను. అది మీరన్నట్టు నేను వస్త్రహీనుడుగా నుండకుండ ఆయన యిచ్చినది. ఆయన తనదయను నాపై చూపినట్టు నాకు గురుతుగానున్నది. ఎందుకనగా నా కంతకుముందు చింకి గుడ్డలుమాత్రమే యుండెను. మరియు నామార్గమందు పోవుచుండగా నన్ను నేనీలాగు ధైర్యపరచుకొందును. ఏలాగనగా: ఆ పరమపుర ద్వారమునొద్దకు వచ్చినపుడు తానిచ్చిన యీ వస్త్రమునుచూచి ఆప్రభువు నన్ను అంగీకరించును. ఎందు

కనగా నా ప్రాతపేలికలను తీసివేసి తానే యీ వస్త్రమును నా కుచితముగా నిచ్చెనుగదా. మరియు క్రైస్తవుడు వారితో నింకను యిట్లు చెప్పెను : ఇంతేగాక నానొసట నొక గుర్తున్నది. దానిని బహుషః మీారు చూచియుండరు. నా వీపు నుండి భారము పడిపోయిననాడు నా ప్రభువుయొక్క మిక్కిలి ఆప్తులలో నొకడు ఆ గురుతును నానొసటి యందుంచెను. మరియు ముద్రవేయబడిన కాగితపు చుట్టయొకటికూడ నా చేతికియ్యబడెను. నేను నామార్గమునపోవునపుడు నేను చదువుకొనునట్లు అది నాకియ్యబడెను. మరియు నేను వెళ్లబోవు పట్టణమునందు నిస్సందేహముగా ప్రవేశము దొరకుననుటకు సూచనగా నీకాగితపు చుట్టనక్కడ ద్వారముయొద్ద యిచ్చివేయవలయునని నాకు ఆజ్ఞయైనది. ఇవియన్నియు మీాకు దొరకలేదని నానమ్మకము. మీారు సరియైన ద్వారమునుండి రాలేదు కనుకనే యివి మీాకు దొరుకలేదు.

ఈ మాటలకు ఆచారవాదియు, వేషధారియు మారు పలుకలేదు. వారొకనినైపొకడు చూచుకొని నవ్వుమాత్రము నవ్విరి. ఆ పిమ్మట నేను స్వప్నమందుచూడగా వారుముగ్గురును ఒకనితోనొకడు మాటలాడక నడచిపోవుచుండిరి. క్రైస్తవుడు మాత్రము ముందు నడచిపోవుచు తనలోతాను అప్పుడప్పుడు మాట్లాడుకొనుచుండెను. అతడు కొన్నిసార్లు దుఃఖముతోను, మరికొన్నిసార్లు ఆనందముతోను తనలో తాను

మాట్లాడుకొనుచుండెను. మరియు అప్పుడప్పుడు మహిమ వస్త్రములు ధరించిన పురుషుడిచ్చిన కాగిత ౘుట్టను మాత్ర మతడు చదువుకొనుచు ఆదరణ పొందుచుండెను.

# మూ డు దా రు లు.

వారందరును నడచినడచి తుదకు ఇబ్బందియను కొండ దరికి వచ్చిరి. ఆ కొండక్రింద నొక నీటియూటగలదు. ఆ స్థల మందు చూడగా దిడ్డిగుమ్మమునుండి వచ్చినదిగాక మరి రెండు దారులు కనబడెను. ఆ రెండుదారులు కొండకు దిగువ కుడివైపున నొకటియు ఎడమవైపు నొకటియు పోవుచుం డెను. అయితే యిరుకుమార్గము మాత్రము తిన్నగా కొండ పైకి పోవుచుండెను. ఆదారి కొండకెక్కువైపునకే యిబ్బంది యను పేరుగలదు. అంత క్రైస్తవుడు నీటియూట యొద్దకు పోయి (యెష 49 : 10) శీతలమగు జలమునుత్రాగి సేద దేరెను. అప్పుడతడీక్రిందిపాట పాడుచు కొండయెక్కెను.

ఎత్తుకొరకు రాళ్లకొండ – నెక్కిపోదును
కత్తివంటి కష్టమైన – కాచుకొందును ॥ఎత్తు॥
జీవమునకు మార్గమిదియె – భావమందు బోధపడియె
జీవుడా! భయంబువలను చావులేదు చింతవలదు॥ఎత్తు॥
సులభమనుచుచూచుకొనక–తప్పుదారిత్రొక్కరాదు
దూరమైన, భారమైన–అసలుదారి విడువరాదు॥ఎత్తు॥

మిగత యిద్దరునుకూడ కొండదరికి వచ్చిరి. గాని కొండబహు ఎత్తుగాను అపాయకరముగాను కనబడినందున ప్రక్కదారులను చూచిరి. ఒకవేళ కొండ యవతలప్రక్కను యీరెండు దారులుకూడ క్రైస్తవుడు పోయినదారినే కలుసుకొనునని వారు తలంచి ఆ రెండుదారులను వారు పోవుటకు నిశ్చయించుకొనిరి. ఆ దారులలో నొకదాని పేరు అపాయము. రెండవదాని పేరు నాశనము. అందుచేత వారిలో నొకడు అపాయమను దారినపడి యొక అరణ్యమును చేరెను. రెండవవాడు తిన్నగా నాశనమను దారినపోయి చీకటికొండలుగల స్థలమునకు పోయెను. అయితే వాడక్కడ తూలిపడి మరెన్నడును లేవలేదు.

నేను స్వప్నమందు చూడగా క్రైస్తవుడు కొండ నెక్కుచుండెను. అతడు పరుగును చాలించుకొని కొంతవరకు నడకను పోయెను. మరికొంత సేపటికి నడకనుకూడ చాలించుకొని కాలుసేతులతో ప్రాకవలసివచ్చెను. ఎందుకనగా నా కొండ అంత యేటవాలుగా నుండెను.

## రమ్యమైన పొదరిల్లు

ఆ కొండ శిఖరమునకు పోవు మార్గ మధ్యమున యొక చక్కని పొదరిల్లుండెను. అలసిపోయిన ప్రయాణికులు విశ్ర

మించుటకు ఆ కొండ యజమానుడా యాకు టింటిని కట్టిం చెను. క్రైస్తవు డక్కడికి వచ్చినపుడు విశ్రాంతి తీసుకొను టకై ఆ పొదరింట కూర్చుండెను. అప్పుడు తన రొమ్మున నున్న కాగితపుచుట్టను పైకితీసి ఆదరణ కొరకు కొంత చదువ సాగెను. మరియు తనకు సిలువ యొద్ద బహుమతిగా నియ్యబడిన తనపై వస్త్రము నతడు క్రొత్తగా పరిశీలింప సాగెను. ఈ రీతిగా ఆనందించుచు కొంత సేపుండు సరికి క్రైస్త వునికి కునుకుపాట్లు వచ్చెను. కునుకుపాట్లు ముదిరి గాఢనిద్ర యైనందున సించుమించు చీకటియగు వరకు క్రైస్తవు డచట ఆగిపోవలసివచ్చెను. నిద్రలో తన చేతనున్న పుస్తకపుచుట్ట జారి క్రిందపడెను. ఇట్లతడు నిద్రించుచుండగా నెవఁడో అతని యొద్దకువచ్చి "సోమరీ, చీమల యొద్దకుపోయి బుద్ధి తెచ్చు కొనుము" అనుచు నతని మేల్కొలిపెను. (సామె. 6 : 6) దానితో క్రైస్తవు డులికిపడిలేచి తనదారిన బడి కొండశిఖర మునకు త్వరగా నడచివచ్చెను,

## పిరికియును, సందేహియును.

క్రైస్తవుడు కొండశిఖరమును చేరుసరికి యిద్దరు మను ష్యులతని కలుసుకొనుటకు త్వరగా పరుగెత్తి వచ్చిరి. అందొ కని పేరు పిరికి, రెండవవాని పేరు సందేహి. వారితో క్రైస్తవు డిట్లనెను. సోదరులారా మీరు దారి కెదురు తిరిగి పరుగెత్తు

చున్నారేల? అందుకు పిరికి యిట్లని జవాబిచ్చెను. మేము సియోనుపురమునకు ప్రయాణమై యింత వరకును వచ్చితిమి. గాని పోవుకొలదిని మా కష్టములంత కంతకు యెక్కువగు చున్నది. గనుక వెనుకకు తిరిగి వెళ్ళిపోవుచున్నాము. ఇంతలో సందేహి అందుకొని: అవును, ఎందుకనగా మాకు యెదుట రెండుసింహములు కనబడినవి. అవి నిద్రించుచున్నవో మేలు కొన్నవో మాకు తెలియదుగాని, ఇంకె రెండడుగులు ముందుకు వేసిన యెడల మమ్మునవి తుత్తునియలు చేసియుండును- అనెను.

క్రైస్తః-అట్లయితే మీరు చెప్పిన దానిబట్టి నాకునుభయమగు చున్నదే! అపాయమునుండి తప్పించుకొనుటకు నే నెక్కడికి పరుగెత్తవలయును? నా దేశమునకు తిరిగి పోవలెననుకొంటినా, దానికి అగ్నియు గంధకమును సిద్ధముగానున్నవి. అక్కడనైనను నేను చచ్చుట నిజమే. నిత్యజీవ పురమునకు పోతినా అక్కడ మాత్రము నాకు క్షేమమున్నది. వెనుకకు పోవుట యనగా మరణపు నోటియందడుగు పెట్టుటయే. ముందుకు పోవుటలో మరణభయమున్నను దానిపైన నిత్యజీవమున్నది. గనుక నేను ముందునకే పోయెదను.

అప్పుడు పిరికియు సందేహియు కొండ దిగి వెనుకకు పోయిరి. క్రైస్తవుడు మాత్రము తన దారిని పైకిపోయెను.

గాని ఆ మనుష్యులు చెప్పిన మాటలను తలంచినపు డతనికి భయము కలుగగా ఆదరణ కొరకు చదువుకొనవలెనని తన రొమ్మున కాగితపుచుట్ట తడవి చూచుకొనెను. గాని కాగితపుచుట్ట దొరుకలేదు. అంతట క్రైస్తవుని కమితమైన దుఃఖమును ఆందోళనయును కలిగి యేమి చేయను తోచలేదు. ఎందుకనగా అతని నాదరించు నదియును నిత్యజీవపురమునందతనికి ప్రవేశమిచ్చు నదియును ఆ కాగితపు చుట్టయే. అందుచేత నతడు బహుకలతజెంది యేమిచేయను తోచక యుండెను.

తుట్టతుదకు తాను మార్గమధ్యమున పొదరింటిలో మందమతియై నిద్రించితినన్న సంగతి అతనికి జ్ఞాపకమువచ్చెను. అతడు వెంటనే మోకరించి తన బుద్ధిహీనమగు పనికి దేవుని క్షమాపణ నడిగి తనకాగితపుచుట్ట వెదకికొనుచు వెనుకకు తిరిగెను. గాని అతడు వెనుకకు నడచినంతసేపును అతని హృదయమందలి దుఃఖము నెవరు చెప్పగలరు? ఒక్కొక్కసారి మూల్గుచు మరియొకసారి దుఃఖించుచు తనాచోట నిద్రించినందుకెంత బుద్ధిహీనుడనని తన్నుతాను తిట్టికొనుచు నడుచుచుండెను. ఆస్థలము కొంచెము సేదదీర్చుటకై నియమింపబడి యుండగా మత్తుగొని నిద్రించుట యెంత పొరబాటని బహుగాచింతించెను. అతని ప్రయాణమునందా కాగితపుచుట్ట అనేకసార్లు ఆదరణ నిచ్చినది. అట్టి మహాభాగ్య

మగునదొకవేళ యెక్కడనైన దొరకునేమో యని అతడు దారికిటునటు వెదకుచునే పోవుచుండెను. ఇట్లు నడచుచు తుదకు తాను ముందు నిద్రించిన పొదరింటిని సమీపించెను. గాని దానిని చూచుసరి కతని దుఃఖము మరింత పొరలిపొరలి వచ్చెను. ఎందుకనగా ఆపూకుంటింటిని చూచినపు డతడు చేసిన బుద్ధిలేని పని మరల స్మరణకు వచ్చెను. ( ప్రక 2 :4 I థెస్స 5 : 6-8. )

ఇంతలోనతడా లతాగుల్మమును జేరెను. అతడచట యొక్కింత తడవుకూర్చుండి వెక్కివెక్కి యేడ్చెను. గాని చివరకు దైవవశాత్తుగా దుఃఖముతో నతడు క్రిందికి చూచుచుండగా నొక పొదక్రింద తన పుస్తకము కనిపించెను. దాని వెంటనే ఆతురతతో నందుకొని వణకుచున్న చేతులతో తన రొమ్మున చేర్చుకొనెను. అయితే ఆకాగితపు చుట్ట దొరకినపు డతనికి కలిగిన యానందము నెవరువర్ణింపగలరు? ఎందుకనగా తాను కోరుకొన్న మోక్షరాజ్యమున కతడు చేర్చుకొనబడుననుట కిదియే అతనికి హామీ. అందుచేత నతడు దాని తన రొమ్మున పదిలపరచుకొని, దానిని తిరిగి తన కంటబడ చేసినందుకు దేవుని స్తుతించి, ఆనందముతోను కన్నీటితోను తన దారిని మరల ప్రయాణము సాగించెను.

అయితే యీసారి కొండయెక్కుట యెంత కష్టమైనదగుపడి నది! అతడు శిఖరమును చేరకముందే ప్రొద్దుకుంకినది. ఈసంఘటనచేత తాను బుద్ధిలేక నిద్రించితినను మాటమరియొక

సారి క్రైస్తవుని స్మరణకు వచ్చినది. అందువలన అతడు తన్ను తానిట్లు నిందించుకొనసాగెను.

ఆహా, పాపిష్ఠి నిద్రా ! నీమూలమునగదా నాప్రయాణము చీకటిపాలయినది ! ఇప్పుడిక సూర్యతేజము లేకుండా నేనెట్లు నడువగలను. చీకటి నా పాదములకు సంకెళ్లవలె చుట్టుకున్నదే ! ఈ పాపము నిద్రచేతనే గదా, యీ రాత్రి నామార్గమందు భయంకర మృగముల శబ్దములు వినుచు సాగిపోవలసి వచ్చినది!

అతడిట్లను కొనుచుండగా సందేహియు, పిరికియు నను వారు చెప్పిన సంగతి కూడ గప్పున జ్ఞాపకము వచ్చినది. సింగములను గూర్చి వారు పెట్టిన భయమతని హృదయములో మెలమెల లాడినది. ఈ మృగములు రాత్రియందు తమయాహారముకై తిరుగుచుండును గదా,ఒక వేళ నేను వాటి కంటబడిన యెడల తప్పించుకొనుట యెట్లు?అవి నన్నుముక్కలు ముక్కలుగా చేయకుండునా ? అని చింతించుచు క్రైస్తవుడు ముందుకు నడువలేక నడచుచుండెను;

## సౌందర్యమను నగరము.

అతడింకను యిట్లు చింతించుచు నడచుచుండగా నతడు కన్నులెత్తిచూచినపుడు రాజకీవిగల యొక పెద్ద భవనము క్రైస్తవుని కంటబడెను. దాని పేరు సౌంద

ర్యనగరము. అది రాజబాటకు ప్రక్కగా నుండెను. (ప్రక 3 : 2; I థెస్స 5 : 7, 8).

అప్పుడు నేను కలయందు చూచుచుండగా నతడు త్వరపడి ముందుకుపోయి సన్నని యిరుకు మార్గమున బడి ద్వారపాలకుని యింటికి కొంచెము దూరమునకు పోయెను. మార్గము బహు సన్నమైనందున అతడు పోవుచుండగా దారిలో రెండు సింహాము లతని కెదురయ్యెను. ఆహా పిరికియు, సందేహియు చెప్పినది వీటిని గూర్చియే గదా యని అతడను కొనెను. ఆ సింగములకు సంకెళ్లున్నవిగాని క్రైస్తవుని కా సంకెళ్లు కనబడలేదు. అందు వలన అతడు మిక్కిలి భయపడి వెనుకకు పోజూచెను. ఎందుకనగా మరణము నోటిలో పడినట్లు అతడు భయపడెను. అయితే ద్వారము దగ్గరనున్న జాగరూకుడను, ద్వారపాలకుడు క్రైస్తవుని చూచి భయముచేత అతడు నిలువబడి వెనుకకు పోనున్నాడని గ్రహించి అతనికిట్లని కేక పెట్టెను: నీ వెందుకు భయపడు చున్నావు? నీ కింకను నమ్మిక లేక యున్నదా? (మార్కు 4 : 40) ఆ సింహాములకు భయపడవద్దు. అవి బంధించ బడినవే. ద్వారపాలకుని హెచ్చరిక విని క్రైస్తవుడు ముందుకు పోయెను. సింహాములు గర్జించెనుగాని అవి వాని నేమియు చేయలేదు. అప్పు డతడు సంతోషముతో చప్పట్లు కొట్టుచు ద్వారపాలకుడున్న ద్వారము నొద్దకు వచ్చి నిలిచెను.

అంతట క్రైస్తవుడు ద్వారపాలకునితో: అయ్యా ఈ యిల్లెవరిది? నేడు నే నిక్కడ బస చేయవచ్చునా? అందుకు ద్వారపాలకుడు: ఈ యిల్లు ఈ కొండకు ప్రభువైన వాడు కట్టించెను. యాత్రికుల క్షేమ భద్రతల కొరకే ఆయన దీనిని కట్టించెను. నీ వెక్కడి వాడవు? ఎందుపోవు చుంటివి- అని యడిగెను.

క్రైస్త:-నేను నాశనపురమునుండి వచ్చితిని; సియోను కొండకు పోవుచున్నాను. గాని చీకటి పడినందున అనుజ్ఞ కలదేని యిక్కడ రాత్రికి తలదాచు కొందును.

ద్వార:- నీ పేరేమి?

క్రైస్త:-ఇప్పుడు నా పేరు క్రైస్తవుడు. గాని పూర్వము నేను భక్తిహీనుడను పేరున పిలువబడితిని. నేను యాఫెతు వంశస్థుడను. దేవుడు షేము గుడారమునందు నివసింపుడని మా పూర్వికుల కాజ్ఞ యిచ్చెను (ఆది. 9 : 27)

ద్వార:-అయితే చీకటిపడి పోయినదే, నీ కింత యాలస్యమెందుకైనది?

క్రైస్త:-ఏమి చెప్పుదును, నేను పెందలకడనే యిక్కడకు వచ్చి యుందునుగాని బుద్ధిహీనుడనై మార్గమధ్యమందున్న ఆకుటింటిలో నిద్రపోతిని. ఇంతటితో సరి పోయినను యింకా ముందువచ్చెడి వాడనే, గాని నిద్రలో నా గుర్తు పట్టమును పోగొట్టు కొంటిని. గాని కొండ శిఖరమువరకు వచ్చి తడవి చూచుకొని

దానిని గానక తారుమారై వెనుకకు పోవలసివచ్చి నది. దుఃఖముతో నేను నిద్రించిన చోటుకు పోయి దైవకృప వలన దానిని కనుగొని యిప్పటికిట్లు చేరితిని.

ద్వార:-మంచిది. ఈ యింటి కన్యకలలో నొకతెను పిలతును. నీ మాటలు ఆమెకు అనుకూలమైన యెడల ఆమె ఈ యింటి మర్యాద చొప్పున లోనికి తీసికొనిపోయి మిగత కుటుంబికులతో నిన్ను చేర్చును.

అంతట ద్వారపాలకు డొక గంట కొట్టగా గుమ్మము నుండి వివేకిని అను పేరుగల కన్యకవచ్చెను. ఆమె సౌందర్యవతియును మర్యాద గలదిగను కనుపించెను. తన్ను పిలిచిన కారణమేమని యామె అడుగగా ద్వారపాలకుడు: ఈ మిత్రుడు నాశనపురమునుండి సియోను కొండకు ప్రయాణమై పోవుచున్నాడు. గాని అలసి యున్నందునను చీకటి పడుట చేతను యీ రాత్రి బస దొరకునాయనినన్నడిగెను. అందుకు నేను నిన్ను పిలిచెదననియు నీవితనితో మాటలాడిన పిదప ఈ యింటి యలవాటుచొప్పున నీవతనికి చేయుదువనియు చెప్పితిని.

అప్పుడామె నీ వెక్కడివాడవు, యెక్కడకు పోవుచుంటివి. అని క్రైస్తవునడుగగా నతడు తనవిషయము చెప్పుకొనెను. మరియు నతడు మార్గమునకెట్లు రాగలిగెనో అని యాకన్య ప్రశ్నించెను. మార్గమం దతనికే మేమి కనిపించె

ననికూడ నా యువతి ప్రశ్నించెను. వీటన్నిటికిని జవాబు క్రైస్తవుడు చెప్పుచునేయుండెను. తుదకామె యతని పేరేమని యడుగగా క్రైస్తవు డిట్లనెను: అమ్మా, నా పేరు క్రైస్తవుడందురు. నాకు తెలిసినట్టు ఈ యింటిని యీకొండకు ప్రభువగు వాడు కట్టించెను. గనుక యిందుండి యీరాత్రి బసచేయవలెనని నాకు మరింత కోరికగానున్నది.

ఈ మాటలకామె చిరునవ్వు నవ్వెనుగాని ఆమె కన్నులనిండ నీరుగ్రమ్మెను. ఈ కుటుంబములోని వారినింకను యిద్దరు ముగ్గురును పిలిచెద నుండుమని యామె చెప్పుచు లోనికిపోయెను. ఆమె గుమ్మము నొద్దకేగి సుబుద్ధి, భక్తి, ప్రేమ యనువారిని పిలిచెను. వారందరును వచ్చి కొంతసేపు క్రైస్తవునితో సంభాషించినపిదప యతనిని ఇంటి లోనికి చేర్చుకొనిరి. ఆయింటి గుమ్మములోపల అనేకులతని కలిసికొని "ప్రభువుచే దీవింపబడినవాడా రమ్ము. ఈ కొండకు యజమానుడు నీవంటి యాత్రికులకే ఈ యింటిని కట్టించెను" అని యాహ్వానించిరి.

అప్పుడతడు వినయపూర్వకముగ తలవంచి వారివెంబడి లోనికి పోయెను. అతడు లోపలికి వచ్చి కూర్చుండినపుడు వారతనికి త్రాగుటకు చల్లని పానీయమునిచ్చి భోజనము సిద్ధమగువరకును కాలముగడుపుటకు ఒకరివెనుక నొకరతనితో సంతోషముగాసంభాషణచేయుటకునిశ్చయించుకొనిరి. కాబట్టి

భక్తి, సుబుద్ధి, ప్రేమయను ముగ్గురును క్రైస్తవునితో సంభాషింప మొదలిడిరి.

## భక్తి అను నామె క్రైస్తవునితో చేసిన సంభాషణ

భక్తి:- మంచిది. దొడ్డక్రైస్తవుడా! నిన్నిరాత్రి మాయింట చేర్చుకొనుటకు మా కానందమయినది. గనుక ఒక వేళ నీకును మాకును మేలుకలుగునట్లు నీయాత్రలో నీకు సంభవించిన సంగతులన్నియు మాకు చెప్పుము.

క్రైస్త:- ఆహా, ఆనందముతో చెప్పెదను. మీరు నన్నిట్లు ఆదరించుట నాకెంతయో సంతోషముగా నున్నది.

భక్తి:- మొట్టమొదట యాత్ర చేయవలయునని నీకెట్లు బుద్ధి పుట్టినది?

క్రైస్త:- నా చెవినిబడిన గొప్ప భయంకరమగు వార్తచేత నా దేశమునుండి నేను బయలుదేరితిని. ఆవార్త యేదనగా: నేను ఆదేశమందే యున్నయెడల తప్పక నాశనము కావలయుననునదే.

భక్తి:- అయితే నీదేశమునుండి బైలుదేరి యీమార్గమునకు వచ్చుట యెట్లు తటస్థించినది?

క్రైస్త:- అది దైవసంకల్పమే. ఎందుకనగా నాకుపుట్టిన భయములో యెటుపోవను నాకు తోచినదికాదు. అయితే

అనుకొనని రీతిగా నాదురవస్థలో వణకుచు యేడ్చుచు నుండగా సువార్తికుడను నొకడు నాయొద్దకు వచ్చెను. ఆతడు నాకు దిడ్డిగుమ్మమునకు దారిచూపెను. ఆతడు చూపనియెడల నేనెన్నడును దానిని కనుగొనియుండను. ఆరీతిగా నీ యింటికి వచ్చు దాకిలోని కతడు నన్ను నడిపించెను.

భక్తి:- అయితే నీవు భావసూచకుని యింటిమీదుగా రాలేదా ?

క్రైస్త:- ఆహా, వచ్చితిని. ఆయన యింటియొద్ద చూచిన మహావిషయములు నేను జీవించినంతకాలము మరువలేను. అందు ముఖ్యముగా మూడు విషయములు నామనస్సున స్థిరముగా నాటుకొన్నవి: అవేవనగా సాతాను పన్నాగము లెన్నియున్నను విశ్వాసి హృదయమునందు క్రీస్తు కృపాకార్యమును కొనసాగించు విధము; దేవునికృపను పొందలేనంత మట్టుకు మానవుడు పాపముచేసి నిరాశపాలగు విధము; నిద్రయందు కలకని తీర్పుదినము వచ్చెననుకొన్నవాని సంగతి. ఈ మూడును నాకెన్నడును మరపునకురావు.

భక్తి :- అతడు తనకలను గూర్చి నీకు చెప్పెనా ?

క్రైస్త :- చెప్పినాడు. అదెంతయో భయంకరముగా నున్న

దని నేననుకొంటిని. అతడు చెప్పుచుండగా నాగుండె పగిలి బ్రద్దలగు నంత బాధ పడితిని. గాని దానిని విన్నందుకు నాకెంతయో మేలుకలిగినది.

భక్తి :- భావసూచకుని యింట నీవు చూచిన దింతియేనా?

క్రైస్త :- ఇంతేకాదు. అతడు నాకొక మహారాజనగరును చూపెను. అందలి వారు బంగారు వస్త్రములను ధరించిరి. ఒక యోధుడచటికి వచ్చి అక్కడ ద్వారమువద్ద నున్న సాయుధులగు శత్రుమూకలను చెండాడి లోనికిపోవుటయు చూచితిని. వారిని గెలిచి యతడు నిత్యమహిమను పొందెను. అవియన్నియు చూడగా నా హృదయము పొంగినది. నేను పోవలసినది దూర ప్రయాణమని వేగిరపడి వచ్చితిని గాని లేనియెడల భావసూచకుని యింట హాయిగా నొక సంవత్సరమాగి యుందును.

భక్తి :- మార్గమందు మరేమి చూచితివి ?

క్రైస్త :- చూచుటయే కాదు; గొప్పలాభమును కూడ పొందితిని. ఎట్లనగా భావసూచకుని యిల్లు దాటి కొంత దూరము వచ్చుసరికి మ్రానిపై వ్రేలాడుచున్న మహాఘనుని చూచితిని. ఆయన కాలుసేతుల నుండి రక్తము కారుచున్నట్లు నాకు గోచరమైనది. ఆయనను చూచినదే తడవుగా నావీపుపై నున్న భారము జారి క్రిందపడి పోయినది. అంతకుముందు ఆ భార

మువలన నేనెంత మూర్ఛిల్లి నలిగితినో అంతటి విమోచ
నము నాకపుడు కలిగినది. అది నా కెంతయో ఆశ్చ
ర్యమును కలిగించినది. ఎందుకనగా అట్లు జరుగుట
నేనెన్నడును చూడలేదు. ఇది ముమ్మాటికి నిజము.
మరియు నేను కన్నులెత్తి చూచుచుండగా ముగ్గురు
సువర్ణ దేహులు నా యొద్దకు వచ్చిరి. అందొకడు నా పా
పములు క్షమింపబడినవని సాక్ష్యమిచ్చెను. రెండవ
వాడు నాపైనున్న చింకిగుడ్డ పీలికలను తొలగించి
విచిత్రమైన కుట్టుపనిగల యీ పైవస్త్రమును నాకు
కప్పెను, మూడవవాడు మీరు చూచుచున్న యీ
ముద్రను నా నొసటిపై వేసి నా చేతికొక ముద్రపట్టిక
నిచ్చెను. (ఈ మాటలు చెప్పుచు క్రైస్తవుడు తన
రొమ్మున నున్న కాగితపు చుట్టను తీసిచూపెను.)

## సుబుద్ధితో క్రైస్తవుడు చేసిన సంభాషణ.

సుబుద్ధి కొన్ని ప్రశ్నలనడిగి వాటికి ప్రత్యుత్తరముల
నెరుగ గోరెను.

సుబు:-అప్పుడప్పుడు నీవు విడిచివచ్చిన దేశమును గూర్చి నీకు
జ్ఞాపకమునకు వచ్చుటలేదా ?

క్రైస్త :- జ్ఞాపకము వచ్చుచున్నది, గాని అది తలంపునకు
వచ్చినపుడెల్ల సిగ్గును, విరక్తియు కలుగు చున్నవి.

నిజముగా నేను విడిచివచ్చిన దేశముమీద నాకు ఆశ యున్న యెడల అనేకసార్లు నేనే తిరిగి వెనుకకు పోవుటకు తరుణమేర్పడినది. గాని నేను నేడుఆశించుచున్నది మరింత మేలైన దేశము. అదియే మోక్షపురము. ( హెబ్రీ 11 : 15, 16. )

సుబు :- అప్పుడు నీ కభ్యాసమైన వాటిని నీవింకను అనుసరించుచున్నావు కదా ?

క్రైస్త : అవును, గాని నామనస్సు వాటికి బహు విముఖముగానే యున్నది. ముఖ్యముగా నాయంతరంగమందు పుట్టు శరీరేచ్ఛలింకను నాలోనేయున్నవి. వీటియందు నేనును నాదేశస్థులును పూర్వము బహుగా ఆనందించితిమి. అయితే నేడు మాత్రమవి నాకు దుఃఖ భాజకములు గాని ఆనందకరములుగావు. నాకిష్టమైనవాటి నెన్నుకొను భాగ్యమే నాకు కలిగిన యెడల వీటినెన్నడును కోరుకొనను. అయితే అత్యుత్తమమైన దానిని నేను చేయగోరునపుడు అత్యధమమైనది నాచేతనగుచున్నది. (రోమా 7 : 15–21)

సుబు :- ఒక్కొక్కసారి యివన్నియు ఓడిపోయినట్టు కనబడును. మరియొక్కొక్కసారి అవి నిన్ను తికమకలు పెట్టుట నీవు తెలిసికొంటివా ?

క్రైస్త : నిజమే, గాని బహు అరుదుగానే వాటిమీద పూర్ణ జయము పొందగలుగు చున్నాను. అట్టి జయమును

పొందినపుడెల్ల నాకు ప్రశస్తమైన అనుభవములు కలుగు కాలములు నాకుఅపరంజివలె అమూల్యములు.

సుబు :- నిన్ను కలతపరుచు యీశరీరేచ్ఛలను ఏయే సాధనములచేత జయింప గలిగితివో చెప్పగలవా ?

క్రైస్త :- చెప్పలేకేమి ? సిలువమీద నేను చూచిన దృశ్యమును జ్ఞాపకము చేసికొన్నయెడల నా శరీరేచ్ఛలు మటుమాయమగును. నాకియ్యబడిన విచిత్రమైనకుట్టుపని గలపైవస్త్రము (నీతివస్త్రము) వైపుచూచినను, నా చేతియందు గల పుస్తకపుచుట్టవైపు చూచినను నాకు జయముకలుగుచున్నది. ఇంకను నేను వెళ్ళబోవు మహా నగరును గూర్చి నాహృదయమందు యోచించి ఆనందించి నపుడు కూడ శోధన లెగిరిపోవు చున్నవి.

సుబు:-సియోను పర్వతమునకు పోవలెనని నీకింతగా కోరిక పుట్టించుచున్న దేది ?

క్రైస్త:-వేరేమి కావలయును ? నాకై సిలువపై మరణించిన వానిని అక్కడ సజీవునిగా చూడ గలనని ఆశించుచున్నాను. నా యందుండి నన్ను కలత పెట్టుచున్న వాటి నన్నిటి నుండియు అక్కడ విముక్తి పొందనాశించు చున్నాను. అక్కడ మరణమనునది లేదని చెప్పుదురు. (యెష 25 : 8; ప్రక 21 : 4.) నా కత్యంత ప్రీతికరమగు సహవాసులతో నే నక్కడ జీవింప వచ్చును. సత్య మొక్కమాటలో నీకు చెప్ప

వలయుననిన, నా భారమును తీసివేసినందున ఆయ
నను నేను బహుగా ప్రేమించు చున్నాను. నా యం
దలి ఆత్మీయ రోగముచేత నా ప్రాణము విసికినది.
మృత్యువులేని చోటు నేనుండగోరుచోటు. పరిశుద్ధుడా,
పరిశుద్ధుడా, పరిశుద్ధుడా, యని రాత్రింబగళ్లు దైవస్తుతి
యుండుస్థలమున జీవింప వలెనని నేను కోరుచున్నాను.
ఇదియే నా యభీష్టము.

## ప్రేమ క్రైస్తవునితో చేసిన సంభాషణ.

అంత, ప్రేమ క్రైస్తవునితో నిట్లు సంభాషించెను.

ప్రేమ:-నీ కాలు బిడ్డలుండిరా?

క్రైస్త :- ఉండిరి. నా భార్యయు నలుగురు బిడ్డలు గల సంసారము మాది.

ప్రేమ :- మరి వారిని నీవెంట తీసుకొని రాలేదేల ?

క్రైస్త :- (ఈమాట వినినప్పుడు క్రైస్తవునికి దుఃఖము పొరలి పొరలి వచ్చినది.) అయ్యో వారు నా వెంట రావలెనని యెంత ఆశించితిని! అయితే వారందరును నా యాత్రను గూర్చి యెంత మాత్రమును యిష్టపడిన వారు కారు.

ప్రేమ :- అయితే నీవు వారితో మాటలాడి అక్కడ ఉండి

పోయిన యెడల చాల అపాయకరమని చెప్పియుండ వలసినది.

క్రైస్త :- ఆహా, చక్కగా చెప్పితిని. మరియు ఆ పట్టణపు నాశనమును గూర్చి దేవుడు నాకేమి తెలియజేసెనో దానిని కూడ వారికి వివరించితిని. అయితే వారికదంతయు వెక్కిరింతగా కనబడినది. నన్ను వారు నమ్మనేలేదు. (ఆది 19 : 14.)

ప్రేమ :- మరియు నీ సలహా వారికి మేలుకరముగా నుండునట్లు దేవుని దీవెనకొరకు ప్రార్థించితివా ?

క్రైస్త :- అయ్యో, ప్రార్థించితిని. బహు ఆతురతతో ప్రార్థించితిని; ఎందుకనగా నాభార్యయు నా నలుగురు పసికూనలును నాకత్యంత ప్రియులని నేను వేరుగా చెప్పవలయునా ?

ప్రేమ :- గాని యా నాశనమును గూర్చి నీకెంత దుఃఖమును భయమును కలుగుచుండెనో వారికి చెప్పితివా ? ఎందుకనగా రాబోవు ఆ నాశనము నీకు బాగుగా గోచరమై యుండవచ్చును.

క్రైస్త :- చెప్పితిని, పదేపదే నొక్కి చెప్పితిని. మా తలలపై పడునట్లు కాచుకొనియున్న తీర్పును గూర్చి యోచించగా నాకు వణకును, భయమును పుట్టి కన్నీళ్లును ముఖవికారమును కలిగెను. వాటిని చూచియైన వారు గ్రహింపరైరి. ఎన్ని చెప్పినను యెంత యేడ్చినను వారు నా వెంట రారైరి.

ప్రేమ :- అయితే వారెందుకు నీతో రానిష్టపడుట లేదో నీకు చెప్పిరా?

క్రైస్త :- చెప్పిరి. ఈలోకాశలను విడచిపెట్టుటకు నాభార్య తన కిష్టము లేదన్నది. మరి నా బిడ్డలు తమ యౌవన సౌఖ్యములందును బుద్ధిహీనపు మార్గము లందును మునిగిపోయిరి. అందుచేత నాకిదియు నదియు సాకు చెప్పి ఒంటరిగా పొమ్మనిరి.

ప్రేమ :- అయితే నీవు నోటితో బలవంత పెట్టి ఒప్పించి వారిని నీవెంట తేజూచితివే గాని మరి నీ జీవితమును బట్టి చూడగా నీ బోధయంతయు వ్యర్థమైన దేమో ?

క్రైస్త :- నిజమే, నా జీవితములో నా బలహీనతలను నేనెరుగుదును గనుక నా జీవితము లోపరహితమైన దని నేను చెప్పలేను. మరియు ఒక్క సంగతి నాకు బాగుగా తెలియును. ఒకడు తన వాదములచేతను ప్రేరేపణల చేతను యితరుల మేలుకొరకు కొంత బోధ చేసినను అతని జీవితము తన బోధలకు సరిగా తగినట్లు లేనియెడల అతని బోధలు బూడిదలోపోసిన పన్నీరగునని నే నెరుగుదును. గాని ఒక సంగతి మాత్రము నేను చెప్పగలను; ఏమనగా నాయాత్ర మీద వారికయిష్టమును పుట్టించు రీతిగా మాత్రము ప్రవర్తించకుండ నేను జాగ్రత్త పడితిని. ఇట్లు ప్రవ

ర్తించినందుకు పై పెచ్చు వారు నన్ను తప్పుపట్టుచు నాబోధ పాదస్తమనియు వారి దృష్టిలో తప్పులేనివి అనేకములు నేను విసర్జించు చున్నాననియు సణుగు కొనిరి కాని నేను మాత్రము వారి కభ్యంతరము పుట్టించునట్లు ప్రవర్తించిన యెడల అది దేవుని యెదుట పాపమనియు పొరుగువారి యెడల గొప్ప అపచార మనియు నేను భావించితిని.

ప్రేమ:- నిశ్చయముగా. తన కార్యములు చెడ్డవియు, తన సోదరునివి నీతియుక్తము లైనందుననే కయీను తన సహోదరుని ద్వేషించెను. (I యోహా 3 : 12) అట్లే నీ భార్యబిడ్డలు నీ ప్రవర్తనయెడల అభ్యంతరపడిన యెడల వారియందు మంచికి చోటులేదని మాత్రమే నిరూపించుకొను చున్నారు. వారి రక్తాపరాధము నీ మీదమాత్రము లేకుండ నీపని నీవు చేయగలిగినంత మట్టుకు చేసి నీయాత్మను రక్షించుకొంటివి. (యెహె. 3 : 19)

## విందునందు జరిగిన సంభాషణ

అంతట నేను నాస్వప్నమందు చూడగా వారట్లు భోజనము సిద్ధమగువరకును మాటలాడుచునే యుండిరి. భోజనము సిద్ధమైనప్పుడు వారందరును భుజింప కూర్చుండిరి. భోజ

నపు బల్లమీద రుచిగల భక్ష్యములు మంచి పానీయములు నుండెను. ఇప్పుడు వారి భోజనకాలపు సంభాషణయంతయు సియోనుకొండకు ప్రభువగువాని గూర్చినదే. ఆయన చేసిన దేమి, ఎందుకుచేసెను, అక్కడా యింటినెందుకు కట్టించెను, మొదలగు విషయములనుగూర్చి వారక్కడ మాటలాడు కొనిరి. వారి సంభాషణనుబట్టి నేను గ్రహించిన దేమనగా: ఆయన గొప్పయోధుడు మరణశక్తి గలిగిన దుష్టునితో ఆయన పోరాడి వానిని వధించెను. (హెబ్రీ 2 : 14, 15) కాని యీ యుద్ధమునందాయనయే గొప్ప అపాయమునకు గురియయ్యెను. ఈ కారణముచేత ఆయనయెడల నాకు మరింత ప్రేమ హెచ్చైనది.

మరియు క్రైస్తవుడాయననుగూర్చి యిట్లు చెప్పసాగెను: నేను వినినదియును నా హృదయమందు నేను నమ్ముచున్నదియును యేమనగా ఆయన మనకొరకు తన రక్తమును కోల్పోయెను. గాని యీ దేశముపై తనకుగల కేవలమగు ప్రేమచేతనే ఆయన యింతటిపని చేసినందున ఆయన కార్యము మహిమపరచబడినది ఘనపరచబడినదని. ఇంతేగాక ఆయన కుటుంబికులు కొందరాయన సిలువపై మరణించిన పిదపకూడ ఆయన వారికగపడి వారితో మాటలాడెనని చెప్పుదురు. మరియు యాత్రికులను ప్రేమించుటలో అంతటి వాడు లోకమందెచ్చటను లేడని ఆయన నోటిసాక్ష్యమును

బట్టియే వాడు చెప్పుచుండును. ఈ కార్యమును దీనులకొరకు చేయుటకై తనకు కలిగిన మహిమను సంపూర్ణముగా ఆయన విసర్జించెనని సాక్ష్యమిచ్చి యొక్క చెప్పుచున్నారు. సీయోను పర్వతమువిూద తానొంటరిగా నుంచుకోదుట లేదని ఆయనే తననోటితో చెప్పెననికూడ వారు సాక్ష్యమిచ్చుచున్నారు. మరియు అనేకమంది యాత్రికులు మొదటిజన్మచేత భిక్షకులైనను, పెంటకుప్పలనుండి వచ్చినవారైనను, వారిని ఆయన రాజకుమారులుగా చేసెనట. (I సమూ 2 : 8; కీర్త 113:7)

# సమాధాన మనబడు మందిరము

ఈ రీతిగా వారు చాల రాత్రియగువరకు సంభాషించిరి. అంతట వారు తమ్మునుతాము ప్రార్థనయందు దేవునిభద్రత కప్పగించుకొని నిద్రించుటకై సెలవు పుచ్చుకొనిరి. వారు విశాలమైన మేడగది యొకదానిని క్రైస్తవునికి బసగానిచ్చిరి. దానికిటికి సూర్యోదయ దిక్కునకుండెను. ఆ గది పేరు సమాధాన మందిరము. తెల్లవారు వరకును క్రైస్తవుడందు నిద్రించెను. ఉదయమైనపు డతడు మేలుకొని యిట్లు పాడెను.

యేసు ప్రేమ యెంత ప్రేమ = నన్ను బోలు వారికై
సాటిలేని సౌఖ్యమిచ్చి = పాపశుద్ధి కోసమై
గుట్ట మీదగట్టినట్టి = ఇంటినిచ్చి కాచెను. ॥యేసు॥

నేటి నానివాస మేది = యేసు ప్రేమచేతను
నాశనపు రంపు శాప = వాస పాశబంధుని
తీసితెచ్చి మోక్షమిచ్చి = యేసు నన్ను కాచెను. ॥యేసు॥

ఇంత త్వరలో నాకు మోక్షము దొరుకనున్నది గదా యని క్రైస్తవు డానందించెను. ఇంతలో తెల్లవారగా నందరును లేచిరి. మరికొంత యిష్టాగోష్ఠి జరిగిన వెనుక ఆస్థలపు విశేషము లన్నియు చూచువరకు పోవద్దని వారు క్రైస్తవుని కోరిరి.

## పఠన మందిరము

మొదటి వారతనిని పఠన మందిరమునకు తీసుకొని పోయి బహు పురాతన గ్రంథముల నతనికి చూపిరి. ఆ గ్రంథములను విప్పి నేను నా కలలో చూచినట్టుగా ఆసియోను కొండకు ప్రభువగు వాని వంశావళిని చూపిరి. ఆయన అనాది మధ్యాంతరహితుడగు వాని కుమారుడనియు నిత్యమగు సంతతినుండి పుట్టిన వాడనియు ఆగ్రంథములందు వారు చూపిరి. ఆయన చేసిన పనులను గూర్చిన మరింత సంపూర్ణ వివరమును, ఆయన తన సైన్యమునం దేర్పరచుకొనిన యనేక వందల మంది పేర్లను యీ గ్రంథములందు లిఖితమై యుండెను. వారందరికిని కాలమహిమచే కరగి పోనట్టి సుస్థిర మహి

మచే శూన్యముకానివియునగు నిత్యగృహముల నెక్లేర్పర చెనో ఆ గ్రంథము లందుండెను.

ఆయన సేవకులలో కొందరు చేసిన యోగ్యమగు కార్యములను గూర్చి వారు క్రైస్తవునికి చదివి వినిపించిరి. ఆయన యోధులు రాజ్యముల నణగ గొట్టుటయు, నీతిని నిలువ బెట్టుటయు, వాగ్దానములు పొందుటయు, సింహముల నోళ్లు మూయించుటయు, అగ్ని బలమును చల్లార్చుటయు, ఖడ్గధార నుండి తప్పించుకొనుటయు, యుద్ధములో పరాక్రమ శాలు రగుటయు, అన్యులసేనలను పారద్రోలుటయు, యిట్టి వనేకములు ఆ గ్రంథములనుండి చదివి వినిపించిరి. (హెబ్రీ 11 : 33, 34.)

వారు పఠన మందిరమందలి గ్రంథములనుండి మరి యొక భాగమున చదివి వినిపించగా నొక మాటయుండెను. అదేదనగా; వారిప్రభువు అత్యంత కనికరము గల వాడనియు ఆయన యెవర్రైనను ఏ భేదము లేకుండ చేర్చుకొనుననియు, అంతకు ముందు ఆయనకును ఆయన బోధకు విరోధులయిన వారుకూడ ఆయన యొద్దకు వచ్చినయెడల ఆయన త్రోసివే యడనియు అందుండెను. ఇంకను ఎన్నెన్నో గొప్పచారిత్రక విషయములు ఆగ్రంథములలో వ్రాయబడి యుండెను. క్రైస్త వుడు వాటన్నిటిని చూడగలిగెను. అవేవనగా పురాతన విష యములు, ఆధునిక విషయములును, ముందు తప్పక జరుగ

బోవు వాటిని గూర్చిన ప్రవచనములు, ముందు సూచనలు అందుండెను. శత్రువులకు భయమును ఆశ్చర్యములు కలుగునట్లును, యాత్రికులకు ఆదరణయు ఆనందమును కలుగునట్లును అవి వ్రాయబడెను.

## ఆయుధశాల

మరునాడు వారు క్రైస్తవుని ఆయుధశాలలోనికి తీసుకొనిపోయి అక్కడ వారిప్రభువు యాత్రికులకొరకు సిద్ధపరచి యుంచిన రకరకముల ఆయుధములనన్నిటి చూపిరి. అక్కడ ఖడ్గమును, డాలును, శిరస్త్రాణమును, మైమరువును, నిత్య ప్రార్థనయు ఎన్నటెన్నటికిని నలిగిపోని పాదరక్షలును కనబడెను. అక్కడ ఆకాశనక్షత్రములంతమంది సేవకులకైనను సంపోవునన్ని ఆయుధములను ప్రభువు జాగ్రత్త పరచెను.

మరియు వారు క్రైస్తవునికి కొన్ని యంత్రములను చూపిరి. వాటితో ప్రభుని సేవకులు ఆశ్చర్యకరములగు పనులను జరిగించినవారు. మోషే చేతికర్ర, యావేలు సీసెరాను చంపుట కుపయోగించిన సుత్తియు, మేకును, గిద్యోను మిద్యానీయులను తరిమినపు డుపయోగించిన కుండలు, బూరలు, దివిటీలును— ఇట్టి యంత్రముల నన్నిటిని క్రైస్తవుడు చూచెను. షమగరు ఆరువందలమందిని చంపుట కుపయో

గించిన ముల్లు కర్రయు, సంసోను తన సాహస కార్యము లకై చేపట్టిన గాడిదెదవడ యెముకయు, గాతువాడైన గొల్యాతును చంపుటకు దావీదు పట్టుకొన్న వడిసెలయు, [illegible], వారి ప్రభువు ఆగ్రహముతో సింహమువలె తిరుగునప్పుడు ఆ పాప పురుషుని చంపుటకై నియమింపబడిన కత్తిని క్రైస్తవుడు చూచెను. ఇవియును ఇంక ననేక ప్రశస్త మగు [illegible] యంత్రసామాగ్రిని క్రైస్తవుడు చూచి మిగుల ఆనందించెను. ఆ నాటిపని చాలించుకొని వారందరును రాత్రి కాగా నిద్రించిరి

## ఆనంద పర్వతములు.

అంతట నేను నా కలయందు చూడగా మరునాడు క్రైస్తవుడు తన పడకనుండి లేచినపుడు ముందుకు సాగిపోగోరెను గాని వారింకొక దినమతని నాగు మనిరి. ఎందు కనగా ఆ నాడు మబ్బులేని యెడల వారతనికి ఆనందపర్వతములు చూపుదుమనిరి. అని యతడు పోవుచున్న తన గమ్యస్థానమున కెంత కంటె యింకను సమీపము నందున్నవనియు అందువలన నిక్కడనే వాటిని చూచిన యెడల అతనికి గొప్ప [illegible] కలుగుననియు కూడ వారతనికి చెప్పిరి. అందుకు క్రైస్తవుడు సమ్మతించి ఆ నాటికి నిలిచి పోయెను.

ఉదయము ప్రొద్దెక్కినపుడు వారు మేడమీదికతని తీసుకొనిపోయి దక్షిణ దిక్కుగా చూడుమని చెప్పిరి. అతడట్లు చూడగా, యిదిగో దూరమందతనికొక బహు శృంగారమైన పర్వత ప్రదేశము కనబడెను. అది మిక్కిలి మనోహరమగు వనములతోను, ద్రాక్షతోటలతోను, పలువిధముల ఫలవృక్షములతోను, పుష్పలతాదులతోను, తియ్యని నీటి యూటలు, ధారలతోను నిండి చూచుటకు బహు ఆనందకరముగా నుండెను. (యెష 33 : 16, 17.) అప్పుడు క్రైస్తవుడా దేశము పేరేమని యడిగెను. అది యిమ్మానుయేలు దేశమనియు, అదియును వారున్న కొండవలెనే యాత్రికులందరి మేలుకొరకును యేర్పరచబడినదనియు, అక్కడనుండి చూచిన యెడల నిత్యజీవపురముయొక్క గవిని కనబడుననియు ఆనందపర్వతమునుండి గొర్రెల కాపరులతనికి అగవినిని చూపగలరనియు వారు క్రైస్తవునికి చెప్పిరి.

## క్రైస్తవుడు తన యాత్రను మరల సాగించుట

అంత క్రైస్తవుడు తన ప్రయాణములు మరల సాగించవలెనని యుండగా వారందుకు సమ్మతించిరి; గాని చివరగా నొక్కసారి తిరిగి ఆయుధ శాలకు రమ్మని యతనిని కోరిరి. వారాయుధశాలను ప్రవేశించినపుడు అతని తలనుండి కాలి

వరకును కవచమును తొడిగి ఆయుధములను చేతికిచ్చిరి. ఎందుకనగా మార్గమందేదైన పోరాటము వచ్చినయెడల అతను కాచుకొనునట్లు వారాపని చేసిరి. ఆరీతిగా యుద్ధసన్నద్ధుడై క్రైస్తవుడు వారు సాగనంపు చుండగా ద్వారముకడకు వచ్చి అక్కడ కావలి వానితో: యీ దారి నెవరైన పోయి నట్లు నీవు చూచితివా? యనెను. అందుకు ద్వారపాలకుడు ఒక వ్యక్తి వెళ్లియుండెనని జవాబిచ్చెను.

క్రైస్త :- అయితే అతని నెరుగుదువా?

ద్వార :- అతని పేరేమని యడిగితిని, అతని పేరు విశ్వాసి యని చెప్పెను.

క్రైస్త :- ఓహో విశ్వాసియా! అతని నేనెరుగుదును. మా యూరినుండి వచ్చినవాడే. నేను పుట్టినచోటి వాడే యతడు. మేమిరుగు పొరుగులము కూడను. ఇప్పటికతడెంత దూరము పోవునను కొందువు?

ద్వార :- ఈపాటి కతడు కొండదిగువకు చేరియుండును.

క్రైస్త :- మంచి దయగల ద్వారపాలకుడా, నీవునాకు చూపిన ఆదరణ కొరకు దేవుడు నిన్ను దీవించి నీకున్న సమస్త భాగములను మూరంతలు చేయునుగాక.

# వినయ కూపమను లోయ.

అంతట క్రైస్తవుడు ముందుకు సాగిపోవు చుండెను. వివేకవతి, భక్తి, ప్రేమ, సుబుద్ధియను వారందరును అతని వెంబడించి కొండదిగువ వరకు వచ్చిరి. వారందరును నడచు చుండగా ముందటి సంభాషణనే సాగించుచు పోవుచుండిరి. వారు కొండ దిగువకు వచ్చినపుడు క్రైస్తవుడు వారితో నిట్లనెను; ఈ కొండ యెక్కుట బహు కష్టమును దిగుట అపాయకరమునైయున్నది సుమా! అందుకు సుబుద్ధి;నిజమే. ఎందుకనగా వినయ కూపమను లోయ లోనికి దిగుట కెవనికైనను బహు కష్టముగ నుండును. నీవందుచేతనే యింత కష్టపడితివి లేనియెడల కాలు జారి పడుట తప్పదు. మేము కూడ అందుకనియే కొండదిగి యింతవరకు నిన్ను పంపవచ్చితిమి. ఇట్లు మాటలాడుచు క్రైస్తవుడు బహు జాగ్రత్తగా కొండదిగువకు నడచెను. గాని ఎంత భద్రపడినను ఒకటి రెండు సార్లు కాలుజారుట తప్పలేదు. అంతట నేను నా స్వప్నమందు చూచుచుండగా క్రైస్తవునికూడ వచ్చిన స్నేహితులు అతనివద్ద సెలవు పుచ్చుకొని ఒక రొట్టెయు ఒక బుడ్డి పానీయమును ఒక గెల యెండిన ద్రాక్షపండ్లను అతనికిచ్చి వెడలి పోయిరి.

# క్రైస్తవుడు అపొల్యోను రాక్షసుని కలసికొనుట.

వినయ కూపమునందు పోవుచుండగా క్రైస్తవునికి త్వరలోనే పెద్ద కష్టము వచ్చెను. ఎందుకనగా కొంత దూరము పోవుసరికి తన యెదుట దూరమునుండి ఒక భీకరమగు రాక్షసుడొకడు క్రైస్తవుని కెదురయ్యెను. అతని పేరు అపొల్యోను. అప్పుడు క్రైస్తవుడు భయపడ సాగి వెనుకకుపోవను ముందుకు సాగను తోచకుండెను. అయితే తన వీపుమీద కవచము లేనందున వెనుకకు పారిపో జూచినచో వాడి బాణములతో కొట్టి తన్ను చంపుటకు అపొల్యోనుకు మరింత సులభమగునని యోచించెను. గనుక యేమైనను నిలచిపోరాడవలెనని సమకట్టెను. మరియు నతడిట్లనుకొనెను; నిజముగా ప్రాణరక్షణమే నేను కోరిన యెడల నిలచిపోరాడి ననేతప్ప వేరొక రీతిగా దానిని దక్కించుకొనలేను గదా !

అందుచేత క్రైస్తవుడు ముందుకుపోగా అపొల్యో నతనిని సమీపించెను. వాడు చూచుటకు బహు క్రూరుడును ఘోరమైనవాడునై యుండెను. అతని శరీరమంతయు చేప పొలుసుల వంటి పొలుసులుండెను. అవి వాని గర్వమునకు గురుతు. అతని రెక్కలు డ్రాగోను అను జంతువు రెక్కల వలెను అతని పాదములు ఎలుగుబంటి పాదములవలెను ఉండెను. వాని గర్భములోనుండి మంటలును పొగయువచ్చు

చుండెను. వాని నోరు సింహపు నోటిని పోలియుండెను. వాడు క్రైస్తవుని సమీపించి నపుడితనివైపు తిరస్కారములో చూచి యిట్లు ప్రశ్నింపసాగెను.

అపొ :- నీ వెక్కడి వాడవు, యెక్కడికి పోవుచున్నావు ?

క్రైస్త :- నేను సర్వ పాపములకు స్థానమైన నాశనపురము నుండి వచ్చుచున్నాను. సియోను పట్టణమునకు పోవుచున్న వాడను.

అపొ :- అనగా నీవు నా పౌరుడవన్నమాట. ఎందుకనగా ఆదేశమునాది. నేను దానికి రాజును, దేవుడను. నా రాజ్యమునుండి నా సెలవు లేకుండ నీవు పారిపోవుట యేమి ? నీవింకను నాకులోబడి నా సేవచేతువా సరి, లేనియెడల నిన్నిపుడే ఒక్క దెబ్బకు చంపగలను.

క్రైస్త :- నీ రాజ్యమునందు నేను పుట్టిన మాట నిజమే. గాని నీ సేవ బహు భారమైనది. నీ విచ్చు జీతము పొంది నవాడు బ్రతుకలేడు. ఎందుకనగా పాపమువలనవచ్చు జీతము మరణమే. (రోమా 6 : 23.) గనుక నేను వయస్సువచ్చి యోచించ నారంభించినపుడు నాకొక వేళ గత్యంతరము దొరకునేమో యని వెదకితిని. బుద్ధిమంతుడు చేయవలసిన దింతియే కదా ?

అపొ :- అయితే ఇంత సులభముగా తన ప్రజలను పోగొట్టు కొను పిచ్చిరాజుండునా ? నేను మాత్రము నిన్ను విడు

వను. గాని నీ జీతమును గూర్చియు నీ సేవను గూర్చియు సణుగుచుంటివి. గనుక ఒక్క వాగ్దానము మాత్రము నీకిపుడు చేయుచున్నాను; వెంటనే మన దేశమునకు తిరిగి రమ్ము, అపుడు మన దేశవాసులకు చొప్పున నీకేది న్యాయమో చూచి నీకిత్తును.

క్రైస్త:-నీవిచ్చిన యిచ్చువచ్చును గాని నేను రాజులకు రాజగు వాని సేవలో చేరితిని. ఇప్పుడు తిరిగి వచ్చుట నాకు తగునా ?

అపొ:-పెనమునుండి జారి పొయిలో బడినట్లు నీ విప్పుడు వాని సేవలో చేరితివి. అయినను తొందర లేదు. వాని సేవకులవలె వేషము ధరించిన వారనేకులు బుద్ధి తెచ్చుకొని విడుదల చీటి వాని ముఖమున పారవైచి తిరిగి నా రాజ్యమునకు వచ్చుచున్నారు. నీవును అట్లే చేయుము నీకు క్షేమము కలుగును.

క్రైస్త:- నే నాయనయందు విశ్వసించి మాట యిచ్చి ఆయనను సేవించెదనని ప్రమాణము చేసియున్నాను. అట్టి వాగ్దానమును మీరి తిరిగిపోయినయెడల ద్రోహికి కలుగు మరణశిక్ష తప్పునా?

అపొ:- నాకును నీవట్లే అపచారము చేసితివి; అయినను యిప్పుడు నీవు మనస్సుమార్చుకొని వెనుకకు తిరిగి వచ్చినయెడల నేను నీ తప్పు మరచిపోవుటకు సిద్ధముగా నున్నాను.

క్రైస్తు:- నేను నీకు చేసిన వాగ్దానము బాల్యదశలో అజ్ఞానము చేత చేసినది. ఇంతేగాదు నేనిపుడు నమ్ముకొనిన రారాజు నన్నుక్షమింప సమర్థుడు. మరియు నేను నీతో చేసిన చెడు సహవాసమునుండి నన్ను విమో చించుటకు సిద్ధముగానున్నాడు. గనుక ఆయన ధ్వజ ముక్రింద నేనిపుడు నిలచియున్నాను. మరియు నాశ కుడవగు అపొల్యోనూ, నిజముచెప్పెదను, వినుము. ఆ ప్రభుని సేవయందును, ఆయనయిచ్చు జీతమునం దును, ఆయన సేవకులయందును, ఆయన పరిపాలన యందును, నే నానందించుచున్నాను. ఆయన సహ వాసము నీతోడి సహవాసముకన్న మేలైనది. ఆయన రాజ్యము నీ రాజ్యముకన్న దొడ్డది. గనుక నన్నే మియు బలవంతము చేయక విడిచిపెట్టుము. నే నా యన సేవకుడను, ఆయననే అనుసరింతును.

అపొ:-తొందర పడక నీవు పోవుచున్న మార్గమునందు నీ కేమి సంభవింప నైయున్నవో కొంచెము యోచిం పుము. నాతో విరోధించినందున ఆయన సేవకులలో ననేకులగతి నాశనమైనది, వారిలో నెంతమంది అవ మానకరమగు చావు చచ్చిరి? మరియు నా సేవ కంటె వానిని సేవించుట మేలను చున్నావు - తన సేవకులను కష్టములనుండి విడిపించుట కతడెన్నడును

గద్దె దిగలేదే! నేనైతే నన్ను సేవించిన వారిని శక్తిచేతనైనను యుక్తిచేతనైనను వాని దగ్గిరకు పోకుండా రక్షించితినని లోకమంతయు ఎరుగుదురు. అట్లే నిన్నుకూడ తప్పింతును.

క్రైస్త:-అయ్యో, వెర్రి అపొల్యోనూ, ఆయన తన బిడ్డలను కష్టములందుంచుట ఉపేక్షచేత కాదు గాని వారి విశ్వాసమును పరీక్షించుటకే, ఆయనను హత్తుకొని యుందురో లేదో యని ఆయన కనిపెట్టుచున్నాడు. మరి ఆయన సేవకుల గతి అపాయములని చెప్పితివే, అవి నిజముగా వారికి మహిమ కరములే. ఎందు కనగా రాబోవు మహిమ యెదుట నేటి కష్టములెన్న తగినవి కావని యెరిగి వారు మహిమ కొరకాశతో యెదురు చూచుచుందురు. తుదకు రారాజు తన మహిమతోను తన దూతల మహిమతోను దిగివచ్చి నపుడు ఆయన సేవకులు తమ ఫలము పొందుదురు.

అపొ:-నీ వింతకు ముందే ఆయనను వదలి అక్రమము చేసి తివి ఇక నీకు జీతమెట్లు వచ్చు ననుకొనుచున్నావు?

క్రైస్త:-అపొల్యోనూ, నేనెప్పుడాయన యెడల అక్రమము చేసితిని?

అపొ:-మొట్టమొదట నిరాశయూబిలో నీకుక్కిరి బిక్కిరి యైనపుడు నిరాశ చెంది విసికితివి. నీ రాజు నీవీపు మీది

భారమును తీయవలసి యుండగా అంతవఱకును నీవు కనిపెట్టక దానిని వదలించుకొనుటకు ఆ యా మార్గములను వెదకితివి. నీవు పాపివై నిద్రలో పడి ప్రశస్తమైన వస్తువులను పోగొట్టుకొంటివి. సింహములను చూచినపుడు నీవు భయపడి వెనుకకు పోవలెనని తలంచితివి. నీవు నీ ప్రయాణమును గూర్చియు అందు నీవు కని వినిన విషయములను గూర్చియు మాటలాడు నపుడు సాధారణముగా స్వకీర్తిని వెదకి గొప్పగా మాట్లాడుకొంటివి. నీ పలుకులందును పను లందును స్వఘనత కోరితివి.

క్రైస్త:-ఇదంతయు నిజమే, ఇంకను నీవు చెప్పని వనేకము లున్నవి; గాని నేను సేవించి ఘనపరచు రాజు దయ గలవాడు క్షమించుటకు సిద్ధముగా నుండువాడు. ఇంతే గాక యీ దుర్గుణములన్నియు నీ దేశమునందున్న పుడే నన్ను చుట్టుకొన్నవి. వాటిని నేను తల్లి పాల తోనే త్రాగితిని. వాటిక్రింద పడి నేను నలిగి మూలి గితిని. వాటికొరకై నేను బహుగా చింతించి నా రాజు నొద్ద క్షమాపణ పొందితిని.

అపో:-(బహుకోపముతో మండిపడి) ఈ రాజుకు నేను శత్రువును. అతని నేను ద్వేషించుచున్నాను. అతనిఆజ్ఞల యందును అతని జనుల యందును పగపట్టియున్నాను. నిన్ను అడ్డుపెట్టి ఆపుజేయుటకే నేను వచ్చితిని!

క్రైస్త:- అపొల్యోనూ, జాగ్రత్త. నీవు చేయుచున్నదేమో యోచించుకొనుము. నేను రారాజు మార్గమైన పరిశుద్ధ మార్గమందున్నాను. గనుక నీ ప్రాణములను భద్రపరచుకొనుము సుమీ!

అపొ:- (అంత అపొల్యోను మార్గమున కడ్డుగ నిలువబడి) ఈ విషయమై నాకేమియు భయములేదు. చచ్చుటకు నీవు సిద్ధపడుము. నీ విక్కడనుండి అడుగు కదల్పకుండ నీ రక్తము తీయుదును. పాతాళము నందున్న నా గుహతోడు!



## అపొల్యోనుతో పోరాటము.

ఇట్లు చెప్పుచు అపొల్యోను ఒక అగ్నిబాణమును క్రైస్తవుని రొమ్ముపై విసరెను. అయితే క్రైస్తవుడు తన చేతనున్న డాలుచేత దాని నాపుకొని, అపాయమునుండి తప్పించుకొనెను.

అంతట క్రైస్తవుడు ఊరకుండుటకు సమయము కాదనుకొని అపొల్యోనును వేగముగా ఢీకొనెను. అయితే వాడు మరింత ముందుకువచ్చి క్రైస్తవునిమీద వడగండ్లవలె బాణములను కురిపించెను. క్రైస్తవు డెంతవరకు కాచుకొనినను తుదకు అతని కాళ్ళను చేతులను తలను అపొల్యోను గాయ

పరచెను. ఈ గాయములచేత క్రైస్తవుడు కొంచెము వెనుకకు తగ్గెను. అపొల్యోను మరింత ఘోరముగ పోరాడుచుండెను. ఇంతలో క్రైస్తవుడు మరల ధైర్యమును పొంది సాధ్యమైనంత పౌరుషముగ యెదురు దెబ్బతీయుచుండెను. యుద్ధము తీవ్రముగా సగము జరుగునప్పటికి క్రైస్తవుని బలము తగ్గిపోయెను. ఎందు కనగా క్రైస్తవుడు తిన్న గాయములచేత అతనికి అంతకంతకు బహు నీరసమయ్యెను. అప్పుడు అపొల్యోను తన యదను కనిపెట్టి క్రైస్తవుని నంతకంతకు సమీపించుచు అతనితో పోరాడుచు చివరికొక్క ఘాతుకమైన దెబ్బ కొట్టెను. అంత క్రైస్తవుని చేతనున్న కత్తి జారి దూరమున పడిపోయెను. "ఇంతటితో నీ పని సరి"—యని అరచి అపొల్యోను క్రైస్తవుని పైబడి అతని చావ గొట్టెను. దానితో క్రైస్తవుడు తన ప్రాణములపై నాశ వదలుకొనెను. గాని అపొల్యోను తన చివరిదెబ్బను కొట్టి క్రైస్తవుని చంప బోవుచుండగా దైవ వశాత్తుగా క్రైస్తవుడు తెలివిగా తన కత్తి నందుకొని-ఓ విరోధీ! అతిశయపడకుము నేను పడిపోయినను తిరిగి లేతునని నెను. (మీకా 7 : 8) అట్లులేచి క్రైస్తవుడు అపొల్యోను నొక మారణ కరమగు పోటు పొడిచెను. చావు దెబ్బతినినట్లు అపొల్యోను వెనుకకు తూలెను. ఇది చూచి క్రైస్తవుడు మరల అతని మీది కురికి—అయినను మమ్మును ప్రేమించిన వాని ద్వారా మేము వీట

న్నిటిలోను అత్యధికమైన విజయము పొందుచున్నాము— అని చెప్పుచు మరల కొట్టెను. (రోమా 8 : 37.) ఇక అపొల్యోను నిలువలేక తన డ్రాకోను రెక్కలు విప్పి యెగిరి పోయెను. వాడు క్రైస్తవునికి ఇకెన్నడును కనబడలేదు. (యాకో 4 : 7.)

ఈ పోరాటమును నేను చూచినట్లు కన్నులార చూచిననే తప్ప అపొల్యోను చేసిన క్రూర గర్జనములను, అతడు వేసిన బొబ్బలును రంకెలును ఊహించుట అసాధ్యము. వాడు డ్రాకోను జంతువువలె వాగెను. మరియు రెండవ ప్రక్క క్రైస్తవుని హృదయమునుండి వెలువడిన నిట్టూర్పులును మూలుగులును కూడ ఊహింప లేనంత దీనముగా నుండెను. రెండంచులు గలిగిన తన కత్తితో అపొల్యోనును గాయపరచి చూచువరకును క్రైస్తవుని ముఖమునందు ఒక్క చిరునగవైనను లేదు. అట్లు వానిని కొట్టినపుడు మాత్ర మతడు చిరునవ్వునవ్వి ఆకాశమువైపు కన్నులెత్తి చూచెను. గాని అంతటి అతి భీకరమైన యుద్ధమును నే నెన్నడును చూడలేదు.

అంతట యుద్ధము ముగిసిన పిమ్మట క్రైస్తవు డిట్లనుకొనెను. సింహము నోటినుండి తప్పించినట్లు నన్ను అపొల్యోను నుండి తప్పించి జయమిచ్చిన వానికిక్కడనే స్తోత్రములు చెల్లించెదను,

అప్పుడొక హస్తము ప్రత్యక్షమై అతనికి జీవవృక్షపు ఆకుల నందించెను. క్రైస్తవుడు వాటిని పుచ్చుకొని తన గాయములపై వేసినపుడవి వెంటనే మాని పోయెను. అతడక్కడ కూర్చుండి రొట్టెను తిని తన బుడ్డిలో నున్న పానీయము త్రాగెను. అట్లు సేదదేరి తన ప్రయాణమునకు మరల సన్నద్ధుడై తనచేత కత్తి దూసి పట్టుకొని జాగ్రత్తగా ముందుకు సాగెను. ఎందు కనగా వేరెవడైన శత్రువుపై బడునేమో యని అతడు మెళకువ గలిగియుండెను. గాని ఆలోయ దాటు నంతవరకును అతనికి అపొల్యోను తప్ప మరొక శత్రువెవరు యెదురుపడలేదు.

## గాఢాంధకారమగు లోయ.

ఈ లోయ దాటి పోగానే క్రైస్తవునికి మరొక లోయ కానవచ్చెను. దానిపేరు గాఢాంధకారమగు లోయ. నిత్య జీవపురమునకు మార్గము దాని గుండా నున్నందున క్రైస్తవుడా లోయను కూడ దాటవలసివచ్చెను.

మరియు నీ లోయ బహు నిర్మానుష్యమై యుండెను. పవిత్రమైన యిర్మియా దాని నిట్లు వర్ణించు చున్నాడు; 'అది బీడు ఎడారులును గుంటలు గల దేశము. అనావృష్టియు, మరణచ్ఛాయగల ప్రాంతము. (క్రైస్తవుడు తప్ప) ఏమనుష్యుడును దానిని గుండా పోలేదు. (యిర్మియా 2 : 6.)

ఈ ప్రాంతమునకు వచ్చినపుడు క్రైస్తవునికి అపొల్యోనుతో పోరాడినప్పటి కంటె మరింత ప్రాణసంకటమైనదని మీరు గ్రహింపవచ్చును. ఎట్లనగా నేను నాకలయందు చూచుచుండగా మరణచ్ఛాయగల ఆ లోయ మొదట క్రైస్తవుని కిద్దరు మనుష్యులు కనబడిరి. వీరు పాలు తేనెలు ప్రవహించు దేశముగూర్చి పాడు వార్తలను తెచ్చినవాని పుత్రులు. (సంఖ్యా 13 : 32) వారు త్వరగా వెనుకకు పరుగెత్తుకొని పోవుచుండిరి. వారినుద్దేశించి క్రైస్తవుడిట్లు మాటలాడెను.

క్రైస్త :- ఓయీ, మీరెక్కడికి పోవుచున్నారు ?

వారు :- ఎక్కడికేమిటి, వచ్చినచోటికే ! నీకుకూడ ప్రాణమన్నను క్షేమమన్నను తీపిగల దేనివెనుకకు తిరుగుమని మా సలహా.

క్రైస్త :- ఏమి, అంత తొందర యేమివచ్చినది ?

వారు :-తొందరయా! మేమును నీవలెనే ఆమార్గములో పోదలచి గుండెనిబ్బరమున్నంత వరకు పోతిమి. గానిఅక్కడనుండి వెనుకకు వచ్చుట మా యదృష్టమే. ఇంక కొంతదూరము ముందుకు తెగించినయెడల నీకీ కబురు తెచ్చువాడు కూడా లేకపోయి యుండును.

క్రైస్త :- అది సరియేగాని మీకక్కడ యేమి సంభవించినది?

వారు :- సంభవమా, యింకేమి సంభవింపవలయు? ఆలోయయే కటికి చీకటిగానున్నది. కన్ను పొడిచికొన్నను కానరాలేదు. దానికి తోడు లోయ యందె

ల్లను మానని కేకలు కూతలు మూలుగులును వినవచ్చునవి. చెప్పరాని అవస్థలో నరులందు మూలుగుచు బాధయందును సంకెళ్ళయందును ప్రగ్గుచున్నట్లు మేముగ్రహించితిమి. ఆ లోయపైన నిరుత్సాహపరచు గందరగోళపు మేఘములు కమ్మియున్నవి. దానిపైన మరణము కూడ రెక్కలుచాచి కప్పియున్నది. వేయి మాటలేల, దానిలో నెమ్మదియనునది లేక బహు భయంకరముగ నున్నది. (యోబు 3 : 5, 10 : 22)

క్రైస్త :- మీ రెన్ని చెప్పినను, నేను పోవు గమ్యస్థానమునకు మార్గమింకొకటి నాకు కానరాదు. (కీర్త 44 : 18, 19; యిర్మి 2 :6)

వారు :- ఇదియే నీమార్గమయిన నీవుపొమ్ము; గాని మేము మాత్రము మాదారి చూచుకొందుము.

అంతటవారుతమదారినిపోయిరి. క్రైస్తవుడు మాత్రము ముందుకు సాగిపోయెను; అయితే వేరెవ్వడైనను తన్నెదుర్కొనునేమో యను భయముతో తనకత్తిని ఒరనుండి లాగియే పట్టుకొనెను.

## లోయలోని అపాయములు.

వాకలయందు నేను చూచినపుడు ఆ లోయ పొడుగునను దాని కుడిప్రక్కనొక పెద్ద గొయ్యిగలదు. గ్రుడ్డివారికి

దారిజూపు గ్రుడ్డివారందరును దీనిలోనికే పడిరి. లోకము మొదలుకొని యిప్పటివరకును వారును వీరును దీనియందే నాశనమయిరి. మరియు ఆలోయ యందెడమ వైపున బహు అపాయకరమైన ఊబి యుండెను. మంచివాడైనను అందు లోపడిన యెడల కాలుమోపుటకు స్థలముండదు. దావీదను రాజు ఒకసారి యీ ఊబియందే పడెను. శక్తివంతు డతనిని పైకితీసెను గాని లేనియెడల అందే ఊపిరాడక యతడుచచ్చి యుండును. ( కీర్త 64 : 14 )

ఈ లోయయందు మార్గముకూడ బహు యిరుకుగా నుండెను. గనుక పాపము, క్రైస్తవునికి ముందుకు సాగుట చాలా బాధగానుండెను. ఎందుకనగా చీకటియందు గోతిలో పడకుండ జాగ్రత్తగా తప్పుకొనుసరికి అవతలనున్న ఊబిలో పడనుండెను. అట్లే ఊబినుండి తప్పుకొని నడువజూచినచో గుంటలో పడుటకు సిద్ధమగుచుండెను. అట్లే అతడు నడుచుచు బహు ఘోరముగ మూల్గుట నాకు వినబడెను; పైన చెప్పిన అపాయములే గాక యీ లోయలోని మార్గము బహు చీకటి మయముగా నున్నందును అతడు ముందుకు పోవలెనని కాలుతీసి కాలువేసినప్పుడు అనేకసార్లు పాదము నెక్కడవేయుచుండెనో దేనిమీద పడుచుండెనో యెరుగకుండెను.

ఈ లోయ మధ్యయందు నరక ద్వారము నాకు కనబడెను. అది దారి ప్రక్క బహు సమీపముగానే యుండెను.

అప్పుడు క్రైస్తవుడు : నేనేమి చేతునా ? యని అనుకొనెను. దానినుండి అగ్నిజ్వాలలును పొగయు, నిప్పు కణములు విడువక పైకెగయుచుండెను. భయంకరమగు హాహాకారములు కూడ దానినుండి వినవచ్చుచుండెను. అపొల్యోను నోడించి నట్లు వీటిని కత్తిచేత ఓడింప సాధ్యముగాదని క్రైస్తవుడు గ్రహించినపుడు తన కత్తిని ఒరయందుంచి, మరియొక ఆయుధమును చేతబట్టెను. అదియే సర్వప్రార్థనాస్త్రము. (ఎఫెసి 6 : 18) అప్పు డతడు నేను వినుచుండగా నిట్లని యెలుగెత్తి చెప్పెను. 'యెహోవా దయచేసి నా ప్రాణమును విడిపింపుము' (కీర్త 116 : 4.) అతడట్లే యింకను చాలదూరము నడచెను గాని మంటలింకను అతనిపైకి కొట్టుచునే యుండెను. ఘోరమగు భీకర స్వరములు అతనికి వినవచ్చుచునే యుండెను. ఇటునటు యెవరో పరుగులెత్తుచున్నట్టుకూడ అతనికి సవ్వడి కలుగు చుండెను. గనుక ఏ క్షణము నందతడు ముక్కలు ముక్కలుగ చీల్చబడునో, యే క్షణమునందు నేలకంట ద్రొక్కబడునో క్రైస్తవునికి తోచుటలేదు.

అనేక మైళ్ళవరకును యీ భయంకర దృశ్యమతనికి కనబడుచునే యుండెను; ఈ భీకర స్వరములు వినబడుచునే యుండెను; ఇట్లు కొంతదూరము నడుచుసరికి ఒకచోట నొక దురాత్మలగుంపు తన్ను సమీపించు చున్నట్లు క్రైస్తవుడు విని యేమి చేయుటకును తోచక అచటనే నిలచిపోయెను.

వెనుకకు పారిపోదునా యని ఒక తలంపు పుట్టెను. గాని లోయలో సగము నడువనే నడచితిని, అనేక మగు గండములను దాటితిని, యిప్పుడు వెనుకకు పోయినచో అవన్నియు మరల నన్నెదుర్కొనక మానునా? అప్పుడుమాత్రము నేను ప్రాణమును దక్కించుకొనగలనా? ఏది యెట్లున్నను వెనుకకుపోవుట లాభములేని పనియని క్రైస్తవుడు నిశ్చయించుకొనెను. అతడుముందుకు పో నిశ్చయించుకొనగా నాదయ్యములు మరింత ముందుముందుకు వచ్చుచుండెను. అవి యించుమించు వచ్చి మీాద పడినపు డతడు పెద్దస్వరముతో నిట్లనియరచెను: నేను దేవుడైన యెహోవా బలముతో నడచుచున్నాను. అంతట నాదయ్యములు వెనుకకు తగ్గిపోయి మరల క్రైస్తవుని సమీాపించనేలేదు.

ఒక సంగతి చెప్పుట నేను మరువను. ఏమనగా, ఆ దీనుడగు క్రైస్తవుడు ఆ లోయలో ప్రయాణము చేయుచున్నంత సేపును మిక్కిలి తొందరపడి నందున తన మనస్సు నిబ్బరము లేకపోయెను. అది నాకెట్లు తెలిసిన దనగా, క్రైస్తవుడు అగ్నిగుండమును సమీాపించుసరికి అక్కడి దురాత్మలలో నొకటి అతనిని వెంబడించి అతని చెవిలో నెమ్మదిగా ననేక దేవదూషణ మాటలు పలుకుచుండెను. ఈ దూషణ తలంపులు తన యందేపుట్టుచుండెనని అమాయకుడగు క్రైస్తవుడు పొరబడెను. తానింతకు ముందు అంతగా ప్రేమించిన

ప్రభువు నిప్పుడు దూషించుచుంటినే యని క్రైస్తవునికి దుఃఖము కలిగెను. దీనిచేత అంతకు ముందెన్నడును కలుగని వేదన అతని కిప్పుడు కలిగెను. నాకు సాధ్యమైన యెడల నిట్టి దూషణ నేను చేయకుందునే యని అతడు బాధపడెను. అతని చెవులను మూసికొనుటకు గాని ఆదూషణ వాక్యము లెక్కడనుండి వచ్చుచున్నవో యెరుగుటకు గాని అతనికి ఆ సమయమందు వివేచ లేకుండెను.

ఇట్టి నిరాదరణయగు మార్గమున క్రైస్తవుడు కొంత వరకు నడచిన వెనుక క్రైస్తవుని కెవరిదో స్వరము వినవచ్చి నట్లయ్యెను. అతని ముందర నడుచువాడెవరో యిట్లనుచుండెను; "గాంఢాంధకారమగు లోయలో నేను సంచరించినను ఏ అపాయమునకును నేను భయపడను. నీవు నాకు తోడై యుందువు" (కీర్త 23 : 4).

అప్పుడు క్రైస్తవునికి ఆనందము కలిగెను. దానికి కారణము లేవనగా :

1. తానొంటరిగా లేడు గాని తనవలెనే దేవునికి భయపడిన వాడొకడా స్థలమునందు నడచిపోవు చుండెను గదా యని క్రైస్తవుడా మాటలను బట్టి గ్రహించెను.

2. అంత గాఢాంధకారమగు స్థలమైనను కష్టస్థితి యైనను దేవు డతనికి తోడై యుండెనని క్రైస్తవుడు గ్రహించెను. ఈ మాటలాడు వానికి దేవుడీ సమయమున తోడై

యున్నచో నాకేల తోడుగా నుండడు? అని క్రైస్తవు డనుకొనెను. ఒకవేళ ఆ స్థలమునందు తనకు సంభవించిన దుస్థితి చేత మనస్సు కలిగినవాడై దేవుని చూడ లేకున్నను ఆయన తనకు తోడుగానే యుండెనని యతడు గ్రహించెను. (యోబు 9 : 11).

3. మరియు ఒకవేళ తాను త్వరగా నడచి ముందు నడచువానిని చేర గలిగిన యెడల తన ప్రయాణమునందు సహవాసము దొరకునుగదా యని క్రైస్తవు డనుకొనెను. ఈ మూడుకారణముల చేతను క్రైస్తవుని హృదయమున ఆదరణ కలిగెను.

కావున క్రైస్తవుడు త్వరత్వరగా నడచి తనయెదుట నడచుచున్నవానిని యెలుగెత్తి పిలచుచుండెను. ఇంతలో తెల్లవారెను. అప్పుడు క్రైస్తవుడు "ఆయన కారుచీకటిని ఉదయముగా మార్చినాడుగదా"- యని దేవుని స్తుతించెను. (ఆమోసు 5 : 8). ఇప్పుడు వెలుగు వచ్చినందున అతడు వెనుకకు తిరిగి చూచెను. ఎందుకనగా వెనుకకు తిరిగిపోదలచి కాదు గాని గతించినరాత్రి చీకటియందు తానెట్టి గండములనుండి దాటితినోయని చూచుటకు వెనుకకు చూచెను. ఇట్లు క్రైస్తవుడు చూచినపుడు ఆలోయయందు మార్గముప్రక్కనే అపాయకరమగు గుంటయు, తాను నడచిన సన్నని మార్గమును అతనికి కనబడెను. మరియు ఆ గుంటయందున్న పీడలు,

పిశాచములు ఆ లోయయందలి డ్రాకోనులను రాక్షసనమూహములు అతనికి కనబడెను. గాని అవియన్నియు నిపుడు చాల దూరమందు వెనుకబడి యుండెను. మరియు తెల్లవారిన వెనుక అవి క్రైస్తవుని సమీపించలేదు. "చీకటిలోని రహస్యములను ఆయన బయలుపరచును, మరణాంధకారమును వెలుగులోనికి రప్పించును" అని వ్రాయబడియున్న ప్రకారము దేవుడు తనకు చూపెనని క్రైస్తవుడు గ్రహించెను. (యోబు 12 : 22).

ఆ యేకాంతమార్గమున దేవుడు తన నేయే ఆపదల నుండి తప్పించెనో క్రైస్తవుడు చూచి చాల ఆశ్చర్యపడెను. ఇంతకు ముందు ఆ యాపదలను చూచి భయపడినను, పగటి వెలుగున వాటిని చూచినపుడు వాటి భయంకరత్వము మరింత స్పష్టముగా అతనికి తెలిసెను.

ఇంతలో సూర్యుడు పైకెక్కుచుండెను. ఇది క్రైస్తవునికి మరియొక దీవెన. ఎందుకనగా మరణచ్ఛాయ లోయలో తాను దాటివచ్చిన మొదటిభాగము అపాయకరమైనదే యైనను, తానింకను పోవలసిన రెండవభాగము మరింత అపాయకరమైనదియే యని మీరు మరువగూడదు. ఇప్పుడు క్రైస్తవుడు నిలచినచోటినుండి తాను పోవలసిన మార్గమంతయు, లోయ చివరివరకును ఉరులును, బోనులును మీటలును వలలును ఒకప్రక్కను; మరియొకప్రక్క గోతులు, లోతైన

గుంటలు, మెట్టలు చాలయుండెను. ఇదియేగనుక తాను దాటిన మొదటిభాగపు ప్రయాణమువలె రాత్రియై యుండిన యెడల క్రైస్తవునికి వెయ్యిగుండెలున్నను చెదిరిపోయియుండ వలసినదే. కాని నేను చెప్పినట్టుగా ఆ సమయమున సూర్యో దయ మగుచుండెను. అప్పుడు క్రైస్తవు డిట్లనుకొనెను: ఆయన దీపము నాతలకుపైగా ప్రకాశించెను (యోబు 29 : 3). గనుక యీ వెలుగులో నడచి క్రైస్తవుడు లోయచివరకు వచ్చెను.

## క్రైస్తవుడు విశ్వాసిని కలసికొనుట

ఇట్లు క్రైస్తవుడు తనదారిని పోవుచుండగా కొంచెము ఎత్తయిన మెట్టమీదికి వచ్చెను. యాత్రికులు తమముందు దారిని చూచుకొనునట్లిది కట్టబడెను. క్రైస్తవుడు తనమార్గ మును చూచుకొనుట కక్కడకు వెళ్లి ముందుకుచూడగా విశ్వాసియనువాడు మార్గమున తనకంటె ముందుగా వెళ్లు చున్నట్టు కనబడెను. అంతట క్రైస్తవుడతని వెలుగెత్తి యిట్లు పిలచెను: ఓహో కొంచెమాగుము, నేనును నీతో సహవాసి నగుదును. ఈ మాటవిని విశ్వాసి వెనుకకుతిరిగి క్రైస్తవుని చూచెను. అంతట క్రైస్తవుడు తిరిగియిట్లనెను: ఆగుమాగుము. నేను వచ్చువరకును కొంచెముఆగుము! అందుకు విశ్వాసి:

వీలులేదు, నాప్రాణమును రక్షించుకొనఁ బరుగెత్తుచున్నాను. రక్తము తీయవలెనని శత్రువు నా వెంటనే వచ్చుచున్నాడు. అనెను. ఈమాటలకు క్రైస్తవుడు కొంత ఉద్రేకముపొంది త్వరగా పరుగెత్తి విశ్వాసిని కలిసికొనుట మాత్రమేగాక నాలుగడుగులు ముందుకుకూడ పోయెను. అట్లు కడపటివాడు మొదటివాడయ్యెను. అప్పుడు తన సహోదరుడగు విశ్వాసి నధిగమించి దాటిపోయినందుకు క్రైస్తవుడు కొంచెము వృథా తిశయముగా నవ్వెను. ఈ అతిశయములో తనదారిని జాగ్ర త్తగా చూచుకొనక క్రైస్తవుడు హఠాత్తుగా తూలిపడెను. విశ్వాసివచ్చి అతనిని పైకెత్తువరకును క్రైస్తవుడు లేవలేక పోయెను.

పిమ్మట నేను నా స్వప్నమునందు చూడగా వారిద్ద రును బహు మైత్రితో ప్రయాణముచేసి వారియాత్ర యందు తమ తమకు సంభవించిన వాటిని గూర్చి ముచ్చటించు కొనుచు ముందుకు సాగి పోయిరి. సంభాషణ సందర్భముగా క్రైస్తవు డిట్లు చెప్పెను.

క్రైస్త:- గౌరవపాత్రుడవగు ప్రియ మిత్రుడా, విశ్వాసీ! నిన్ను కలసికొని నందుకు నాకు చాల ఆనందముగా నున్నది. ఈ రమ్యమగు మార్గమునందు మన మిరు వురమును సహచరులమై సాగిపోవుటకు దేవుడు మన హృదయములను ఐక్యపరచెను. ఇదెంత సంతోష కరము !

విశ్వా:-ప్రియమిత్రుడా, మన గ్రామమునుండియే నీ సహవాసము చేసి ప్రయాణమున రావలయునని ఆశించితిని గాని నీవు నా కంటే ముందే బయలుదేరితివి. గనుక యింతదూరము నేను ఒంటరిగానే రావలసి వచ్చినది.

క్రైస్త:-నేను బైలుదేరిన వెనుక నీ యాత్రకు వచ్చుటకు ముందు నీ వెంత కాలము నాశనపురము నందుంటివి?

విశ్వా:-కొద్దికాలములోనే ఆ నాశనపునందు నేనుండ లేనని నిశ్చయించు కొంటిని. నీవు వచ్చివేసిన కొద్ది కాలమునకే ఒక గొప్ప వదంతి బైలుదేరినది. పరలోకమునుండి అగ్నివచ్చి మన పట్టణమును సర్వ నాశనము చేయునని ప్రజలు చెప్పుకొను చుండిరి.

క్రైస్త:-ఏమి! నీ యిరుగు పొరుగు లట్లు చెప్పు కొనిరా?

విశ్వా:-అవును కొంత కాలము వరకెవరినోట చూచినను ఇదే మాట.

క్రైస్త:-అయితే యింత అలజడి యైనను నీవు తప్ప మరెవరును తప్పించుకొనుటకు రాలేదా?

విశ్వా:-నేను చెప్పినట్టు వదంతి కలిగిన మాట నిజమేగాని వారా సంగతిని గట్టిగా నమ్మినట్టు కనబడదు. ఎందుకనగా మాటల సందర్భమున నేను వినిన దేమనగా అనేకులు నిన్ను గూర్చి హేళనగా మాటలాడిరి.

నీ ప్రయాణమునుగూర్చి అపహాసించిరి. అది మతి లేని వ్యర్థభయమని పేర్లు పెట్టిరి. గాని పైనుండి అగ్నియు గంధకమును వచ్చి మన పట్టణమును కాల్చివేయునని నేను మాత్రము నమ్మితిని; యిప్పుడు కూడ నమ్ముచునే యున్నాను. అందుచేతనే నేను త్వరగా బయలుదేరి తప్పించుకొని వచ్చితిని.

క్రైస్త:-అవును గాని మన పొరుగువాడైన మెత్తనను గూర్చి యేమైన వింటివా ?

విశ్వా :- వింటిని, వింటిని. నిరాశగుంట వరకు అతడు నిన్ను వెంబడించెనట. అందులోపడెనట. ఆ మాట యెవరికిని తెలియగూడదని ప్రయత్నించు చున్నాడట గాని అందులో వాని కంటుకున్న మురికి వదలనే లేదట.

క్రైస్త :- అప్పుడతని యిరుగు పొరుగు లేమనిరి ?

విశ్వా :- అతడు వెనుకకు వచ్చిన నాటినుండియు అందరును అతనిని హేళన చేయుచున్నారు. మరికొందరైతే అతనిని దూషించుట కూడకద్దు. వానికెవడును పని యిచ్చుటయే మానివేసినారు. ఇప్పుడు వాని బ్రతుకు కుకన్న ఆ పట్టణమునందు వాడు మొదట జీవించిన జీవితమే యేడింతలు మేలుగా నున్నది.

క్రైస్త :- అయితే అతడు రాజూచిన మార్గమును వారు కూడ విసర్జించిరి గదా, అట్టి యెడ వారతని నెందు కంత నీచముగా చూడవలయును ?

విశ్వా :- వీనిని చంపుదము. వీడు ఏ యెండ కా గొడుగు పట్టు సమయాను సారి, యని వానిని తిట్టుచున్నారు. వాడు చెప్పిన దొకటి చేయునది మరొకటి యని దూషించుచున్నారు. వాడు దేవుని మార్గమును విడిచినందున దేవుడు వానిని జనులందరిలో శాపాస్పదము గాను విస్మయ కారణము గాను అసహ్యాస్పదము గాను నిందాస్పదము గాను చేసెను. (యిర్మి 29 : 18, 19.)

క్రైస్త :- నీవు బైలుదేరి రాకముందు నీవతనితో మాట్లాడ లేదా ?

విశ్వా:- నే నొక్కసారి మాత్రము వీధిలో అతని చూచితిని. గాని అతడు సిగ్గుచేత పెడముఖము పెట్టుకొని పోయెను. అందుచేత నేనతని పలుకరించ లేదు.

క్రైస్త :- మొత్తమువిూద మొదట నేను బైలుదేరినపుడు మెత్తనను గూర్చి నాకెంతో నిరీక్షణ యుండెను. గాని మన పట్టణముతోపాటు వాడు కూడ నశించుట తప్పదని నేనిప్పుడనుకొను చున్నాను. కుక్క తన వాంతికి తిరిగినట్టును, కడుగబడిన పంది బురదలో దొర్లుటకు మళ్ళినట్టును అను నిజమైన సామెత చెప్పున వీనికి సంభవించెను. (II పేతు 2 : 22)

విశ్వా :- నేను కూడ నిట్లే విచారించుచున్నాను. గాని కానున్నది కాక మానదు గదా!

క్రైస్త :- సరియే గాని మిత్రుడా, విశ్వాసీ, వాని సంగతి నిక విడిచిపెట్టి మనకు ముఖ్యముగా నగత్యమగు విషయములను గూర్చి మాటలాడు కొందము. నీవు వచ్చుచుండగా నీకు సంభవించిన వాటినిగూర్చి కొంచెము చెప్పుము. ఎందుకనగా నీకు కొన్ని అనుభవములు కలుగక మానవని నేననుకొనుచున్నాను.

## విశ్వాసికి కలిగిన అనుభవములు.

విశ్వా:-నేను వచ్చుచుండగా నిరాశ గుంటను చూచితిని. మీరు దానియందే పడియుందురని నేను అనుకొంటిని. నేను మెళుకువ గలిగి తప్పించుకొని విడ్డిగుమ్మమును చేరితిని. అయితే కాముకురాలు అను పేరుగల దొకతె నాకు కనబడినది. అది నన్ను చిక్కులు పెట్ట జూచినది.

క్రైస్త:-నీవు దాని వలలో పడకుండ తప్పించుకొనుట చాల మేలయినది. యోసేపును కూడ దానివలలో పడవేసికొన జూచినది. గాని నీవలెనే యోసేపును తప్పించుకొనెను. అది అతని ప్రాణము మీదికి కూడ వచ్చి

నది (ఆది 39 : 11-13) అయితే అది నిన్నెట్లు మోసగింప జూచినది ?

విశ్వా:-దానికున్న డంబపు నాలుక యెంతటిదో నీవు ఊహించలేవు. నాకు కావలసినంత సంతృప్తి నిత్తునని నన్ను తన మార్గమునకు మళ్ళింపజూచి నన్ను బలవంతపెట్టినది.

క్రైస్త:-సంతృప్తియా, నిర్మల హృదయులకుండు మనస్సాక్షి నిచ్చుటకు దాని తరమా ?

విశ్వా:-అబ్బే, శరీర భోగేచ్ఛలన బడిన పాపపు సంతుష్టియే దాని దగ్గర నున్నది.

క్రైస్త:-నీవు దానినుండి తప్పించుకొనుట దేవుని కృపచేతనే. యెహోవా శాపము నొందినవారు ఆ గుంటలో పడుదురు. (సామె 22 : 14).

విశ్వా:-అయినను దానినుండి నేను పూర్తిగా తప్పించుకొంటినో లేదో చెప్పలేకున్నాను.

క్రైస్త:-అదేమి ? దాని కోరికలకు నీవు సమ్మతించలేదుగదా?

విశ్వా:-లేదు లేదు. నన్ను నే నపవిత్రపరచుకొనుటకు నేను సమ్మతించలేదు. 'దాని యడుగులు పాతాళమునకు చక్కగా చేరును' అని యొక పురాతన గ్రంథము నందెక్కడనో చదివి యుంటిని. (సామె 5 : 5) దాని కనుదృష్టిలో పడి పిచ్చి యెత్తి పోకుండా నేను

నా కన్నులతో నిబంధన చేసికొని మూసి కొంటిని. (యోబు 31 : 1). అప్పుడది నన్ను తిట్ట మొదలు పెట్టెను. నేను మాత్రము నా దారిని వచ్చితిని.

క్రైస్త-నీవు వచ్చుచుండగా నీపై కెవరును దండెత్తలేదా?

విశ్వా:-ఇబ్బంది యనుకొండ దిగువకు నేను వచ్చు సరికి నా కొక వృద్ధుడగు పడెను. నీ వెవరవు, యెక్కడకు పోవుచున్నావు? అని నన్నతడు ప్రశ్నించెను. నేనొక యాత్రికుడ ననియు నిత్యజీవపురమునకు పోవుచున్నా ననియు నే నతనికి చెప్పితిని. అయితే, ఆ ముసలి వాడు——నీవు చాల నమ్మకస్థునివలె నున్నావు. నేను నీకు మంచి జీత మిత్తును నా యింట నుందువా యని అడిగెను. నే నతని పేరును యూరును అడిగితిని. అతని పేరు పాత ఆదామనియు అతడు కపటపురిలో నివసించుచున్నాడనియు ఆ ముసలివాడు చెప్పెను. (ఎఫెసి. 4 : 22) అప్పు డతని యింట నేను చేయ వలసిన పని యేమనియు, అత డిచ్చు జీత మేమ నియు నేను ప్రశ్నించితిని. అతని పని సమస్త సుఖే చ్ఛలట. అతడిచ్చు జీతమేమనగా అతని తదనంత రమునే నెల్లకాలమును అతని వారసుడ నగుదునట. అతనిసంసార మెట్టిదో అతని యితర సేవకు లెవరో కూడ నే నతని నడిగితిని. అతని యింట సమస్తమైన లోక

భోగములును కలవనియు, అతని సేవకు లతని సంతా
నమే యనియు నా ముసలివాడు చెప్పెను. అతనికి
పిల్లలెందరని నేతని విచారించితిని. అతనికి ముగ్గురే
కుమార్తెలని యతడు చెప్పెను. శరీరాశ, నేత్రాశ,
జీవపు డంబమునననువి వారి పేరులట. (I యోహా
2 : 16) నాకిష్టమైతే నేను వాటిని పెండ్లాడవచ్చునని
కూడ యతడు చెప్పెను. నేనెంత కాల మతని యొద్ద
నుండవలెనని ఆముసలివాని నడిగితిని. తాను జీవించి
నంత కాలము నే నుండవలెనని యతడు జవాబిచ్చెను.

క్రైస్త:-మంచిది, మరి చివరికి మీరేమి నిశ్చయించుకొనిరి?

విశ్వా:-నిశ్చయమున కేమున్నది. మొదటలో అతనిమాటలు
నాకు బాగుగా నచ్చినందున అతనితో పోవుటకు
కొద్దిగా యిష్టపడితిని. అయితే నేనతనితో మాట
లాడుచుండగా పురాతన పురుషుని వానిక్రియలతో
కూడ విడిచిపెట్టుమని వానినొసటిపై వ్రాసియుండుట
చూచితిని.

క్రైస్త:-పిమ్మట యేమైనది?

విశ్వా:-అంతట నాకొక్కతలంపు గప్పున వచ్చినది. వా
డెంతటి చక్కని మాటలాడినను, నన్నెంతగా పొగ
డినను తనయింటికి నన్ను తీసుకొనిపోయిన వెంటనే
నన్నొక బానిసగా అమ్మివేయునని నా కర్థమైనది.

అందుచేత నేనతని యింటిగడప త్రొక్కనని చెప్పి సంభాషణ చాలించుమంటిని. అప్పుడతడు నన్ను బహుగా దూషించి నా మార్గమున నాయాత్మకు విషముగా నుండునట్లు చేయుటకొకని పంపుదునని భయపెట్టెను. అందుచేత నేనక్కడనుండి త్వరగా తిరిగి తప్పించుకొనబోతిని. గాని నేను సాగిపోవుటకు తిరుగకముందే వాడు నాశరీరమును పట్టుకొనెను. వాడు నన్నొకసారి బలముగా వెనుకకు లాగినపుడు నా శరీరము సగము వాని వశమైనదనుకొంటిని. అప్పుడు నేను "అయ్యో నేనెంత దౌర్భాగ్యుడను!" అని దుఃఖించితి. (రోమా 7 : 24) పిమ్మట నేనెట్లో నా మార్గమునబడి కొండయెక్కితిని. అంతట నేను సగము దూరమెక్కి వెనుకకు తిరిగిచూడగా, సుడిగాలివలె నా వెంట నొకడు పరుగెత్తి వచ్చుచుండెను. వాడు పరుగెత్తివచ్చి పర్ణశాల పీఠమున్నచోట నన్ను కలసికొనెను.

క్రైస్త:-ఆ! అక్కడనే నేనుకూడ కొంచెము విశ్రమింపవలెనని కూర్చుండి, నిద్రమత్తులోబడి యీ కాగితపు చుట్టను నాయొడినుండి జారవిడిచితిని.

# మోషే విశ్వాసిని బాధించుట

విశ్వా:-అయితే, సోదరుడా! నాకథ వినుము. ఆమనుష్యుడు నన్ను కలిసికొనిన వెంటనే అతని మాటలతోడి దెబ్బలు నాకు తగులజొచ్చెను. గాని నేను కొంత ధైర్యమును చిక్కబట్టిన వెంటనే నన్నెందు కట్లు బాధించుచుంటివని నేనతని నడిగితిని. నేను మొదట ఆదాము నెడల రహస్యముగా మక్కువ చూపినందు కట్లు అతడు బాధించెనట. ఈ మాట చెప్పి నా గుండెపై మరొక్క చావుదెబ్బకొట్టి నన్ను వెనుకకు పడ వేసినాడతడు. గనుక నే నెప్పటివలె చచ్చినట్లు వాని కాళ్ళయొద్ద పడిపోతిని. అంతట నేను మరల స్మృహవచ్చినపుడు వానిని రక్షింపుమని వేడితిని. గాని దయచూపుట యెట్లో తనకు చేతకాదని వాడు చెప్పెను. ఇట్లుచెప్పి వాడు మరల నన్ను వెనుకకు పడ గొట్టెను. వాడు నన్ను చంపివేయువాడే గాని అంత లోనే యొక పుణ్యాత్ముడువచ్చి అతనిని వారించెను.

క్రైస్త:-అతని నాపు జేసిన యాతెడెవరు?

విశ్వా:-అతడెవరో మొదట నాకును తెలియలేదు. గాని ఆయన వెళ్లుచుండగా చేతులయందు ప్రక్కయందును గాయములను చూచితిని. అప్పుడాయన మనప్రభువే

యని నేను గ్రహించితిని. అంతట నేను కొండయెక్కి సాగిపోతిని.

క్రైస్త:-నిన్ను పట్టి బాధించినవాడు మోషే. అత డెవరిని కనికరించడు. అతని ధర్మశాస్త్రమును మీరు వారి కతడు దయచూపుట చేతయే కాదు.

విశ్వా:-అవును. నాకా సంగతి తెలియును. అతడు నన్ను కలిసికొనుట యిది క్రొత్తగాదు. నేను మన పట్టణములో నా స్వగృహమునం దున్నపు డతడు నా యొద్దకువచ్చి నేనక్కడనే యున్నయెడల నన్ను నా యింటితోకూడ మాడ్చివేయుదునని చెప్పెను.

క్రైస్త:-మరి నిన్ను మోషే కలిసికొనిన కొండశిఖరముమీద నొక యిల్లున్నది, చూచితివా?

విశ్వా:-అవును. యింటినే కాదు యింటిని సమీపించకముందు సింహములనుకూడ చూచితిని. అయితే ఆ సింహములు నిద్రించు చున్నట్టుండెను. ఎందుకనగా అది మధ్యాహ్న వేళ. గాని యింకను చాల ప్రొద్దున్నది గదాయని అక్కడ బసచేయక ద్వారపాలకుని దాటి కొండదిగి వచ్చివేసితిని.

క్రైస్త:-నీవు దాటి వచ్చివేసితివని ఆ ద్వారపాలకుడు నాకు చెప్పియేయుండెను. గాని నీవక్కడ బసచేసి యుండిన యెడల బాగుండెడి దనుకొనుచున్నాను. ఎందుకనగా

వారక్కడ యెన్నో క్రొత్తవిషయములను చూపి యుందురు. వాటిని నీవు చూచినయెడల నీ జన్మాంతమువరకు వాటిని మరువలేవు. దానికేమి గాని, మరొకసంగతి యడిగెదను. వినయరూపమను లోయయందు నీకెవరైన కనబడిరా?

## అసంతుష్టి

విశ్వా:-అవును, అసంతుష్టి యను పేరుగలవా డొకడు కనబడినాడు. నన్ను వెనుకకు తనతోరమ్మని నన్నెంతయో బలవంతపెట్టెను. ఆ లోయయంతయు ఘనతలేనిదని వాడు నన్ను ఒప్పింపజూచెను. మరియు ఆ మార్గమునందు పోయినచో అహంకారుడు, గర్వి, మదమూర్తి, లోకకీర్తి మొదలగు నా స్నేహితులందరికిని కష్టము కలిగించినట్లట. ఈ మార్గమునందు బోవుట బుద్ధిహీనమనియు అందుచేత వారికందరికి చాల అభ్యంతరము కలుగుననియు అసంతుష్టి నాకు బోధించెను.

క్రైస్త:-దీనికి నీవేమి జవాబిచ్చితివి?

విశ్వా:-అతడు పేర్కొనిన వారందరును నా బంధువులే యని చెప్పితిని. ఎందుకనగా శరీరానుసారముగా వారు

నాకు బంధువులే. గాని నేను నాయాత్రకు ప్రయాణమైనప్పటినుండియు వారు నన్ను విడిచిపెట్టిరనియు, నేనుకూడ వారిని విసర్జించితిననియు అసంతుష్టికి చెప్పితిని. గనుక ప్రస్తుతము వారు నాకు కేవలము లౌకికవారుగానే యున్నారని చెప్పితిని. మరియు నేను పోవుచున్న ఆ లోయనుగూర్చి యతడు చెప్పినది నిజము కాదు. అది చాల తప్పుచరిత్ర. ఎందుకనగా గౌరవమునకు ముందు వినయము నడచును, నాశనమునకు ముందు గర్వముండును. అను సామెతప్రకారము బుద్ధిమంతులు పొగడుచుండు ఘనతకే యిది దారితీయును. గనుక నాశరీరేచ్ఛ యెట్లులాగిన నట్లుపోక వినయమను యీలోయగుండా పోవుదును.

## సిగ్గు

క్రైస్త:-ఆలోయలో నింకెవరును నీకు ఎదురుపడలేదా?

విశ్వా:-అవును, సిగ్గు-అను పేరుగలవాడొకడు నాకు కనబడెను. గాని నా ప్రయాణమునందు నేను కలిసికొన్నవారందరిలోను వీడే పేరుకు తగని బుద్ధిగలవాడు. మరెవనితోనైన కొంత వాదించి కాదు-అని చెప్పవచ్చును. గాని, యీ మొండిముఖముగల సిగ్గు అను

వానిని కాదని వదలించుకొనుట మన తరముగాదు.

క్రైస్త:-ఏమి, వాడు నీతో నేమనెను ?

విశ్వా-ఏమన వలయును. మతభక్తియే కూడదన్నాడు. మతమును గూర్చి ఆసక్తి గలిగియుండుట నీచమనియు, పిరికి తనమనియు పౌరుష హీనులకే తగిన పనియనియు వాడు చెప్పినాడు. మెత్తని మనస్సాక్షి కలిగియుండుట పౌరుష హీనమట. నరుడు తన మాటలను తన క్రియలను జాగ్రత్తగా పరిశీలించుకొనుచు ప్రవర్తించుట నేటి నవనాగరిక లోకమున హాస్యాస్పదమట. ధైర్యవంతుడు తన చిత్తమువచ్చినట్టు ప్రవర్తించుచు స్వేచ్ఛగా కాలము గడుపవలెనట. బలవంతులును, ధనవంతులును, జ్ఞానులును నా మార్గమునను సరింపరట. మరియు వారు బుద్ధిహీనులై ఉన్నదంతయు బూడిదపాలు చేసికొన సమ్మతించిన వారైతే తప్ప మిగత వారీ మార్గమును త్రొక్కరట. ఈ మాటలన్నియు చెప్పి సిగ్గు అను వాడు నన్నవమానించెను. (I కొరిం 1 : 26; 3 : 18; ఫిలి 3 : 7-9; యోహా 7 : 48.) వాని కాలములో యాత్రికులైన వారి నీచస్థితిని పేదరికమును కూడ వాడు యెత్తి చెప్పెను. వారి పామరత్వమును గూర్చియు నవీన శాస్త్రజ్ఞానము లేక పోవుటను

గూర్చియు వాడు ప్రస్తావించెను. అబ్బో, వాడు నాకు చెప్పినమాట లిన్ని యన్ని అని చెప్పజాలను, దైవ వాక్య ఉపదేశములను వినుచు దుఃఖించుచు పశ్చాత్తాప పడుచు కూర్చుండుట సిగ్గుల పనియట, మనము చేసిన చిన్న చిన్న తప్పులకు మన పొరుగువారిని క్షమాపణ కోరుట సిగ్గుల పాలట. ఎవడైన నేదైన తీసికొన్న యెడల వారికి మరల దానిని చెల్లించుట అవమాన కరమట. మతమను దానిచేత మానవుడు తన దురలవాటులను విడిచిపెట్టి గొప్పవారి దృష్టిలో నీచమగుచున్నాడట (ఈ దురలవాటులను సిగ్గు చక్కని ముద్దుపేరులు పెట్టి పిలుచు చున్నాడు). మరియు మతాసక్తిచేతనే నరుడు అందరును సహోదరులని నీచులనుకూడ చేరదీయు చున్నాడట—ఇందు వలన మానవుని గౌరవము చెడిపోవుచున్నదని సిగ్గు యొక్క యభిప్రాయము.

క్రైస్త:—ఈ మాటలకు నీవేమి జవాబిచ్చితివి ?

విశ్వా:—జవాబు చెప్పుటయా? మొదట నా నోటినుండి మాట రాలేదు. నిజము చెప్పుచున్నాను. వాడా మాటలన్నియు చెప్పుచుండగా నాకు నిజముగానే సిగ్గువేసినది. నా ముఖ మెఱ్ఱబారినది. వాని మాటలు నమ్మి పడిపోవలసిన స్థితికి వచ్చితిని. గాని

తుదకు యోచించగా మానవులు మహా ఘనమైన దని దేనిని చూచుకొందురో అది దేవుని దృష్టికి హేయమైనదని గ్రహించితిని. (లూకా 16 : 15). అప్పుడు నేననుకొంటిని: ఈ సిగ్గు అనువాడు మానవ నైజస్వభావమును నాకు బోధించుచున్నాడు. గాని దేవుడెట్టివాడో ఆయన జీవ వాక్యమెంత శక్తిగలదో విడు చెప్పుటలేదు మరియు మహాశ్రమ దినమగు తీర్పు దినమునందు స్థిరతలేని మనుష్యులయొక్క యిష్టా యిష్టములను బట్టి కాదుగాని మహోన్నతుడగు దేవుని జ్ఞానమును బట్టియు, న్యాయమును బట్టియు తీర్పునొంది మరణమునో జీవమునో పొందవలెను గదా యని నేననుకొంటిని. కాబట్టి లోకులందరు కలసి కాదన్నను దేవుడు చూపిన దారియే అత్యుత్తమమైనది, దానికి సందేహము లేదని నేను నిశ్చయించుకొంటిని. అప్పుడు దేవుడు నియమించిన భక్తి ఆయన కిష్టమైనదనియు, సున్నితమగు మన సాక్షి ఆయనకు ప్రీతికర మనియు, పరలోక రాజ్యము కొరకై లోకము నెదుట తమ్మును తాము వెర్రివారినిగా నెంచుకొనువారు నిజముగా బుద్ధిగలవారనియు, క్రీస్తును విసర్జించిన ధనికునికంటె క్రీస్తు నెరిగిన పేదవాడే వాసి యనియు తెలియజెప్పితిని. మరియు

వానితో నిట్లంటిని. ఓయి, సిగ్గూ నన్ను విడిచి పొమ్ము. నీవు నా రక్షకునికి విరోధివి. నా సర్వాధికారియగు ప్రభుని విడిచి నిన్ను పూజింతునా? అట్లయినచో ఆయన వచ్చినపుడు నే నాయన ముఖము నెట్లు చూడగలను? (మార్కు. 8 : 38.) ఆయన మార్గములన్నను, ఆయన సేవకులన్నను నేనిపుడు సిగ్గుపడిన యెడల నాకు దీవెన యెట్లు కలుగును? ఇన్ని మాటలన్నను సిగ్గు అనువాడు మొండివాడగు దుష్టుడు. నా దగ్గర నుండకుండ వానిని నేను వెడలగొట్ట లేనైతిని. పైగా వాడు నన్ను వెన్నంటుచు భక్తిగలవారి జీవితము లందలి బలహీనత లేవియైన చూపి నా చెవిలో గొణుగుచుండువాడు. గాని తుదకతనితో నొక్కవిషయమును చెప్పితిని. ఏమనగా: నీవీ ప్రయత్నములో నుండుట వ్యర్థము; నీవే యేవిషయములను హీనముగా చూచుచున్నావో, అవియే నాకు మిక్కిలి మహిమ కరములుగా నున్నవి. ఈ మాటలు చెప్పి యెట్టకేలకు ఆ దుర్మార్గుని బారి నుండి తప్పించుకొంటిని వాని పీడవదలి పోగానే నే నీ పాట పాడుకొంటిని.

దేవుని స్వరమును విని - దీనుడై వినయము గాని
పోవుచుండెడి వారికి - కష్టంబులే ప్రతిసారికి
దేహమును బాధించు నలిగిడి - కలుగుచుండుట తప్పదు

బాధపెట్టుట తప్పదు
మరల వచ్చుట తప్పదు ॥దే॥.

ఇప్పుడో మరియెప్పుడో - ఆ తిప్పలకు భయమును గాని
తలవంచిన వారు దారిని - తప్పిపోవుట తప్పదు
గనుక యాత్రికులార నిత్యము - కన్ను విప్పక నడువుడి
భద్రమార్గము వెదకుడి
నిద్రపోవక చూడుడి ॥దే॥

క్రైస్త:-సోదరుడా, యీ దుర్మార్గుని ఇంత ధైర్యముగా నీ వెదిరింపగలిగినందుకు నా కెంతయు ఆనందముగా నున్నది. ఎందు కనగా నీవు చెప్పినట్టు వాని పేరుకు మించిన దుష్టుడతడు. సిగ్గు అని వానిపేరేగాని వాడు మనలను వీధులయందు వెంటాడి నలుగురిలోను మనకు తలవంపులు తెచ్చుటకు వెనుకదీయడు. అనగా మంచివాటిని గూర్చి మనము అనవసరముగా సిగ్గుపడునట్లు వాడు చేయుచుండును. వీడింత సిగ్గుమాలిన వాడైనందుననే యిన్ని పన్నాగము లెరిగియున్నాడు. అయితే మనమింకను వాని నెదిరించవలయును. ఎందుకనగా వానికెన్ని జిత్తులు డంబపు మాటలున్నను వాని వలలో బుద్ధిహీనులు తప్ప మరెవరును పడరు. జ్ఞానులు ఘనతను స్వతంత్రించుకొందురు. బుద్ధిహీనుల అవమాన భరితులగుదురు-అని సొలోమోను జ్ఞాని చెప్పెనుగదా (సామె 3 : 35).

విశ్వా:-ఈ సిగ్గు అనువానినుండి తప్పించుకొనుటకు సహాయ మిమ్మని మనము ప్రభువును మొరపెట్టవలయునని నాకు తోచుచున్నది. ఎందుకనగా లోకములో సత్యము కొరకు ధైర్యముగా నిలుచునట్లు ఆయనే మనకు సహాయము చేయును.

క్రైస్త:-నీవు చెప్పినది సత్యమే. సరేగాని ఆలోయలో నీ వింకెవ్వరిని కలసికొనలేదా?

విశ్వా:-లేదు. మరెవ్వరిని కలసికొనలేదు. ఆ మరణచ్ఛాయ గల లోయగుండా వచ్చునపుడు మిగిలిన ప్రయాణ మంతటను నాకు పట్టపగటి వెలుగుండెను.

ఇట్లు నేను కలయందు చూచుచుండగా విశ్వాసి దారి ప్రక్కనొక మనుష్యుడుండుట చూచెను. అతని పేరు వాచాలుడు. వాడు విశ్వాసికి ప్రక్కనే కొంత దూరమున నడచుచు వచ్చుచుండెను. ఎందుకనగా ఆ మార్గము విశాలమై వారందరును నడచుటకు స్థలముండెను. వాచాలుడు కొంచెము ఆజాను బాహువు. దగ్గర చూపుల కెట్లున్నను దూరమునుండి చూచు వారికతడు సుందరునివలెనే కనబడు చుండెను. వానితో విశ్వాసి యిట్లు సంభాషించెను.

# విశ్వాసికిని వాచాలునికి జరిగిన సంభాషణ.

విశ్వా:-మిత్రుడా, యెక్కడికి ప్రయాణము ? నీవును పరమ పురమునకేనా ?

వాచా:-అవును. నే నక్కడికే పోవుచున్నాను.

విశ్వా:-సంతసము. అట్లయిన నీ సహవాసము కూడ మేమను భవింప వచ్చును.

వాచా:-ఇంతకన్న కావలసిన దేమి ? మీ సహవాస భాగ్యమున నాకును సంతోషమే.

విశ్వా:-అయిన రమ్ము. మన మందరమును కలసిపోవుదము. మరియు మనకు లాభకరములగు విషయములను గూర్చి యొక్కింత సంభాషించుదము.

వాచా:-మాటలాడుట యంటివా? మీతో గాని మరెవరితో గాని మంచి విషయములను మాటలాడుట యన్న నేను చెవి గోసి కొందును. ఇంతటి సత్కార్యమును చేయ సమకట్టిన మీతో నాకు సహవాసముదొరకు టెంత భాగ్యము? ఏమందు రేని తమ ప్రయాణములందు తమ సమయము నీరీతిగా సద్వినియోగము చేయు బుద్ధిమంతులు అరుదుగా నుందురు. అట్టివారు పనికి రాని విషయములనుగూర్చియే మాటలాడు కొందురు. అట్టివారన్న నాకెన్నడును తలనొప్పి.

విశ్వా:-నీవు చెప్పినమాట నిజమే. అదెంతయు దుఃఖకరమైన సంగతి. ఎందుకనగా దేవుడిచ్చిన నాలుకతో దేవుని సంగతులు మాటలాడుకొనుట తప్ప యింతకన్న యోగ్యమైన పని యేమిగలదు?

వాచా:-మిత్రమా, నిన్నుచూచిన నాకు ముచ్చట యగుచున్నది. ఎందుకనగా నీమాటలు తూచి వేసినట్లు సర్వజన సమ్మతిముగా నున్నవి. అవును నీవన్నట్లు, దేవుని విషయమైన మాటలకన్న వేరు ఉపయోగమైన మాట లింకేమైనగలవా? ఉదాహరణముగా చెప్పుచున్నాను: చరిత్రలును, సృష్టి మర్మములను గూర్చి మాటలాడినను, అద్భుతములు, సూచకక్రియలనుగూర్చి చర్చించినను దేవుని పరిశుద్ధలేఖములకు సరిరావుగదా? దైవ వాక్యమునందున్న మధురత్వమును, రచనారమ్యతయు మరెక్కడను కనబడవుగదా?

విశ్వా:-ఆమాట నిజమే. గనుక నట్టిసంభాషణను చేసి మేలు పొందుటకు మనమిప్పుడు సంకల్పించవలసి యున్నది.

వాచా:-మరి నేను చెప్పినదదియే. ఎందుకనగా అట్టి సంభాషణ అత్యంత లాభకరమైనది. అట్టి సంభాషణయందు కడు మంచిజ్ఞానమును పొందవచ్చును. లోకవిషయములు వ్యర్థమనియు పరలోక

విషయములు లాభకరములనియు అట్టి సంభాషణల యందే తెలిసికొనవచ్చును. ఇవిసామాన్యలాభములు. ఇవి మాత్రమే గాక మరికొన్ని ప్రత్యేక లాభములు కూడ గలవు. అనగా నూతనజన్మ అవసరమనియు, మానవుని నీతికార్యములు వ్యర్థమనియు, క్రీస్తునీతి మన కగత్యమనియు అట్టి సంభాషణములందు తెలియ నగును. మరియు, పశ్చాత్తాపపడుట, విశ్వసించుట, ప్రార్థించుట, శ్రమపడుట మొదలగునవన్నియు మనకీ సంభాషణయందే అర్థమగును. సువార్తయందలి గొప్ప వాగ్దానములను గూర్చియు ఆదరణలను గూర్చియు కూడ నిట్టి సంభాషణద్వారా తెలిసికొని ఆదరణ పొందుదుము. మరియు తప్పుడుభావములను ఖండించుటకును, సత్యమును నిలువబెట్టుటకును, సిర్దోషుల నాదరించుటకును యీ సంభాషణలయందే మానవుడు నేర్చుకొనును.

విశ్వా:-ఇవియన్నియును సత్యమే. వీటిని నీవు చెప్పినకొలదిని నాకు ఆనందము కలుగుచున్నది.

వాచా:-అయ్యో, విశ్వాసముయొక్క అగత్యత నెందరో యెరుగకున్నారుగదా! తమ హృదయములందు నిత్య జీవము కలుగునట్లు పరిశుద్ధాత్మని కృపాకార్యము నెందరో అభిలషింప కున్నారుగదా! అందుచేతనే

అనేకుల కిట్టి సహవాస సంభాషణలు దొరకుటలేదు. అయితే అట్టివారు అజ్ఞానులై ధర్మశాస్త్ర కార్యములందు మాత్రమే జీవించుచున్నారు. ఆ ధర్మశాస్త్ర కార్యములు వారి నెన్నటికిని పరలోక రాజ్యమున జేర్చవు.

విశ్వా:-అవునుగాని, ఒకమాట చెప్పుటకు సెలవిమ్ము. వీటిని గూర్చిన జ్ఞానము దేవునివరమే గదా? మరియు అవి మానవ ప్రయత్నముచేతను కేవల తర్కముచేతను రావుగదా?

వాచా:-ఈసంగతి నాకు బాగుగా తెలియు; ఏమన పరలోకమునుండి యియ్యబడితేనే తప్ప మానవునికేదియు పొంద సాధ్యముగాదు. అంతయు కృపనుండి వచ్చునదేగాని క్రియలమూలమున వచ్చునది కాదు. ఈ విషయమును నిరూపించుటకు వందలాది వాక్యములను బైబిలునుండి చూపించగలను.

విశ్వా:-అవునుగాని, మనమిప్పు డేవిషయము నాధారముగా చేసికొని సంభాషించుచుంటిమి?

వాచా:-ఏవిషయమైన కానిమ్ము. నీ వేమనుకొనిన అది. పరలోక విషయములేమి, భూలోక విషయములేమి, నైతిక విషయములేమి, సువార్తనుగూర్చిన మాటలేమి, పరిశుద్ధమగున వైనను, అపవిత్రమైన వైనను

నేను మాటలాడలేని అంశమేలేదు. జరిగిపోయినవి కావచ్చును, ముందు జరుగనున్నవి కావచ్చును. మనకు పరిచితమైనవి గాని అపరిచితమైనవిగాని, అవసరమైనవి గాని, సమయానుచితమైనవి గాని ఏసంగతులనుగూర్చి యైనను నేను ధారాళముగా గంటలకొలది మాటలాడగలను. గాని అంతయు మనకు లాభకరముగా నుండవలెను.

## క్రైస్తవుడు వాచాలుని శీలమును కనిపెట్టుట

ఇంతవరకును క్రైస్తవుడు తనకు తానే ఒంటరిగా నడచుచుండెను. ఈ సమయమునకు విశ్వాసి కొద్దిగా క్రైస్తవుని ప్రక్కకునడచి నెమ్మదిగా నిట్లనెను. ఓయీ, మన కెంతటి ధైర్యవంతుడు మిత్రుడైనాడు. నిజముగా యాత్రికులలో అత్యుత్తమమైనవాడితడే సుమా! అందుకు క్రైస్తవుడు చిరునవ్వునవ్వి యిట్లనెను; నీ వితనితో నింత గాఢానురాగమున మునిగిపోతివే! ఇతడు నిజముగా తన నోటిమాట ద్వారా యిరువది మందినైన మోసగించగలడు. వాని సంగతి నీకు తెలియదు.

విశ్వా :- అయితే, యితని నీ వెరుగుదువా?

క్రైస్త :- ఎరుగకేమి, అతని సంగతి యతనికన్న నాకే బాగుగా తెలియును.

విశ్వా :- అట్లయిన నితడెవరో యితని సంగతి కొంచెము చెప్పుము.

క్రైస్త :- ఇతనిపేరు వాచాలుడు. ఇతడు మన పట్టణము నందే నివసించువాడు. నీవతని నెరుగకుండుట నాకు చిత్రముగా నున్నది. అయినను మనపట్టణము చాల పెద్దదైనందున ఎవరెవరో తెలిసికొనుట కష్టమే.

విశ్వా :- ఇతని తండ్రి యెవరు ? ఇతని యిల్లెక్కడ ?

క్రైస్త :- ఇతడు మాటకారి అనువాని కుమారుడు. వదరుబోతుల దనబడు వీధిలో వీడు నివసించువాడు. అతని నీవెరుకుండుట ఆశ్చర్యమే. వాని నాలుక తీపియు, హృదయము నీచమును.

విశ్వా :- గాని యీ వాచాలుడు సుందరునివలె యున్నాడే!

క్రైస్త :- అతని నెరుగని వారట్లనే అనుకొందురు. ఎందుకనగా యెరుగని వారి మధ్య వీడు పెద్దమనిషియే. గాని పరిచయులమధ్య వీని సౌందర్యము చిల్లిగవ్వకు రాదు. నిజమున కితడు కురూపి. ఒక చిత్రకారుడు వ్రాసిన పటమువలె దూరమునుండి చూచిన నున్నగనే యుండును గాని సమీపించి పరిశీలించగా గీతలును చీలికలును బయట పడును.

విశ్వా:-ఆలాగునా? మొదట నీవు చిరునవ్వు నవ్వినందున హాస్యమునకే యిట్లనుచున్నా వనుకొంటిని,

క్రైస్త:-నవ్వు వచ్చినదిగాని హేళనగాగాని, యితరులను నిందించుటగాని నాభావము కాదు. నీవింకను గమనించి పంశీలించి వానినిగూర్చి స్వయముగా తెలిసికొనవచ్చును. ఎట్టి సహవాసమునకైన నెట్టి సంభాషణకైన వీడు తగినవాడు. నీతో నిప్పుడు మాటలాడుచున్నట్లే త్రాగుబోతుల మధ్యనైన మాటలాడగలడు. వాని నెత్తినెక్కిన మద్యము హెచ్చినకొలదిని వానినోట వచ్చు వాగుడు హెచ్చును. వాని హృదయమునందుగాని, ఇంటగాని, వాని సంభాషణలోగాని దైవభక్తి సున్న. వానినోరు అబద్ధముల గుంట- దానితో వాగుటయే వాని మతము.

విశ్వా:-అదియా సంగతి! అయినచో వీనిమాటలు విని మోసపోతినే!

క్రైస్త:-మోసముగా కేమియున్నది? వారు చెప్పుదురుగాని చేయరనియు, దేవునిరాజ్యము మాటలతో లేదుగాని అది దేవుని శక్తియనియు నీవు చదువలేదా? (మత్త 23 : 3; I కొరిం 4 : 20) ఇతడు ప్రార్థననుగూర్చియు పశ్చాత్తాపమును గూర్చియు, విశ్వాసమునుగూర్చియు నూతన జన్మమునుగూర్చియు మాటలాడును. మాటలేగాని వానికి వీటిఅనుభవము తెలియదు. నేను వాని యింటికిపోతిని. అనేకసారులు యింటను బయటను కూడ వీనిని చూచితిని. నేనిప్పుడు వానిగూర్చి చెప్పు

మాట సత్యము. నేతిబీరకాయలో నెయ్యిలేనట్లే వీని యింటను భక్తిలేదు. ఇతనియందు ప్రార్థనగాని, పాపముల విషయమైన పశ్చాత్తాపముగాని లేదు. వీనికన్న దైవభక్తియందు నోరులేని జంతువు వాసి. అతనికి తెలిసినవారందరిమధ్యను అతడు దేవుని నామమునకు దూషణయు, మరకయు, అవమానమునై యున్నాడు. (రోమా 2 : 24, 25) ఇతనిద్వారా ఆ పట్టణమున తన నివాసస్థానమునందు మంచిమాట చెప్పువాడొక్కడు లేడు. 'బయట భక్తుడు యింట పిశాచి' యని అతనిగూర్చి అతని నెరిగిన వారందరును చెప్పుదురు. అతని స్వంతవారే అతనిసంగతి గ్రహించియున్నారు. అతడు కేవలము అన్యాయస్థుడును కోపచిత్తుడునై నందున వానినౌకరులను మాటిమాటికి గసరుకొనుచు అన్యాయముగ ప్రవర్తించును. గనుక పాపము వారుమాటలాడ నోరు లేవదు. పనిచేయ కాళ్లాడవు. వీనితో వ్యవహారముచేయువా రితనికంటె వ్యవహారమున మ్లేచ్ఛులు మేలు- అని చెప్పుచుందురు. ఎందుకనగా మోసమునందును కుట్రయందును వారిని ఇరువదిరెట్లు మించినవాడు వీడు. ఇదియును చాలక వానికొడుకులకు సరిగా వాని యడుగుజాడలనే నేర్పుచున్నాడు. వానిలో నెవడైన కొంచెము మనస్సాక్షి ననుసరించి న్యాయముగా పోజూచినయెడల దానిని

వాచాలుడు పిరికితనమని చీదరించికొని వ్యర్థులనియు, మందబుద్ధు లనియు, నానాచీవాట్లు పెట్టును. ఇంతే గాదు, అట్టి సమయములందు వారికి తనపని నప్ప గింపడు, ఇతరులయొద్ద వారినిగూర్చి మెచ్చడు. నాకు తోచిన దేమనగా యీ వాచాలుడు తన దుష్టజీవి తముచేత అనేకమంది తప్పిపోయి పడునట్లు చేసినాడు. దేవుడేదో యొకరీతిగా వీని నడ్డగింపనియెడల మరెం దరి గొంపలో కూల్చకమానడు.

విశ్వా:–ఆహా, చెప్పుటయొకటి, చేయుట మరొకటి యని నేడుగదా తెలిసికొంటిని. ఇప్పటినుండియు నీ రెంటి కిని భేదమున్నదని జ్ఞాపక ముంచుకొందును.

క్రైస్త:–నిజముగా నవిరెండును వేరయినవే. శరీరాత్మల కెంత భేదమున్నదో మాటలకును చేతలకు నంత భేదము న్నది. ప్రాణములేని శరీరము మృతమేగదా! అట్లే క్రియలులేని పలుకులు వట్టిశవముతో సమానమే. భక్తికి జీవము క్రియలే. "దేవునియెదుట నిష్కళంక మును పవిత్రమునైన భక్తియేదనగా దిక్కులేని పిల్ల లను విధవరాండ్లను వారియిబ్బందిలో పరామర్శించు టయు ఇహలోకమాలిన్యము తన కంటకుండ కాపా డుకొనుటయునే" (యాకోబు 1 : 22–27) ఈసంగతి వాచాలునికి తెలియదు. నాలుగుమాటలు వినుట

చేతను నాలుగుమాటలు చెప్పుటచేతను మంచి క్రైస్తవజీవితము వచ్చునని వాడనుకొనును. అట్లను కొని వానియాత్మనే పాడుచేసుకొనుచున్నాడు. విసుట వట్టివిత్తనములు విత్తుటవంటిది మాత్రమే. జీవితము నందును హృదయము నందును ఫలము లున్నవని చూపుటకు కేవలము వ్యర్థప్రసంగములు చాలవు. మరియు తీర్పుదినమునందు తమతమ ఫలములనుబట్టి నరులు విమర్శింప బడుదురని మనము మరువగూడదు (మత్త 13 : 23) నీవు నమ్మితివాయని మాత్రమే ఆ నాడు మనల నడుగరు. మీరు వట్టిమాటలు చెప్పిన వారా లేక చెప్పినట్టు చేసినవారా- అని యడుగు దురు. అప్పుడు మన చేతలనుబట్టియే మనకు తీర్పు తీర్చబడును. లోకాంతము కోతకు పోల్చబడినది. (మత్త 13 : 30) అయితే కోతసమయమునందు పంటనుగూర్చియే గదా మనము తలంచుచుందుము. అనగా విశ్వాసములేకుండ మనక్రియలే మనలను రక్షించునని నాభావము కాదు. గాని యీ వాచాలునివలె వట్టిమాటలు చెప్పి ఊరకున్నయెడల ఆనాడీమాటలు మనలను రక్షింపనేరవని నీకర్థమగుటకే యిట్లు చెప్పుచున్నాను.

విశ్వా :- నిజమే. వీనిసహవాసమునందు ముందు నాకంత యాసక్తి లేదు. గాని యిప్పుడు వీనితో కేవలము తల

నొప్పిగానున్నది. ఏనినుండి తప్పించుకొనుట యెట్లు ?

క్రైస్త :- నేనొక్క యుపాయము చెప్పెదనట్లు చేయుము. ఆ పని చేసితివేని నీకంటె ముందు వానికే యీ సహవాసమున విరక్తిపుట్టును.

విశ్వా :- ఏమిచేయ మందువు ?

క్రైస్త :- ఏమియు చేయనక్కరలేదు – దైవభక్తి యెంతటి శక్తిగలదో ఆ విషయముపై ఆసక్తిగా వానితో నొక్క వాదము పెట్టుకొనుము. అప్పుడు వాని యింటను హృదయమందును, సంభావణలోనుఆభక్తి యేమైన కలదోలేదో చెప్పుమని యడుగుము.

## విశ్వాసికిని వాచాలునికి జరిగిన సంభాషణ.

అంతట విశ్వాసి రెండడుగులు ముందుకువైచి వాచాలుని కలిసికొని అతని నిట్లు పలుకరించెను.

విశ్వా :- మిత్రుడా, యేమి సుఖముగా నడచుచుంటివా ?

వాచా :- నీదయవలన చక్కగనే నడచుచున్నాను. ఈపాటికెంతయో సంభాషింపవలెనని నే ననుకొంటిని.

విశ్వా :- దానికేమి, మాట్లాడవచ్చును. నన్నేదియో ప్రశ్న యడుగుమని విడిచిపెట్టితివా గదా, నా ప్రశ్న యేద

నగా; మనుష్య హృదయము నందున్నపుడు దేవుని రక్షణశక్తి యెట్లు బయలు పడగలదు ?

వాచా:-అవును గాని, మన సంభాషణ వస్తువులశక్తినిగూర్చి నదై యుండవలెననుకొంటిని, అయితే నీవురక్షణశక్తికి దిగితివి. అయిననుకానిమ్ము. నీప్రశ్నకు జవాబుచెప్పెదను. క్లుప్తముగా చెప్పినయెడల నీ ప్రశ్నకు జవాబిది; మొట్టమొదటి దేమనగా మనుష్యహృదయము నందు దేవుని రక్షణశక్తి ప్రవేశించిన యెడల ఆహృదయమునందు పాపము విషయమై గొప్ప ఆందోళన బయలుదేరును. రెండవ దేమనగా...

విశ్వా :- ఆగుము. ఈ మొదటి విషయమును ముందు పరిశీలింతము. అనగా నట్టి హృదయము పాపమును అసహ్యించుకొనుటకు మొదలు బెట్టుననియా నీభావము?

వాచా :- అయితే ఆందోళన బైలుదేరుటయన్నను, అసహ్యించుకొన మొదలు బెట్టుటయన్నను బేధమేమున్నది ?

విశ్వా :- కావలసినంత బేధమున్నది. లోకాచారము ప్రకారము ఒకడు పాపము విషయమై ఆందోళనపడి గంతులు వేయవచ్చును. గాని దేవుడు పాపము విషయమై దయచేయు అసహ్యత కలిగిననే గాని దానిని విసర్జించలేదు. కొందరు ప్రసంగ పీఠములమీాద నిలిచి

పాపము విషయమై కేకలువేసి ఆందోళన చేయుట నేను చూచితిని గాని వారి హృదయమునందును, సంభాషణ యందును వారి గృహముల యందును దానిని దాచి పెట్టియే యుంతురు. (ఆది 39 : 15) యోసేపు యొక్క యజమానురాలు పెద్ద స్వరముతో కేకలు వేచినది, చాల పవిత్రురాలివలె నటించినది. అయినను ఆమె అతనితో పాపముచేయవలెనని కోరినది. తమ యొడిలోని బిడ్డమీద తల్లి కేకలు వేసినట్లు కొందరు పాపము మీద కేకలు వేయుదురు. తల్లి తమ బిడ్డను దుష్టురాలనియు అల్లరిదనియు కేకలు పెట్టిపెట్టి పిమ్మట దానిమీద బడి కౌగలించుటయు ముద్దు పెట్టుటయు చేసినట్టే వీరును పాపమునెడల కేకలు వేయుదురు గాని పిమ్మట దానిని ముద్దు బెట్టుకొందురు.

వాచా :- నన్నేదియో అడిగి మాటలలో పడగొట్ట జూచుచున్నట్లున్నావు. నాకిప్పుడర్థమైనది.

విశ్వా :- లేదులేదు. ఆ పని నాకు చేతకాదు. సంగతులు చక్కగా తేల్చుకొన గోరియున్నాను. మరి నీవు చెప్పదలచిన రెండవ విషయమేది? కృపాకార్యమును మన హృదయము నందెట్లు తెలిసికొనవచ్చును?

వాచా :- సువార్త మర్మముల యందు మహాజ్ఞానమును కలిగించుట రెండవది.

విశ్వా :- ఇదియును మొదటనే చెప్పియుండవలసినది. మొదటనైనను చివరనైనను ఇదియొక సరియగు గుర్తు కాదు. ఎందుకనగా సువార్త విషయములందు మర్మములు, మహామర్మములెన్ని తెలిసినను అది కృపా కార్యము మన హృదయమునందు జరుగుచున్నదని యర్థము కాదు. ఒకనికిజ్ఞానమంతయుకలిగినను వ్యర్థమే. అనగా జ్ఞానము చేత వాడు దేవుని బిడ్డ కాడు. (1కొరిం 13 : 2) 'మీకీ సంగతులన్నియు తెలియునా' అని యేసు ప్రభు వడిగినపుడు 'అవునని' శిష్యులు జవాబిచ్చిరి. అందుకు ప్రభువు 'వాటిని మీరు గైకొనిన యెడల మీరు ధన్యులు' అని చెప్పెను. తెలిసినందుకు వారు ధన్యులని చెప్పలేదు. గాని గైకొనుటయందు ధన్యతయున్నదని గదా ఆయన చెప్పినది! ఎందుకనగా ఎరిగియు చేయని వారెందరో గలరు. తన యజమానిచిత్తము నెరిగియుండియు దాని ప్రకారము చేయని సేవకుని గూర్చి నీవు వినలేదా? దేవదూతల జ్ఞానమంతయు ఒకనికి తెలిసియుండివచ్చును అయినను వాడు క్రీస్తుకు దూరముగానే యుండవచ్చును. గనుక కృపాకార్యమునకు నీవు చెప్పిన యీగురుతు సరికాదు. నిజము చెప్పినయెడల జ్ఞానమనునది వాచాలురకునుడంబములు చెప్పుకొనువారికి, పనికివచ్చునది.

గాని వినిన దానిని గైకొనుట యనునదే దేవుని కిష్ట మయినది. అనగా యెరుక లేనిదే హృదయము చక్క బడునని నావాదము కాదు. ఎందుకనగా దేవుని గూర్చిన జ్ఞానము లేనియెడల హృదయము శూన్య మైనదే. గనుక రెండురకములయిన జ్ఞానమున్నది. మొదటి రకమేదనగా కేవలము తర్కించుచు వస్తు విషయము నెరుగు జ్ఞానమొకటి, కృపావిశ్వాసము ప్రేమలతో కలసియుండు జ్ఞానము వేరొకటి. మొద టిది వ్యర్థమగు మాటలాడు వారికి పనికివచ్చును. రెండవది నిజమైన క్రైస్తవునికి తృప్తినిచ్చును. 'నీ ధర్మశాస్త్రము ననుసరించుటకు నాకు బుద్ధిని దయచే యుము అప్పుడు నా పూర్ణహృదయముతో దాని ప్రకారము నడచుకొందును'. (కీర్త 119 : 34)

వాచా:- ఇక్కడ మరల మాటలలో తప్పుపట్ట జూచు చున్నావు. దీనివలన మనకు లాభములేదు.

విశ్వా:-మంచిది, నీకు చేతనయినయెడల మరొక గురుతు చెప్పి కృపాకార్యము నెరుగువిధమును వివరింపుము.

వాచా:-నేను చెప్పను. ఎందుకనగా మన కిద్దరకును మాట కుదురుటలేదు.

విశ్వా:-నీవు చెప్పలేనియెడల నన్ను చెప్పమందువా?

వాచా:-నీయిష్టము, చెప్పవచ్చును.

విశ్వా:-ఒకని హృదయమునందున్న దేవునికృప వానికిగాని తన పొరుగువానికి గాని బయలుపడుచుండును. వాని కెట్లనగా: అది పాపమువిషయమైన యెరుకను తాను అపవిత్రుడనను సంగతిని అతనికి తెలియజేయును. క్రీస్తుయేసుద్వారా దేవునియందు విశ్వసించి ఆ విశ్వాసమును విడిచిపెట్టిననే తప్ప తాను నాశనము కావలసినదేనని యతడు గ్రహించును. అంతట తన పాపములనుచూచి గ్రహించినపు డతనికి దుఃఖమును సిగ్గును కలుగును. (కీర్త 38 : 18; యిర్మి 31 : 19; యోహా 16 : 8; రోమా 7 : 24; మార్కు 16:16; గల 2 : 16; ప్రక 1 : 6) మరియు అట్టివిశ్వాసి తన హృదయమందు ప్రత్యక్షపరచబడిన లోకరక్షకుని కనుగొనును. ఆయనతో జీవితాంతము బంధింపబడవలయునని యతడు గ్రహించును. అందుచేత ఆయనయెడల అత డాకలిదప్పులు గలిగియుండును. ఆ యాకలిదప్పులు తీర్చుదునని దేవుడే వాగ్దానము చేసెను. గనుక ఆరక్షకునియం దతనికున్న విశ్వాసముయొక్క బలాబలములను బట్టి అతనియందు శాంతి సమాధానములును ఆనందమును, పరిశుద్ధ జీవితమునెడల ఆశయు, ఆయననింకను యెరుగవలయునను ఆసక్తియు నుండును. ఈరీతిగా కృప యతనికి

బయలుపడుచున్నను అది కృపాకార్యమని యతడు సాధారణముగా గ్రహింపడు. ఎందుకనగా అప్పు డప్పుడు అతని యపరాధములును అతని అల్పజ్ఞాన మును అతనిబుద్ధి కీవిషయమును మరుగుపరచును. గనుక ఈకార్యము ఎవని హృదయమునందున్నదో వాడు దీనిని కృపాకార్యమని గ్రహించుటకు ముందు చక్కని విమర్శనాశక్తి కావలయును.(యోహా 16:9; గలతీ 2 : 15, 16; అపొ. కార్య 4 : 12; మత్త 5:6; ప్రక 21 : 6)

ఇతరుల కీరీతిగా అది బయలు పడును. 1. క్రీస్తునందు విశ్వాసము నొప్పుకొనుట ఆచరించుట ద్వారాను. 2. ఆ విశ్వాసమునకు తగిన జీవితమును అనగా పరి శుద్ధ జీవితమును జీవించుట వలనను, అనగా హృదయ శుద్ధి, కుటుంబముగలవాడైన యెడల కుటుంబము నందు పవిత్రత, లోకములో సంభాషణ యందు పవిత్రతకూడ అవసరము. ఈ పరిశుద్ధ జీవి తమే లోకమును పాపమును ద్వేషించుట కతనికి నేర్పుచుండును. ఇంతేకాదు అంతరంగము నందట్టి వాడు తన్ను తానే యుపేక్షించుకొనెను. తన కుటుంబమునందు పాప జీవితము లేకుండ చూచు కొనును. లోకమునందెక్కడకు పోయినను పవిత్రతను

హెచ్చు జేయును. ఇదివట్టి మాటలచేతనే కాదు. ఈ వట్టి మాటలు వాచాలురకును వేషధారులకును తగియున్నవి. గాని విశ్వాసి ప్రేమతోను నమ్మకముతోను దైవ వాక్య శక్తికి దిన దినమును తన్ను తానప్పగించు కొనును. (యోబు. 42 : 5.6; కీర్త 50 : 23; యెహె 20 : 43; మత్త 5 : 8; యోహా 14 : 15; రోమా 10:9, 10; యెహె 36:25; ఫిలిప్పీ 1 : 27; 3 : 17). ఇది కృపాకార్యముయొక్క సంక్షిప్తమగు వర్ణన. దీనిని గూర్చియు, దీని తెలిసికొనుటను గూర్చియు నీ వేమైన అడ్డు చెప్ప దలచిన యెడల చెప్పుము. లేని యెడల నీకుమరొక ప్రశ్న వేయ వలయును. నాకు సెలవిమ్ము.

వాచా:- లేదు లేదు. ఇప్పుడు అడ్డుచెప్పుటకాదు గాని వినుటయే నా పని. గనుక నీవు నీ రెండవ ప్రశ్న అడుగ వచ్చును.

విశ్వా:- రెండవ ప్రశ్న యేమనగా: పైన చెప్పిన క్రీస్తు కృపను నీవనుభవించితివా? నీజీవితమును నీ సంభాషణయు దీనికి సాక్ష్యమిచ్చుచున్నవా ? లేక నీ భక్తి మాటలతోను భాషలతోనే యుండి క్రియా సత్యముల నెఱగకున్నదా ? ఈ ప్రశ్నకు జవాబియ్య దలచితివేని దేవుడు మెచ్చురీతిగా సత్యమునే పలుకుము.

నీ మనస్సాక్షిని బట్టి న్యాయమైన దానినే అబద్ధము లేకుండ చెప్పుము. ఎందుకనగా తన్ను తాను మెచ్చుకొనువాడు అంగీకరింపబడడుగాని ప్రభు వెవరిని మెచ్చుకొనునో వాడే అంగీకరింపబడును. మరియు నా ప్రవర్తనయు, నా పొరుగువారును నన్ను గూర్చి వేరగు సాక్ష్యమిచ్చుచుండగా నేనంతటివాడను, యింతటివాడను, అని చెప్పుకొనుట లాభములేని పని. అది గొప్ప పాపము.

ఈ మాటలు వినినప్పుడు వాచాలునికి మొదట సిగ్గు కలిగినది. గాని కొంత ధైర్యము చిక్కబట్టి అతడిట్లనెను. నీవిపుడు అనుభవమును గూర్చియు, మనసాక్షిని గూర్చియు దేవుని గూర్చియు మాటలాడుచున్నావు. మనము మాటలాడుకొనునదంతయు ఆయన కిష్టమై యుండవలెననుచున్నావు. ఇట్టి సంభాషణ నే నభిలషించలేను. ఇట్టి ప్రశ్నలకు నేను జవాబియ్యను యిష్టములేదు. ఎందుకనగా నేను నీకు జవాబిచ్చుటకు నాకు నీవు మతబోధకుడవా? ఒకవేళ నీవు మతబోధకువైన కావచ్చును. గాని నాకు మాత్రము బుద్ధిగరపుటకు నీకు వీలులేదు. ఇన్నిమాటలకేమిగాని, నీ వెందుకిట్లడిగితివో చెప్పెదవా ?

**విశ్వా**:- ఎందుకనగా నీవు పెక్కు డంబపు మాటలాడుట వింటిని. మరియు నీకు వీటినిగూర్చి అస్పష్టమైన తలం

ష్కలు మాత్రమే గాని అనుభవము లేదని గ్రహించి తిని. ఇంతేకాదు నేను నిన్ను గూర్చి వినిన దేమనగా ఊరకమాటలాడుట యే నీమతమట. నీప్రవర్తన మాత్రము నీమాటలకు భిన్నమయి యుండునట. నీవు క్రైస్తవుల కొక కళంకము వంటి వాడవనియు, దైవభక్తిలేని నీ మాటలవలన నీ మతము మరింత చెడుచున్నదనియు, వింటిని. నీదుష్టనడతలచేత ఇప్ప టికే చాల మంది భక్తినుండి జారిపడిపోయిరనియు, ఇంకను అనేకులు నీవలన తమ రక్షణ పోగొట్టుకొన వచ్చునని‌యు, చెప్పుకొనుచున్నారు. నీ మతమును కల్లుదుకాణమును, దురాశయు, అపవిత్రతయును, బూతులును, అబద్ధములును, వ్యర్థులతోడి సాంగత్య మును మొదలగున వన్నియు ఒకేజట్టుగ నీయందున్న వట. వేశ్యనుగూర్చిన సామెత నిజమే. ఏమనగా: అది స్త్రీలందరికిని అవమానకరముగా నున్నది. అట్లే నీవును మానవులందరికిని అవమానకరముగానున్నావు

వాచా:–నీవు చెప్పుడుమాటలు వినువానివలె నున్నావు. విని యింత కఠినముగ మాటలాడువాడవు గనుక నీవు పిరికివాడవును ముక్కోపియునని నాకు తోచుచున్నది. నీతో మాటలాడుట తగదు. ఇదే పోవుచున్నాను.

## వాచాలుడు వెడలిపోవుట

అంతట క్రైస్తవుడు విశ్వాసిని సమీపించి, సహోదరుడా, నేను చెప్పితినిగదా! నీమాటలతని యిచ్ఛలకు ములుకులవలె తగిలినవి. వాడు నీసాంగత్యము విడచుటకైన సమ్మతించెను గాని వానిజీవితమును మార్చుకొన నిశ్చయించలేదు గాని నేనుచెప్పినట్లే వాడు పారిపోయెను. పోనిమ్ము అది వానికే నష్టముగాని మరెవరికినికాదు. వానినుండి తొలగిపోవుట యెట్లని మనము బాధపడనక్కర లేకుండ వాడే పోయినాడు. వాడింకను మనతో నిలిచియుండినయెడల మన జట్టునకొక కళంకముగా నుండెడివాడు. (ఈపని చేయని యెడల వాడు మనతోనే పీడవలె వచ్చియుండును.) మరియు అట్టివారికి దూరముగా నుండుమని అపొస్తలుడు చెప్పుచున్నాడు.

విశ్వా:-గాని యింతమాత్రము వానితో మాటలాడినందుకు నాకు సంతోషముగా నున్నది. దీని గూర్చి యొకవేళ మరల నతడు యోచించుకొనవచ్చును. అది వానికి లాభము కలుగవచ్చును. ఏమైన నేమి, వానితో నిర్మొగమాటముగ మాటలాడితిని. అందుచేత వాడింకను అదే మార్గమందుండి నాశనమైనయెడల వానిరక్తము విషయమై నాకపరాధముండదు.

క్రైస్త:-అవును నీవతనితో నట్లు స్పష్టముగా మాటలాడుటయే మేలైనది. నేటికాలమందు జనులలో నిట్టి నిర్మొగ

మాటమైన వ్యవహారము లేనందుననే మతముకుల్లి కంపుకొట్టుచున్నది. ఎందుకనగా అట్టివారితనివలెనే మాటలప్రోగులును బుద్ధిహీనులును. వారి వాగుడే వారికి దేవుడు. వ్యర్థమైన దుష్టప్రసంగము లందున్న వారై దేవునిబిడ్డల సహవాసమునకు పోవుచున్నను లోకమును చిక్కులుపెట్టుచు క్రైస్తత్వమునే పాడు చేయుచున్నారు. అట్టివారు నిజమైన దైవభక్తులను చాల దుఃఖపరచుచున్నారు. నీవు మాటలాడినట్లే అట్టివారితో మాటలాడి వదిలించుకొనుట మేలు. అందరు నట్లుచేయవలెనని నేను కోరుచున్నాను. అట్లయినచో అట్టివాచాలురు సరియైనదారికి వచ్చిన వత్తురు లేనియెడల పరిశుద్ధుల సహవాసమునకువచ్చి వారిని చెడగొట్టుటయైనను మానుకొందురు.

వదరుబోతు మొదట నెంత గర్వమొందును
మదిమెండి ధైర్యముంచి మాటలాడును
సర్వమతని జ్ఞానమనుచు సంతసించును
ఎదుటివారు మూఢులంచు నెంచుచుండును.
గాని వీని డంబమంత లేనిపోనిదే
పెద్దపెద్ద మాటలన్ని పేలవంబులే.
హృదయమందు మార్పుగూర్చి మొదలు బెట్టినన్
వదలుకొనును, వదరుబోతు మాటలాడడు

మనసు మార్పునెరుగనట్టి మందుడగుటచే
చందమామ జారినట్లు సన్నసన్నగ
జారిపోయి లోకముడిచి దారినీయును.

ఇట్లు క్రైస్తవుడును విశ్వాసియు దారిప్రక్కను చూపిన దృశ్యములను గూర్చి మాటలాడుకొనుచు, ప్రొద్దుబుచ్చుచు నడచిపోసాగిరి. లేనియెడల వారిమార్గము ఆయాసకరముగా నుండెడిదే. ఎందుకనగా యిప్పుడు వారు అరణ్యమార్గమున బడిరి.

# సువార్తికుడు యాత్రికులను కలిసికొనుట.

అంతట వారు అరణ్యమును దాటిపోగా విశ్వాసి వెనుకకు తిరిగి చూచి మార్గమున తనకు పరిచయు డొకడు వచ్చుచుండుట చూచెను. అదిగో ఆ వచ్చునాతడెవరో మన మెరిగిన వానివలెనే యున్నాడే! అని విశ్వాసి క్రైస్తవునితో అనెను. అందుకు క్రైసవుడటు చూచి- ఇతడు మన స్నేహితుడు సువార్తికుడే సుమా! యనెను. ఇంతలో సువార్తికుడు వారిని సమీపించి యిట్లు పలుకరించెను.

సువా:-ప్రియులారా మీకు సమాధాన ముండును గాక.

క్రైస్త:-మిత్రుడా! సువార్తికుడా, మీరు వచ్చుట నాకానందమైనది. నిన్ను చూచినపుడు మున్ను నాకొర

కును నానిత్య క్షేమము కొరకును నీవు చూపిన దయయు, నీవుపడిన శ్రమయు జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

విశ్వా:—ఓ మధురమగు సువార్తికుడా ! నీవు వచ్చుటమాకు వేయి మడుగులు ఆనందమయినది. మాబోటి దీన యాత్రికులకు మీ సాంగత్యమెంత యగత్యము !

సువా:—మిత్రులారా ! మీ ప్రయాణ మెట్లున్నది ? మనము ముందు కలసికొని నప్పటినుండియు మీకు క్షేమమేనా ? మీరెవరిని కలిసికొంటిరి ? ఏయేరీతులుగా సంచరించితిరి ?

అంతట క్రైస్తవుడును విశ్వాసియు తమకు మార్గమధ్యమున సంభవించిన వన్నియు చెప్పిరి. అంతవరకును వారెంత కష్టముతో రాగలిగిరో సువార్తికుని కెరిగించిరి.

అంతట సువార్తికు డిట్లనెను; మంచిది. మీరు కష్టముల లోబడినందుకు కాదు—గాని జయముతో వెలువడినందుకే నాకానందముగా నున్నది. మీకెన్ని బలహీనతలున్నను నేటివరకు నీ మార్గము విడిచిపెట్టనందుకు కూడా నాకు సంతోషముగా నున్నది. ఈ విషయము నిజముగా నా కానందకరమే ! మిమ్మును బట్టియు నన్నుబట్టియు కూడ నేను నేడు సంతసించుచున్నాను. ఎందుకనగా నేను విత్తితిని, మీరు పంట కోసితిరి. ఒక దినము వచ్చుచున్నది అప్పుడు

విత్తువాడును కోయువాడును కలసి సంతోషింతురు. (యోహా 4 : 36) అసగా మీరు అలయక సాగుచుందురేని ఒక వాగ్దానమున్నది. మనము అలయక మేలు చేసితిమేని తగిన కాలమందు పంట కోయుదుము. (గలతీ 6 : 9) మీయెదుట యిక నిత్య జీవ కిరీటమున్నది. అది వాడబారని కిరీటము. గనుక దానిని పొందుటకు పరుగెత్తుడి. (I కొరిం 9 : 24 – 27) అనేకులు దీనికొరకు పరుగెత్తుదురు గాని కొంతదూరము సాగిన వెనుక వారు జారిపోగా యితరులు వచ్చి వారియొద్దనుండి దానిని తీసికొందురు. గనుక యెవడును మీ జీవ కిరీటమును తీసికొనకుండ జాగ్రత పడుడి. (ప్రక 3 : 11.) మీరింకను దుష్టుని బాణముల బారినుండి దాటిరాలేదు. పాపమున కెదురుపోరాడి రక్తముకారునంతగా మీరింకను యెదిరించలేదు. పరలోక రాజ్యమును మీ ఎదుట నెల్లప్పుడును పెట్టుకొని అదృశ్యమైన వాటిమీదనే ఎల్లప్పుడును మనస్సు నుంచుడి. యీలోక సంబంధమైన దేనియందైనను మీ మనస్సు నుంచి మోసపోకుడి. అన్నిటికంటె ముఖ్యముగా మీ హృదయములను శరీరేచ్ఛలను జాగ్రత్తగా పరీక్షించుకొనుడి. ఎందుకనగా హృదయము మోసకరమైనది. అది కేవలము పాపముతో నిండినది. మీ ముఖములను ప్రకాశింపనీయుడి ఎందుకనగా పరలోకమందు భూలోకమందును మీకు సర్వాధికారమియ్యబడి యున్నది.

అంతట క్రైస్తవుడీ హెచ్చరిక కొరకు సువార్తికుని కొనియాడెను. మరియు నికముందు తాము చేయవలసిన ప్రయాణము నందవసరమగు సలహాలను గూర్చి మాటలాడుమని అతడు సువార్తికుని కోరెను. అనగా నతడొక ప్రవక్త గనుక మార్గమందు వారికి సంభవింపబోవు విషయములు చెప్పగలడనియు, వాటిని జయించుటకును, అడ్డుకొనుటకును ఉపాయము చెప్పుమనియు వారు సువార్తికుని కోరిరి. అంతట సువార్తికు డిట్లు చెప్పసాగెను.

బిడ్డలారా! యెంతో శ్రమపడి దేవునిరాజ్యమును ప్రవేశింపవలెనని మీరు సువార్త వాక్యమునందు విన్నారు గదా! మరియు మీకు ప్రతి పట్టణమునందును బంధకములును శ్రమలును విస్తరించుననికూడ వినియున్నారు గదా! గనుక ఏదో యొకరకముగా నిబంధకములును శ్రమలును లేకుండ మీప్రయాణమును సాగించలేరు. ఇప్పటికే యీ మాటల సత్యమును కొంత మీరు చూచియున్నారు. ఇక ముందును మరింత చూడనున్నారు. ఎందుకనగా మీరిప్పుడీ అరణ్యమును దాటితిరిగనుక త్వరలో మీకొక పట్టణము కానవచ్చును. అక్కడ మిమ్మును చంపవలెనని చాల శత్రువులు ప్రయత్నించుదురు. మీలో నొకడుగాని లేక యిద్దరును గాని మీరక్తమును చిందించి సాక్ష్యమియ్యవలసి యుండునని జ్ఞాపకముంచుకొనుడి. గాని మీరు మరణపర్యంతము నమ్మ

కముగా నుండుడి. అప్పుడు రాజు మీకు జీవకిరీటమునిచ్చును. అక్కడ చచ్చువాడు తన పొరుగువానికంటె ధన్యుడు. అయితే అతనిమరణము అన్యాయముగను అతనిశ్రమలు విస్తారముగ నుండును. అయినను భయములేదు. ఈ ధన్యత యెందుకనగా నతడు నిత్యజీవపురమును త్వరగా చేరుట మాత్రమేగాక మిగిలినవాడు తన మార్గమందు కాచుకొన వలసిన అనేక కష్టములనుండి యితడు తప్పించుకొనును. అయితే మీరా పట్టణమును సమీపించి నేను చెప్పినవన్నియు జరుగుట చూచినపుడు నన్ను జ్ఞాపకముచేసికొని ధైర్యము బూనుడి. విశ్వాసపాత్రుడగు సృష్టికర్తకువలె మీ హృదయములను దేవుని భద్రత కప్పగించుకొనుడి.

# మాయసంత

అంతట నేను నాస్వప్నమునందు చూడగా వారు అరణ్యమునుదాటి వారి యెదుటనున్న పట్టణము నొకదానిని చూచిరి. దాని పేరు మాయపురము. ఆ పట్టణమునందు మాయసంత అనునదొకటి జరుగుచుండును. అది సంవత్సరము పొడుగుననుండు సంత. దాని పేరు మాయసంత యెందుకనగా అదిజరుగు పట్టణము వ్యర్థమైనపట్టణము. (కీర్త 62:9) ఇంతేగాదు అక్కడకువచ్చు సరుకులును అమ్మబడునదంతయు

మాయయని బుద్ధిమంతులు చెప్పుదురు. (ప్రసంగి 9 : 8; 1 : 2-14; 2 : 11-17; యెషయా 40 : 17)

ఈ సంత క్రొత్తది కాదు. తరతరముల నుండియు నున్నదే. దాని పుట్టుకసంగతి కొంత వివరింతును. మన యిద్దరు యాత్రికులవలెనే అయిదువేల సంవత్సరముల క్రిందట కొందరు యాత్రికులు నిత్యజీవపురమునకు పోవుచుండిరి. ఈ యాత్రికులుపోవు జాడచూచి బయల్జెబూబు, అపొల్యోను, సేన అనువారు ముగ్గురును వారి యనుచరులును మార్గము నందే పట్టణముచు నిర్మించిరి. దీనియందొక సంతను నడుపుటకు పన్నాగము పన్నిరి. మాయసరకు లన్నియు అమ్మునట్లును సంవత్సరమంతయు నీ మాయసంత సాగునట్లును వారేర్పాట్లు చేసిరి.

ఇక్కడదొరకు సరకులు చాల రకములైనవి. ఇండ్లు, భూములు, వ్యాపారములు, స్థలములు, బిరుదులు, గౌరవములు, ఉన్నతస్థానములు, దేశములు, రాజ్యము, నేత్రాశలు, సుఖభోగములు, పలువిధ వినోదములు, వేశ్యలు, భార్యలు, భర్తలు, పిల్లలు, యజమానులు, బానిసలు, జన్మలు, బంధువులు, శరీరములు, ఆత్మలు, వెండిబంగారు వజ్రములు, విలువగలరాళ్లు అవియివి యననేల సమస్తము నిక్కడ అమ్మబడును. మరియు, ఈసంతయం దెల్లపుడును జూదములు, గారడీలు, పందెములు, ఆటలు, బుద్ధిహీనులు,

తుంటరులు, మోసగాండ్లు, మొదలగునదంతియు కనబడు చుండును. అనవసరముగా దొంగతనములు, నరహత్యలు, వ్యభిచారములు, అబద్ధసాక్ష్యములు దారుణముగా నిక్కడ కనబడుచుండును.

మరియు నింతకన్న చిన్నసంతలందు వలెనే దీనియందు వాటివాటి పేరులప్రకారము వీధులును వరసలు నున్నవి. ఆయా వీధులయం దాయాసరకుల అంగడులుండును. ఇందలి సరకులను ఆయాచోట్ల చక్కగాను త్వరగాను కొనవచ్చును. ఇప్పుడు తయా ప్రత్యేకపుసరుకులు అమ్ముటకు ఆంగ్లవీధి, ఫ్రెంచివీధి, ఇతలియవీధి, స్పెయినువీధి, జర్మనువీధి మొద లగు వీధులన్నియు గలవు. ఇతరసంతలలో నొకసరుకు మిగత వాటికన్న చవుకగనున్నట్లే యిక్కడ రోమనుసరుకు చాల చవుకగానున్నది. యింగ్లీషుసరుకును మిగత కొన్నిసరకులు మాత్రమే దానిలో పోటీచేయుచున్నవి.

పైన చెప్పినట్లుగా పరమపురికి పోవుదారి యీసంత గుండా నున్నది. పరమపురికి పోవలసినవా డెవడైనను లోక మును విడిచిపెట్టితేనే తప్ప యీ మాయసంతను తప్పించు కొనజాలడు. (I కొరిం 5 : 10) రారాజు తానే యీలోకము నందున్నపుడీ మాయసంతను దాటి తనపట్టణమునకు పోయి నాడు. ఆనా డీసంత మంచి ముమ్మరముగకూడ నున్నది. బయల్జెబూబు అనువాడు తనసరకు కొనుమని రారాజును

పిలిచియున్నాడు. ఈ పట్టణముగుండా తాను పోవునపుడతనికి నమస్కారము మాత్రము చేసినయెడల దీనికంతకును అధిపతిని చేయుదునని వాడు రారాజును భ్రమపెట్టినాడు. నిజమే వాడు ఈసంతకు ముఖ్యాధికారి. ఆయన అంత ముఖ్యమైన వాడు కాబట్టి బయల్జెబూబు ఆయనను వీధివీధికి త్రిప్పి రాజ్యములన్నిటిని చూపించి రారాజు వానిసరకులను కొన్నిటిని కొనునట్లు బోధించినాడు. గాని యీసరకులయెడల ఆయనకు మనస్సులేదు. గనుక ఒక్కపైసయైన వాటికొరకు ఖర్చుపెట్టకుండ రారాజు దాటిపోయినాడు. (మత్త 4:8–10; లూకా 4 : 5–8) గనుక యీసంత పురాతనమైనదియును చాల గొప్పదియునై యున్నది.

నేను చెప్పినట్టుగానే యాత్రికులిద్దరును ఆసంతగుండా పోవలసి వచ్చినది. వారు ఆసంతను ప్రవేశించగనే అక్కడ జనమంతయు, పట్టణమంతయును గందరగోళమైనది. దానికి చాల కారణములు గలవు.

(1) ఆ సంతయందున్న వారి దుస్తులవలె గాక వేరుగానున్న దుస్తులనీ యాత్రికులు ధరించి యుండిరి. గనుక ఆసంత యందలి ప్రజలు వారికేసి అదేపనిగా చూసిరి. కొందరు వారిని బుద్ధి హీనులనిరి. కొందరు వారిని పరదేశులనిరి. కొందరు వారిని వెర్రివారనిరి. (యోబు 12 : 4; 1 కొరిం 4 : 9)

(2) వారి వస్త్రులను చూచి ఆశ్చర్యపడినట్లే వారి మాటలను చూచి కూడ ఆసంతలోని వారు అబ్బురపడిరి. ఎందుకనగా వారేమి చెప్పుచునారో వారికి తెలియనేలేదు. వారుపరమ కానాను భాష మాటలాడిరి. గాని సంతయందలి వారు లోక భాషను మాటలాడిరి. గనుక ఆసంత మొదటి నుండి చివరవరకును వారు అనాగరికులవలె కనబడిరి. (I కొరిం 2 : 7, 8.)

(3) మరియు అక్కడి వర్తకులకు చాల విచిత్రము కలిగించినదేమనగా అక్కడి సరకులను గూర్చి యాత్రికులేమియు లెక్కచేయలేదు. వాటివైపు చూడనైనలేదు. వాటిని కొనుమని ఆవర్తకులో వారిని పిలిచినపుడు వారు తమ చెవులయందు వ్రేళ్లుంచుకొనిరి. 'వ్యర్థమైనవాటిని చూడకుండ నా కన్నులను త్రిప్పివేయుము'. అని అరచిరి ( కీర్తన 119 : 37 ) ఇట్లరచుచు వారుపైకి చూచుచు వారి వ్యాపారమును సాంగత్యమును పరలోకమందున్నదని వ్యక్తపరచిరి. ( ఫిలిప్పీ 3 : 20, 21 )

వారిని చూచి యొక అపహాసకుడు నవ్వుచువచ్చి మీరేమి కొందురని యడిగెను. వారతనివైపు కోపముగ జూచి మేము సత్యమును కొందుమని జవాబిచ్చిరి. ( సామె 23 : 23 ). దాని మీదట వారిని హాస్యముచేయుట కింకను అదను దొరికినది. కొందరువారిని అపహసించిరి కొందరు

వెక్కిరించిరి. మరికొందరు దూషించిరి. మరి కొందరు వారిని కొట్టుడి చంపుడి అని కేకలు వేసిరి. ఇంతలో గొప్ప అల్లరియై గందరగోళము బయలుదేరి సంతయంతయు గొల్లుగా మారినది. ఆసంత కధికారియగు వానికింతలో కబురుపోయినది. వాడు త్వరగా దిగివచ్చి వాని గాఢాను చరులను కొందరిని పిలిచి సంత అల్లరియైనందుకు ఈ యాత్రికులను విమర్శించుడని సెలవిచ్చెను.

## యాత్రికులు బంధింపబడి విమర్శింపబడుట.

అంతట నా యాత్రికులు విమర్శింపబడిరి. వారిని తీర్పు తీర్చకూర్చుండు వారు ఎక్కడనుండి వచ్చిరి. యెక్కడకు పోవుదురు, ఈ చిత్రవస్తులతో మీ రేల సంచరించుచున్నారు. అని యడుగ సాగిరి.

వారు తాము యాత్రికులమనియు, వారీలోకమునకు సంబంధించిన వారు కారనియు చెప్పిరి. వారుతమ స్వంతపట్టణమైన నూతన యెరూషముకు పోవుచున్నామనికూడ జవాబిచ్చిరి. (హెబ్రీ 11 : 13–16) తమనింతగా నిందించి హింసించుటకు ఆ పట్టణ ప్రజలకు గాని ఆవర్తకులకు గాని వారేమియు అపచారము చేయలేదని యాత్రికులు స్పష్టపరచిరి. ఒకడు మాత్రము వారేమికొందురని అడిగిరనియు, తమకు

సత్యము కావలెనని వారు చెప్పిరనియు వారు వివరించిరి. గాని ఆ విచారణకర్తలు వారి మాటలనమ్మక వారు పిచ్చి వారనియు, వెర్రివారనియు తలంచిరి. లేక వారు సంతనం తను అల్లరిపరచవచ్చిన ద్రోహులై యుండవచ్చునని నిర్ధారణ చేసిరి. అందుచేత వారా యాత్రికులను పట్టికొట్టి దుమ్ము పోసి సిగ్గుపరచి యినుప పంజరములలో పెట్టి సంతలోవచ్చు పోవువారు చూచునట్లు నిలబెట్టిరి.

# యినుప బంధకము లందున్న యాత్రికులు

అట్లు వారు కొంతతడవు పడియుండి మనుష్యుల హేళనకును, అసూయకును, కోపమునకును గురియైరి. ఆసంత యజమాని వారినింకను హేళనచేసి నవ్వసాగెను. గాని ఆ యాత్రికులు ఓర్పుగలవారై దూషించువారిని దూషించక దీవించిరి. చెడ్డమాటలకు మంచిమాటలతో జవాబిచ్చిరి. బాధించువారిని ప్రేమించిరి. గాని ఆసంతలోనే కొందరు కొద్దిగా బుద్ధిగలవారు మిగతవారిని వారించి వారినంతగా బాధించుట కూడదని కొంత బుద్ధిచెప్పిరి. అయితే వారింకను ముందుకంటె చెలరేగి ఆ బుద్ధిచెప్పినవారును బంధింపబడిన వారివలె బుద్ధిహీనులనియు వారితో కుట్రచేసిన ద్రోహులనియు పేర్లుబెట్టి వారినికూడ బంధింపవలెననిరి. అయితే ఆ

బుద్ధిమంతులు చెప్పినదేమనగా: దీనయాత్రికులు సుబుద్ధులు, వీరెవరికి నేహానియు చేయలేదుగదా! వీరికంటె బంధకముల కర్హులైన వారెందరో యీ సంతయందున్నారు. బంధకములే కాదు అగ్నికంబములకు కట్టిపెట్టినను వారికి పాపము లేదు. గాని యీవిద్వేషుల కీశిక్ష యేమియని గద్దించిరి. ఇట్లు రెండుపక్షములై వారిమధ్య వాగ్వాదము ముదిరినందున ఒండొరులను తన్నుకొనుటకును గుద్దుకొనుటకును మొదలు బెట్టిరి.

అంతట నా యిరువురుదీనులను తిరిగి న్యాయసభవారి యొద్దకు తెచ్చిరి. ఈ వెనుకజరిగిన గల్లంతుకు వారే కారకు లని ఆ యన్యాయపు న్యాయసభవారు తీర్పుచెప్పిరి. అందు చేత వారా యాత్రికులనుకొట్టి కాళ్లకు సంకెళ్ళనుతగిలించి ఆసంతయం దటునిటు త్రిప్పి బాధింపసాగిరి. ఈరీతిగా చేసిన యెడల వారిపక్షమున నెవడును మాట్లాడడనియు, వారిజట్టున కెవడును చేరడనియు వారిభావము. అయితే క్రైస్తవుడును విశ్వాసియు మరింతవివేకముతో ప్రవర్తించి వారికికలిగిన శ్రమను అవమానమును విధేయతతోను ఓరిమితోను సహిం చినందున ఆసంతయం దనేకులు తమపక్షమైరి. (గాని అట్ల యినవారికన్న వారివిరోధులు చాలరెట్లుగా నుండిరి.) దీని చేత ఆక్రూరులజట్టునకు మరింత కోపమువచ్చి వారిద్దరిని చంప వలెనని నిశ్చయించిరి. అందుచేత వారు జరిగించిన అపరాధ

ముసకును, సంతలోనివారిని రెండుపక్షములుగా విడగొట్టి నందుకును వారికి సంకెళ్లను బంధకములును చాలవుగాని మరణమే తగునని వారిని భయపెట్టిరి. అంతట వారి నినుప పంజరములందు మరలపెట్టి పిమ్మట చర్యజరుగువరకు నుంచిరి. అట్లు వారిని బంధించి వారికాళ్ళకు సంకెళ్లు తగిలించిరి.

అంతట వారు తమ ప్రియమిత్రుడగు సువార్తికుడు చెప్పినమాటలను తిరిగి జ్ఞాపకము చేసికొనిరి. వారికేమి జరుగునో సువార్తికుడు చెప్పెనుగనుక ఆమాటలయందు వారు మరింత ఆదరణపడి ఆనందించిరి. అందుకు వారిద్దరును యోచించుకొని మరణించుభాగ్యము వారిద్దరిలో నెవరికి వచ్చునాయని యోచించుకొనుచుండిరి. దానిని వారు కోరుకొనుచుండిరి.

హతసాక్షులగు భాగ్యముకొరకెవరిహృదయములందు వారు కోరుకొనుచుండిరి. కాని సర్వపరిపాలకుడగు వాని చిత్తమునకు తమ్మునుతాము అప్పగించుకొనుచు తమకు వేరగు స్థితి ఆయన చిత్తముచొప్పున దొరకువరకును తామున్న స్థితి యందే సంతృప్తిపడి యుండిరి.

# యాత్రికుల విచారణ.

అంతట వారి విచారణ కొరకొక ఉచిత సమయమును నియమించి వారికి మరణదండన విధించుటకు తీర్మా

నించిరి. ఆ సమయము వచ్చినపుడు వారిని ఆ శత్రువులు బైటికి తెచ్చి నిలిపిరి. ఆ న్యాయాధిపతి పేరు సత్కార్య విరోధి. వారిమీద మోపబడిన నేరమొక్కటియే, మాటలలో భేదముండవచ్చునుగాని సారాంశము మునుపటిదే. దాని సారాంశమిది.

వారు అచటి వర్తమునకు విరోధులు, దాని పాడుచేయువారు, ఆ పట్టణమునందు వారు పక్షములను రేపిరి. అత్యంత అపాయకరమగు తమ వాదమునకు కొందరిని త్రిప్పుకొనిరి. ఇది వారి రాజు నాజ్ఞకు విరోధమైన నేరము. ఇదియే వారిపైన నేరారోపణ.

అంతట విశ్వాసి యిట్లు జవాబు చెప్పసాగెను:—

నా ప్రభు సర్వమునకును పైవాడు. ఆయన కేదివిరోధమైనదో దానిమీదనే నాకు విరోధము. మరియు అల్లరి సంగతియూ, నేనేమియు అల్లరి రేపలేదు. ఎందుకనగా నేను సహజముగా శాంతి కాముకుడను. మా పక్షమున తిరిగిన వారిమాట యందురా, అట్లు తిరుగుట మా నిర్దోషత్వమును సత్యముచూచియే వారట్లు తిరిగిరిగాని వేరు కారణము వలన కాదు. ఇట్లు చేయుటచేత వారు దుర్మార్గమునుండి సన్మార్గమునకే వచ్చిరి. మరియు మీరు చెప్పుచిన్న రాజు బయెల్జెబూబనువాడు మా ప్రభువునకు విరోధి గనుక వానిని వాని సమస్త దూతలను నేను తృణీకరింతును.

అంతట వారి ప్రభువు పక్షమున ఖైదీయైన విశ్వాసి మీద నెవరైన నేరారోపణ చేయువారున్నచో వచ్చి సాక్ష మియ్య వచ్చునని ప్రకటించబడెను. అప్పుడు ముగ్గురు సాక్షులు ముందుకువచ్చిరి. వారు మత్సరుడు, మాయభక్తి, నక్కవినయమునను వారు. మీరీ ఖైదీ నెరుగుదురా?— వీనిగూర్చి మీ కేమి తెలియును. మనరాజు పక్షమున వీరి కెదురుగా మీరు చెప్పు సాక్ష్యమేది అని న్యాయాధిపతి వారి నడిగెను.

అంతట మత్సరుడు ముందుకువచ్చి యిట్లని సారాం శము నిచ్చెను: ప్రభూ వీని నేనెంతకాలమునుండియో యెరు గుదును. గౌరవనీయులగు శ్రీ కోర్టువారి యెదుట నేను ప్రమాణముచేసి చెప్పున దేమగా—ఇంతలో న్యాయాధి పతి:-ఆగుము. వీనిచేత కూడ ప్రమాణము చేయించనిమ్ము. అనెను. ఆ పని ముగిసిన వెనుక మత్సరు డిట్లు చెప్పెను:

మహాప్రభూ వీనికి చక్కని పేరున్నదే గాని మన దేశ స్థులలోకెల్ల మిక్కిలి దుర్మార్గుడు. వీనికి రాజన్నను ప్రభువ న్నను భయములేదు. ఈ దేశపు చట్టమన్నను న్యాయమ న్నను వీనికి లెక్కలేదు. వీనికిగల విచిత్రమగు రాజద్రోహ పుబోధలతో అనేకమందికి తన పక్షమునకు మళ్లించుకొని ఆబోధలను పరిశుద్ధ నియమములనియు, విశ్వాస సూత్రము లనియు పేరు పెట్టి పిలచుచున్నాడు. మరియు క్రైస్తవమత

మును మన దేశాచారములును పరస్పరము విరుద్ధమైనవ నియు వాటిరెండింటికిని పొత్తుపొసగనే పొసగదనియు వీడొక నాడు చెప్పుట నేను చెవులార వింటిని. ఇట్లు చెప్పుటచేత వీడు మన ఘనకార్యము లనన్నిటిని ఖండించుట మాత్రమే గాక వాటిని చేయు ఘనులగు మనల కూడ వీడు ఖండించు చున్నాడు.

న్యాయాధిపతి:–నీవింకను చెప్పవలసిన దేమైన యున్నదా?

మత్స:–ప్రభూ, మరింత చెప్పగలను గాని మీకు విసుగు పుట్టించ నిష్టములేదు. గాని అవసరమైనయెడలయితర బుద్ధి మంతులుకూడ సాక్ష్యమిచ్చిన పిదప వారు విడిచిన దేమైన యున్న యెడల దానిని పూర్తి చేయుటకు నా సాక్ష్యమును మరింత విపుల పరతును, అంత నాతడు ప్రక్కకు తొలగి నిలచెను.

అప్పుడు వారు మాయాభక్తి యనువానిని పిలచిరి. వారతనికి నేరస్థులనుచూపి తమరాజు పక్షమున వారిపై నేయే నేరారోపణ చేయగలవని యతనినడిగిరి. అప్పుడతడు దొంగ ప్రమాణముచేసి యిట్లనెను.

మాయా:–ప్రభూ వీనితో నాకెక్కువ పరిచయములేదు. వీని పరిచయమన్నను నాకసలు కిట్టదు. గాని ఒకటి మాత్రము నేనెరుగుదును. వీడొక చీడపురుగువంటి వాడు. ఈపట్టణమున మొన్న ఒకనాడు ఇతనితో

సంభాషించుచుండగా నాకీ సంగతి అర్థమైనది. ఆ సంభాషణయందు మనమతము మాయయని వీడు చెప్పెను. ఇట్టిదానిచేత మనము దేవుని నెన్నడును సంతోషపరచ లేమనివీడనెను. దీనిసారాంశమేమియో ప్రభువులగు మీకు నేను చెప్పనక్కరలేదు. మన పూజలు వ్యర్థమైనవనియు, మనమింకను మనపాపము లందే యుంటిమనియు చివరకు మన మందరమును నాశనము పొందుదుమనియు. వీనిభావము. ఇదియే నేను చెప్పదలచిన సాక్ష్యము.

అంతట నక్కవినయమను వానిచేత ప్రమాణము చేయించిరి. వాడీరీతిగా సాక్ష్యమిచ్చెను:

నక్క:-మహాప్రభూ, ఘనులగు కోర్టువారు నామాట వినవల యును. ఈనీచుని నేనెంతయో కాలమునుండి యెరుగుదును. వీడు చెప్పరానిమాటలు చెప్పుట వింటిని. అనగా వీడు మన మహాప్రభువగు బయల్జెబూబున కెదురుగా మాటలాడెను. గౌరవనీయులగు ఆయన మిత్రుల నితడు దూషించెను. గౌ॥ ప్రాచీన మూర్తి, గౌ॥ శరీరేచ్ఛ, గౌ॥ భోగవినూసుడు, గౌ॥ వృథాతిశయుడు,మన వృద్ధమూర్తియైన గౌ॥ కామాతురుడు, ధనాపేక్షప్రభువు, యింకను మిగత మన ప్రధానులగు ఘనులను వీడు దూషించెను. మరియు వీడు చెప్పినదేమనగా- ఈపట్టణపు ప్రజలందరును

వానివంటి వారైనచో నీప్రభువులలో నొక్కని అధి
కారమాసం దుండనీయడట. మరియు ఆ ప్రభువునకు
న్యాయమూర్తిగా నియమింపబడిన మిమ్ములనుకూడ
వీడు దూషించుటకు భయపడలేదు, స్వామీ! మిమ్ము
లను భక్తిహీనపు పాషండుడనియు మరేమేమో పేర్లు
పెట్టినాడు. ఇట్టి పేరులతోను తిట్లతోను మన పట్ట
ణపు ప్రభువులనందరిని వీడు దూషించి నిందించినాడు.

నక్కవినయమను వాడీమాటలు చెప్పి ముగించినతరు
వాత న్యాయమూర్తి నిలిచియున్న బంధితునిజూచి యిట్ల
నెను.

న్యాయా:-దేశద్రిమ్మరీ, పెడవాదీ, దేశద్రోహీ, నీయెదుట
ఈ పెద్దమనుష్యులు చెప్పిన సాక్ష్యమును వింటివా?

విశ్వా:-నేను కొన్నిమాటలు చెప్పి సమర్థించుకొన వచ్చునా?

న్యాయా:-ఓరీ, నీవిక్కడ చచ్చుటకేగాని బ్రతుకుటకు తగిన
వాడవు గావు. అయినను లోకము మా మంచితన
మును మెచ్చునట్లు నీకు కొంత అవకాశమిత్తును.
చెప్పదలచినది చెప్పుకొనుము.

విశ్వా:-1. అట్లయిన మత్సరుడు పలికినమాటలకు జవాబుగా
నేను చెప్పునదేమనగా: ఏ నియమములైనను, చట్ట
ములైనను మనుష్యాచారములైనను దేవుని వాక్య
మునకు విరోధముగా నున్నయెడల అది క్రైస్తవ్యము

నకు కేవలము విరోధమైనవే. ఈమాట తప్పయిన యెడల కాదని నిరూపించుడి. ఇక్కడనే నేను నా సిద్ధాంతము నపుడు మార్చుకొందును.

2. మరియు మాయభక్తి చెప్పిన నేరారోపణకు జవాబుగా నేను చెప్పినదేమనగా: నేను చెప్పినమాట యొక్కటే; దేవుని నారాధించుటయందు పరలోక సంబంధమగు విశ్వాసమే ముఖ్యమని చెప్పితిని. గాని దేవునిచిత్తము బయలు పరచబడనియెడ విశ్వాసము సాధ్యముగాదు. గనుక దైవారాధనయందే దైవ చిత్తముకాని వేరేమి కలిపినను లాభములేదు. అది మనుష్యులవల నైనది. అది నిత్యజీవమున కెంత మాత్రమును పనికిరాదు.

3. మరి నక్కవినయము చెప్పినట్లు నే నీపట్టణపు ప్రభువును బూతులు మొదలయినవి తిట్టలేదుగాని ఒకటిమాత్ర మప్పుడుకాదు యిప్పుడును చెప్పుచు న్నాను. ఈ రాజునకెంత బలమున్నను, అనుచరులు అట్టహాసము గలిగినను అతడీ స్థలమునకు కాదుగాని నరకమునం దుండుటకే తగినవాడు. నామాట ముమ్మాటికిని సత్యము. దేవుడు నన్ను కరుణించునుగాక.

మాధానము యనువారు వీరందరును ఒక్కొక్కరు తమలో తాము నేరస్థుడు దోషి యని అభిప్రాయమిచ్చిన తరువాత వారందరును నేరస్థుడని యతని గూర్చి తీర్పు చెప్పుటకు తీర్మానించిరి.

వారిట్లు తీర్పు చెప్పిన పిమ్మట అతనిని తిరిగివచ్చిన చోటికి తీసుకొని పోవుటకు అక్కడ ఇతనిని బహు క్రూర మైన చావు కప్పగించుటకు శిక్ష విధించిరి.

## విశ్వాసి హతసాక్షి యగుట.

అంతట వారు తమన్యాయచట్టముప్రకారము అతనికి జరిగించుటకు వెలుపలికి తీసికొనివచ్చిరి. మొదట యతనికొరడాలతో కొట్టి చేతులతో చరచిపిమ్మటకత్తులతో నతనిచర్మము చీరిరి. ఆమీదట రాళ్లతో నతని కొట్టిరి. మరియు బాకులముక్కులతో నతని పొడిచిరి. చివరగా నతనిని నడిబజారున పెట్టి కాల్చి బుగ్గి చేసిరి. ఇంతటితో విశ్వాసి కథ ముగిసినది.

అంతట నా స్వప్నమందు చూచినదేమనగా: అక్కడనున్న గుంపులకు వెనుక రథములును గుఱ్ఱములును విశ్వాసికై వేచియుండెను. ఆ విరోధిమూక లతని కాల్చివేసిన వెంటనే విశ్వాసి యా రథములో నెత్తబడి బూరల శబ్దముతో ఆకాశ మార్గమున నిత్య జీవపురమునకు దగ్గరదారిని పోయెను.

గాని క్రైస్తవునికైతే కొంత వ్యవధి దొరికినది. అతని నింకను ఖైదున బంధించియే యుంచిరి. గాని సర్వశక్తుని బలముచేత క్రైస్తవునికి విచిత్ర రీతిగా విముక్తి దొరికినందున అతడు తప్పించుకొని తన దారిని పోయెను. అతడు పోవుచుండగా నీ పాట పాడెను.

విజయము నొందిన - నిజమిత్రుడా విశ్వాసి
భజన చేయుచు నుందు - ప్రభునిపుడు
క్రూరులెల్లనిన్ను - ఘోరహింసబెట్ట
యోరిమి జూపిన - భూరి యోగ్యుడవీవు॥విజ॥
పాడుజనులు నిన్ను - ప్రాణము దీసిన
భయమేమి నీ వపుడే - బ్రతికితివి
మహిమ దేహమునొంది-మన స్వామిసన్నిధిని
పరమ సుఖంబునొంది-పాటలు పాడుము॥విజ॥

# నిరీక్షణచిత్తుడు క్రైస్తవుని కలసికొనుట

అప్పుడు నేను స్వప్నమునందు చూడగా క్రైస్తవు డొంటరిగా ప్రయాణము చేయలేదు. ఎందుకనగా నిరీక్షణ చిత్తుడను వాడొకడు అతనిని కలసికొనెను. క్రైస్తవుడును విశ్వాసియు ఆ మాయసంతయందు పడిన శ్రమలనుచూచి వాడు నిరీక్షణపొందినందున వానికా పేరువచ్చెను. అట్లు నిరీ

క్షణచిత్తుడు క్రైస్తవుని కలిసికొని సహోదర సహవాసమునం దుందునని యతనితో నిబంధన చేసికొనెను. ఈరీతిగా ఒకడు తన మరణముద్వారా సాక్ష్యమిచ్చుచు చనిపోయెను. మరి యొకడా మరణమునుండి నిరీక్షణపొంది లేచి క్రైస్తవునికి మరల సహవాసుడయ్యెను. మరియు నీతడు క్రైస్తవునికొక మాటచెప్పెను. ఏమనగా: ఆసంతయందింకననేకులు ముందు వెనుకలుగా బైలుదేరి వారి ననుసరించుటకు సిద్ధముగానే యున్నారట.

ఇట్లు వారిరువురును సంతదాటి నడచుచుండగా కొంత వడికి వారిముందు నడచుచున్న సమయానుసారి అనువాని నొకని కలిసికొని వానితో నిట్లనిరి.

ఓహో మిత్రుడా నీదేశమేది? నీప్రయాణ మెంతవరకు?

సమ:–అయ్యలారా, నేను మృదువాక్యమను పట్టణమునుండి వచ్చుచున్నాను. పరమపురికి పోవ బైలుదేరితిని. (ఇట్లనెనేగాని సమయానుసారి తనపేరును వారికి చెప్పలేదు)

క్రైస్త:–ఒహో నీది మృదువాక్యపురమా? అక్కడ మేలైన దేదైన యుండునా? (సామె 26 : 25)

సమ:–అవును; ఉండునని యే నే ననుకొనుచున్నాను.

క్రైస్త:–అయితే, అయ్యా, నీపేరేమి?

సమ:–నేను మీకు క్రొత్తవాడను, మీరునాకు క్రొత్తవారు. మీరును యీమార్గముననే పోవుచున్నట్టయిన మీ

సహవాసము నాకెంతయో ఆనందమిచ్చును, లేని యెడల నేను తృప్తిపడిపోవలసినదే; ఏమి చేయను?

# సమయానుసారితో సంభాషణ

క్రైస్త:-ఈ మృదువాక్యపురమును గూర్చి నేను వినియేయుంటిని. అది చాల ధనసమృద్ధిగల పట్టణమట నిజమేనా?

సమ:-అవును. తప్పక ధనసమృద్ధిగల స్థలమే. మా బంధువులలోనే అనేకులు లక్షాధికారులున్నారు.

క్రైస్త:-మీరేమియు అనుకొననిచో నొక్కప్రశ్న యడుగుదును. మీ బంధువులెవరు?

సమ:-ఇంచుమించు ఆ పట్టణమంతయు మాకు కావలసినవారే. గాని ముఖ్యముగా నీక్రిందివారిని చెప్పవచ్చును. ఎవరనగా- తిరుగునాథము, సమయాలోచన స్వామి, మృదువాక్యనాథము, ఇతని పూర్వికులను బట్టియే మా పట్టణమునకు మృదువాక్యపురమను పేరు వచ్చినది. మరియు మృదువాదిగారును ఉభయాభిముఖ చంచలరావుగారును, తమచిత్తము గారును, మా పాదిరియైన ద్విజిహ్వాయ్యగారును మా బంధువులు. ద్విజిహ్వాయ్యగారు మాతల్లి సోదరుడు. తండ్రివంకను చూచినయెడల వాస్తవముగా మేము సాంప్రదా

యము గలవారమే. అయినను మాముత్తాత ఈ ప్రక్కకుచూచుచు ఆప్రక్కకు పడవనడపు పడవవాడే. నేనుకూడ యీవృత్తిచేతనే నాఆస్తిని చాల మట్టుకు సమకూర్చితిని.

క్రైస్తు:-నీకు పెండ్లియైనదా?

**సమ:-** అయినది. నాభార్య మంచి సుగుణవంతురాలు. ఆమె తల్లికూడ సుగుణవంతురాలే. ఆమె శ్రీమతి వేషాయమ్మగారి కుమార్తె. మరియు ఆమె పెంపకముచేత నాభార్య మంచి నవనాగరికత గలదై రాజునుండి బానిసవరకు నెవరితో నెట్లు మెలగవలెనో నేర్చినదై యున్నది. ఒక సంగతిమాత్రము నిజమే. యేమనగా మామత మితరుల మతముకన్న కొంచెము భిన్నమైనది. రెండు విషయములందు భేదమున్నది. మొదటిదేమనగా నలుగురితోపాటు నేనును అని మేము సరిపెట్టుకొందుమే గాని గాలికెదురు యెగురము, నీటికెదురు యీదము. రెండవదేమనగా మతమనునది సకలశోభాయమానమై మూడుకాయలును, ఆరు పిందెలుగా నుండి జలతారుజోళ్లు తొడిగి వీధులవెంట పోవునపుడు మేమును మతముతో రాచుకొనియే తిరుగుదుము. కాలముబాగుండి సూర్యుడు ప్రకాశించి ప్రజలు కీర్తించితే మతముమాకును యిష్టమేయగును.

ఇంతలో క్రైస్తవుడు తటాలున ప్రక్కకుజరిగి తన మిత్రుడగు నిరీక్షణచిత్తునితో నిట్లనెను: మిత్రుడా, వీనిమాటలనుబట్టి చూడ మృదువాక్యపురమునకు చెందిన సమయానుసారివలె నున్నాడు. వీడే వాడైన యిక మనప్రయాణమునం దొక దుర్మార్గుడు తగిలినాడన్నమాట. అందుకు నిరీక్షణచిత్తు డిట్లనెను: వాని పేరడుగుము. నిజనామము చెప్పుకొనుటకు సిగ్గుపడువా డుండురా?

అందుకు క్రైస్తవుడు యా క్రొత్తవానివైపు తిరిగి మాటలాడుచు నిట్లనెను: అయ్యా నీవు మాటలాడుట చూడగా లోకమునం దందరికంటెను నీకే యెక్కువ తెలియునని నీ వనుకొనుచున్నట్లున్నది. నీవెవరివో కొద్దిగా పసిగట్టియే యున్నాను. నా యోచన తప్పు గాదనుకొందును. నీపేరు మృదువాక్యపురమునకు చెందిన సమయానుసారిగదా?

సమ:-ఇది నా నిజమైనపేరు గాదుగాని కడుపుమంటచేత నాకు కొందరుపెట్టిన మారుపేరు. దానిని దూషణనామముగా నేను భరించుట తప్పినదికాదు. ఎందుకనగా మా పూర్వీకులలో ననేకులును మంచివారైనను తామీ బిరుదుచు భరించి సహించిరి.

క్రైస:-గాని యీ మారుపేరుతో నిన్ను జనులు పిలుచుట లేదా?

సమ:-ఎన్నడును పిలుచుటలేదు. నాకీ పేరెట్లు వచ్చినదనగా నేనొక్క పనిమాత్రము చేయుచుంటిని. సమయాను కూలమైనట్లు నా మనస్సు నిర్ధారణ చేసికొని అట్టి అదృష్టమని దూకుచుందును. అది యేదైనను దాని సమయాను కూలముగా వీలుచిక్కించుకొనుట నామ తము. అట్లు తిమంతతాము పనులు నాకు లభ్యమగు చున్నపుడది నాయదృష్టమే గదా ? ఇంతమాత్రము చేత అసూయపరులు నాకు పేరు లేల పెట్టవలెను?

క్రై స్త:-అవును నిజముగా నేను వినినది నిన్ను గూర్చియే. గాని నాయుద్దేశము నీకు చెప్పవలయున్నచో నీవెంతే కాదనుకొన్నను యీ పేరు నీకు కేవలము చక్కగా తగియున్నది. ఆమాట నీకు నచ్చక పోవచ్చును.

సమ:-సరియే, నీవట్లనుకొన్నచో నేను చేయునదేమియు లేదు. గాని నీవు సమ్మతించి నిలువ నిచ్చిన యెడల నీకు మంచి సహవాసముగా నుందును,

క్రై స్త:-గాని గాలికెదురు ఎగురుటయు, నీటికెదురీదుటయు నీకయిష్ట గదా నీవు మాతోనున్న యెడల నీకెం దును చేయవలసి వచ్చును. మరియు మా జట్టునున్న యెడలజలతారు పాదరక్షలతో సింగారించు కొన్నను, గుడ్డపేలికలతో చీదరగానున్నను మతమును విడువ రాదు. సంకెళ్లతో బంధింపబడినను, వీథులయందు గౌరవింపబడి యూరేగినను భక్తిని విడువరాదు;

సమ:—ఇదేమి మాట. నీ యిష్టము వచ్చినట్లెల్ల చేయుమని నా భక్తిని శాసించెదవా యేమి? నా యిష్టము వచ్చినట్లు నన్ను విడిచిపెట్టి మీ వెంట రానిందు.

క్రైస్త:—ఒక్క అడుగైనను రా వీలులేదు. నేను చెప్పినట్లు చేసెదవా సరి లేనిచో మానుకొనుము.

సమ—నా పురాతన నియమములను విడువనే విడువను. అవి లాభకరమైనవే, నిరపాయకరమైనవే. మీ వెంట నన్ను రానీయనియెడల నేనే పోవుదును. పిమ్మట నా సహవాసము నభిలషించు వాడెవడైన దొరకవచ్చును.

## సమయానుసారియు
## అతని ముగ్గురు మిత్రులును.

అంతట నా స్వప్నమునందు నేను చూడగా నిరీక్షణ చిత్తుడును క్రైస్తవుడును వానిని విడిచిపెట్టి ముందుకు సాగి పోయిరి. అట్లు పోవుచు వారిలో నొకడు వెనుకకు చూడగా సమయానుసారితో కూడ మరి ముగ్గురు మనుష్యు లగుపడిరి, వారతనిని సమీపించినపుడు సమయానుసారి నేలమట్టుకు వంగి వారికి నమస్కరించెను. వారును అతని యెడల నెనరుగ వందనము చేసిరి, ఆ ముగ్గురు మనుష్యుల పేరు లేవి యనగా: లోకపట్టయ్యగారు, ధన కామయ్యగారు

దాచ మదుగయ్యగారు వీరితో సమయానుసారికి పూర్వపరిచయముండెను, ఎట్లనగా వారి చిన్నతనము నందు వారందను బడిపిల్లలై యుండి పెద్ద పట్టయ్య గారి బడిలో చదువుకొనిరి. ప్రేమలాభపురములో నితడుపాధ్యాయుడు. అది ఉత్తర దేశమునందలి లోభమను తాలూకాలో నున్న సంతపురము. బలాత్కారముచేత నైనను, మోసము చేతనైనను, పొగడ్త చేతనైనను, అబద్ధములవలనైనను, మత వేషము ధరించుకొనుట వలనైనను లాభములను సంపాదించు నైపుణ్యము నియుపాధ్యాయుడు వారికి నేర్పెను. అందును యీ నలుగురు పెద్దమనుష్యులును గురువును మించిన శిష్యులైరి. వారినైపుణ్యముచేత ఒక్కొక్కరు మరి కొంతమందికి నేర్పగల యుపాధ్యాయులైరి.

సరి వారిట్లు ఒకరినొకరు నమస్కరించు కొన్నపిదప ధనకామయ్య గారతనితో నిట్లు సంభాషించెను.

ధన:-సమయానుసారీ రోడ్డుమీద మనముందుగా పోవుచున్న వారెవరు ? (క్రైస్తవుడును నిరీక్షణ చిత్తుడును యింకను కనబడుచునే యుండిరి).

సమ:-వారిద్దరు దూరదేశస్థులు. వారి చిత్తమున వారు యాత్రకు బైలుదేరి పోవుచున్నారు.

ధన:-అయ్యో వారు కొంచెమాగిన యెడల మన మందరము జతగా పోయి యుందుమే. ఎందుకనగా మేమును యాత్రకే పోవుచున్నాము. నీవునంతేగదా?

సమ:-ముమ్మాటికి నిజమే. మనమందరము నంతేగాని మన ముందు పోవుచున్నవారు విచిత్రవ్యక్తులు. వారుచాలా కఠిన నియమములను పాటింతురు. వారి స్వంత యభి ప్రాయములనే చాల ప్రీతిగా చూచుకొందురు గాని ఎదుటి వాడెంత భక్తుడైనను, వారితో గంతులు వేయని యెడల అట్టి వానిని తమ సహవాసము నుండి తోలివేతురు.

దాచమరుగయ్య:- ఇదేమి, ఎంత దారుణము! ఇట్టి వారినిగూర్చి యేమనము సాధారణముగా చదువు చుందుము. వీరి స్వనీతిపెచ్చు పెరిగిపోయి తాము తక్క యితరులందరిని తప్పులు పట్ట మొదలు బెట్టు దురు. ఇంతటిది వారి నిష్ఠ. వారికిని నీకును ఏయేవిష యములంభిప్రాయ బేధ మేర్పడినది? అవియెన్ని?

సమ:- అభిప్రాయ బేధమా? వీరు వీరి మొండి ధైర్యము చేత యే గాలి యందైనను ప్రయాణము సాగించ వలసినదే నందురు. అయితే నేను మాత్రము గాలి వాటమును ప్రవాహదిక్కును చూచుకొని మెలగు మంటిని. దేవుని కొరకొక్క యంగలో సమస్తమును సాధించవలెనని వారి మతము. నేనయితే మన ప్రాణమును, స్థానమును భద్రముచేసికొని మరి యడుగు పెట్టవలయు నంటిని. ఎవరేమి యను కొని

నను వారి సిద్ధాంతములను పట్టుకొని వేలాడుటయే వారి పని. నేనైతే కాలానుసారముగా పోయి మనకు కష్టము రాకుండ చూచుకొనవలయు నంటిని. వారు చింకిగుడ్డలలో నున్నను మతము పక్షమునందుందు రట. నేనైతే జలతారు పాదరక్షలతోను సూర్య తేజస్సులోనుండి గౌరవముపొందు చున్నప్పుడే మత పక్షమున నిలుతును.

లోకపట్టయ్య:—నీవది రే పట్టుమీద నుండవలయును. నుప్పు యానుసారీ, ఎందుకనగా లోకమునందు తనకున్నది తాను పట్టుకొని కూర్చుండుటకు స్వాతంత్ర్యమున్నను పట్టువదలి పెట్టువాడు జ్ఞానహీనుడని నా యుద్దేశము దీపముండగనే యిల్లు చక్కబెట్టుమని సామెత. మరియు తేనెటీగ చూచితివా, శీతకాలమంతయు నిద్రించి తనకు కాలమును కార్యమును అనుకూలిం చినపుడే బైలుదేరును. దేవుడొక్కసారి కుంభవర్ష మును ఒకొక్కసారి చక్కని వెలుగును పంపించు చుండును. వారికి బుద్ధిలేక వర్షమందు తడిసిన తడువ నిండు. మనమైతే మంచి వాతావరణము కొరకు వేచియుందుము. నామట్టుకు నాకు దేవుని దీవెనల నెల్లప్పుడు తెచ్చి సుఖమిచ్చి కాపాడుమతమే మతము. దేవుడు మనకిట్టి దీవెనలనిచ్చి యుండగా మనకు

సర్వసుఖముల నియ్యడను కొనువాడు బుద్ధిహీనుడే. అబ్రాహామును సొలోమోను రాజును మతాసక్తి చేత ధనికులు కాలేదా? మంచివాడు బుగ్గివలె సువర్ణమును విస్తారముగా కూర్చుకొనునని యోబు చెప్ప లేదా ? గాలి మన ముందు పోవు వారివలె ఒకడు బుద్ధిహీనుడైతే బంగారము నెట్లు కూర్చుకొనగలడు!

డాచ:-ఈ విషయము మన మందరమును సమ్మతించితిమి గనుక యిక మనకు వాదమక్కర లేదు.

ధన:- నిజమే దీనికిక వివాద మేల. తనకు తోచనైన తోచ వలెను. వేదమునందున్నదైన నమ్మవలెను. ఈ రెండును లేనివానికి హానిమేలు వానికి తెలియదు వాని క్షేమమే వాడెరుగడు. మనమైతే జ్ఞానమును యెరుగుదుము వేదమును యెరుగుదుము.

# సమయానుసారి తన స్నేహితులతో సంభాషించుట

సమ:-సహోదరులారా, మన మందరమును యాత్రకు పోవు చుంటిమని యెరుగుదుముగదా. అయితే చెడువిషయములు మాటలాడుకొనుట కంటె నాకొక మంచి సమస్య తోచుచున్నది. దానిని చెప్ప సెలవియ్యుడి.

ఒకపాదిరి, లేక యొకవర్తకుడున్నాడనుకొందము. అతని యెదుట గొప్ప యవకాశము అనగా నీలోక సౌఖ్యమొకటి గలదనుకొందము. ఈలాభము కలుగవలెనంటె వాడింతకుముందు చూపని మతాసక్తి వేషమునకైన చూపవలసి యుండును. ఇట్టి పరిస్థితులలో వాడిట్టి మతవేషము వేసినయెడల వాని ఆత్మస్థితి దెబ్బతినునా?

ధన:- నీప్రశ్నలోని అంతరార్థము నాకు చక్కగా బోధపడినది. ఈమిత్రుల సెలవైనయెడల దీనికి జవాబును తేటతెల్లముగా నొక్కచిటికెలో చెప్పగలను. మొదట నీప్రశ్ననే తిరిగి యెత్తికొందము. నీవుచెప్పినట్లు మతగురువు సంగతియే యెత్తికొందము. వానికి వచ్చురాబడి తక్కువ. వానికట్టెదుట మంచి లాభసాటియైన మాన్యమున్నది. దానిని సంపాదించుటకు మార్గముకూడ నున్నది. ఆలాభము కొరకు మరింత మతపరీక్ష చేయుట, మరిన్నిసార్లు ప్రసంగించుట ప్రజలను మెప్పించునట్లు మరింత ఆసక్తిని అభినయించి బోధించుట, వానిపద్ధతులు కొన్ని మార్చుకొని మంచివానిగా నగపడుట- వీటివలన తప్పులేదని నాయభిప్రాయము. ఇంతేగాదు యింకింత చేసినను తప్పులేదు. ఎందుకనగా,

1. పెద్దవాటి విషయమై అతనికున్న కోరిక న్యాయ సమ్మతమైనది. దానిని కాదనుటకు వీలులేదు. ఎందు కనగా అది దైవవశాత్తుగా కలిగిన అవకాశమే. గనుక వా డే ప్రయత్నముచేతనైన సంకోచించకుండ దానిని సంపాదించవలసినదే.

2. మరియు వాడుకోరిన యీ లాభమునుబట్టి వాడు మరింత కష్టపడు చున్నాడు. మరింత ఆసక్తిగల బోధ కుడగుచున్నాడు. అందువలన వానిస్థితి మంచిగా మారిపోవుచున్నది. అనగా తన శరీరమును సద్వి నియోగముచేసి మంచిగా మార్చుకొను చున్నాడు. ఇదియే దేవుని చిత్తము.

3. ప్రజలను మెప్పించుటకు కొన్ని మూలనమ్మకము లను వాడు విడిచిపెట్టినను తప్పులేదు. ఎందుకనగా (1) వాడు తన్నుతాను విసర్జించు కొనుచున్నాడు. (2) ఇతరులను మెప్పించుటకే ప్రయత్నించు గుణము సంపాదించుచున్నాడు. (3) ఈ కారణములచేత మత గురువున కుండవలసిన అర్హత అతనియందు మరింత హెచ్చుగు చున్నదిగదా.

4. నాచివరి వాదమేమనగా పెద్దదానికొరకు చిన్న దానిని విడిచిపెట్టిన మతగురువును గూర్చి మనము దురాశపరుడని చెప్పకూడదు. అయితే అతనికికలి

గిన అవకాశమును వినియోగించుకొనెను గనుక అతనికి కలిగిన పిలుపైనను అతనికివచ్చిన లౌకిక లాభమైనను ఒకటేయని అతడు లెక్కగట్టినాడు.

మరియు నీప్రశ్న రెండవభాగమందు వర్తకునిగూర్చి మాటలాడితివి. ఒకవేళ యొకనికి వర్తకము సరిగా సాగుటలేదు. అట్టి సమయమునందితరుల నాకర్షించుటకును, మంచిధనము సంపాదించుటకును, మంచి భార్యను పెండ్లాడుటకును ఒకవేళ కొంత మతవేషము వేసినయెడల తప్పులేదని నాయుద్దేశము. ఎందుకనగా: 1. ఎందుకు వచ్చిననేమి మతములోనికి వచ్చుటయే గొప్ప సుగుణము. 2. గొప్పస్త్రీని పెండ్లాడుట-మంచి ఖాతాదారులను దుకాణమునకు ఆకర్షించుకొనుట తప్పులేదు. మరియు మతవేషము ద్వారా యిట్టివాటిని సంపాదించువాడు మంచి దానిచేత మంచి వాటిని సంపాదించుకొను చున్నాడన్నమాట. అట్టివాడు మంచివాడుగాక చెడ్డవాడెట్లగును? గనుక వీటినన్నిటిని సంపాదించుటకు మతమును చేపట్టుట కేవలము న్యాయమే.

ఈరీతిగా సమయానుసారి యడిగినప్రశ్నకు ధనాపేక్షరావు జవాబియ్యగా వారందరును సంతోషించి యతనిని మెచ్చిరి. గనుక అది కేవలము మేలైనదియు, లాభకర

మైనదియు నని వారందరును ముందుగనే తీర్మానించిరి. వారికి తెలిసినంత మట్టుకు దీనికి కాదన్నవాడెవడును లేడుగనుకను, క్రైస్తవుడు నిరీక్షణచిత్తుడు ఇంకను కనుచూపునకు కనబడు చునే యుండిరి గనుకను వారిని సమీపించి వారికీప్రశ్న వేయవలయునని వారందరును నిశ్చయించిరి. దీనికి నొక కారణమున్నది. ఏమనగా వారింతకుముందు సమయానుసారి మాట కెదురు చెప్పినందున యీప్రశ్నతో వారిని పడగొట్ట దలచిరి. అంతట వారు క్రైస్తవుని నిరీక్షణచిత్తుని కేకబెట్టి పిలువగా వీరు వచ్చువరకును వారు మార్గమునందు నిలచిరి. గాని యింతకుముందు వారును సమయానుసారియు పడిన ఘర్షణ వారికి జ్ఞాపకముండును గనుక యీప్రశ్న సమ యానుసారిగాక లోకపట్టయ్య గారిచేత వేయించుటకు సంక ల్పించుకొనిరి.

అంతట వారందరును కలిసికొనినపుడు కొంచెము పర స్పరాభివందనము చేసికొని లోకపట్టయ్య తన ప్రశ్నను చల్లగా క్రైస్తవునికిని ఆతని యనుచరునికిని వెలిబుచ్చిరి. ఆపిమ్మట వారికి శక్తియున్నచో దానిజవాబు చెప్పుమని సవాలు చేసిరి.

# క్రైస్తవుడు లోకపట్టయ్యకు జవాబిచ్చుట.

అంతట క్రైస్తవు డిట్లు చెప్పసాగెను.

ఈలాటి ప్రశ్నల వెయ్యింటికైనను భక్తివిషయమున ముక్కుపచ్చలారని చంటిబిడ్డ జవాబు చెప్పగలడు. ఎందుకనగా రొట్టెముక్కల కొరకు క్రీస్తును వెంబడించుట అన్యాయమని చెప్పబడినదే! (యోహాను 6 : 26) అట్టి యెడల మతమునే లోకభోగములను తెచ్చికొనుటకు జూదముగా నుపయోగించుకొనుటట యెంత హేయము! ఇంతేకాదు; ఇట్టి ఉపాయమును వెదుకజూచువారు దేవుని ఎరుగనివారును వేషధారులును, దయ్యములును, మంత్రకత్తెలును అగుదురు గాని వేరొకటి కారు.

1. దేవునినెరుగనివారు :- హామోరు షెకెము అను వారు యాకోబు కుమార్తెలను, అతని పశువులను ఆశించిరి. వాటి ననుభవించవలెనన్న సున్నతిపొందుట తప్ప మరొక మార్గము లేదని గ్రహించిరి. అందుకు వారిలో వారిట్లను కొనిరి. మనలో మగవారందరును సున్నతి పొందిన యెడల ఇతని గోవులును ధనధాన్యమును కుమార్తెలును మనకు దొరుకునుగదా. వారాశించినది పశువులను కుమార్తెలను మాత్రమే. వీటిని సంపాదించుకొనుటకు మతావలంబన మను దానిని ''పాచిక''గా నుపయోగించినారు. ఆది. 34 : 20-24 లో దీని పూర్తి కథను చదివిచూడుడి.

2. వేషధారులైన పరిసయ్యులను గూర్చి వినుడి. దీర్ఘమైన ప్రార్థనలు వారు వంకబెట్టుకొని విధవల యిండ్లలో దూరుటకు వారు సాధించువారు. అయితే వారికి కలుగు తీర్పును గూర్చి కూడ వినుడి. దేవుని మహాయుగ్రతయే వారి తీర్పు. (లూకా 20 : 46, 47.)

3. దుష్టుడగు యూదా అను దయ్యముకూడ నిదేపని. చేసినాడు. సొమ్ముసంచి కొరకు మతాసక్తి నటించినాడు. అందులోనున్నదంతయు కాజేయుటయే వానిగురి. అయితే వాడు తప్పిపోయినాడు, త్రోసివేయబడినాడు-దుష్టుని క్షమారుహనబడినాడు.

4. మంత్రగాడగు సీమోనుకూడ యిదే మతము: ఎందుకనగా అద్భుతములు చేసి డబ్బు సంపాదించుటకై పరిశుద్ధాత్మను పొందగోరినాడు. అయితే అపో. 8 : 19-22 లో వివరింప బడినట్లు వాడు పేతురుచేత శపింపబడినాడు.

5. మరియొక్క విషయమున్నది. లోకము నాశించి మతమును చేపట్టువాడు ఎప్పుడోయొకప్పుడు మరల లోకము నాశించియే మతమునువిసరికొట్టును. ఎందుకనగాడబ్బునాశించి మతమును చేపట్టిన యూదా యేమిచేసినాడు? తిరిగి డబ్బు నాశించి యేమతమును విడిచిపెట్టినాడు, తన ప్రభువునుకూడ అమ్ముకున్నాడు. గనుక మీరు దీని వలన తప్పు లేదను కొనుచున్నారు. ఇట్లు తప్పు లేదని చెప్పుటయు, చెప్పినపుడు

వినుటయుకూడ దేవుని నెరుగక పోవుటయు, వేషధారణయు, దయ్యపు బుద్ధియు తప్ప వేరొకటి కాదు. మీరిట్లు నమ్మిన యెడల మీ క్రియలను బట్టి మీకు ఫలమేర్పడును.

ఈ మాటలు విని వారొకరి నొకరు చూచుకొనుచు నిలచి పోయిరి. గాని క్రైస్తవుని కెదురు చెప్పుటకు నోట మాటరాలేదు. క్రైస్తవుడు చెప్పిన మాటలు సత్యమని నిరీక్షణ చిత్తుడు కూడ బలపరచినందున వారిక మాటలాడలేక పోయిరి. చల్లచల్లగా సమయానుసారియు వాని యనుచరులును నడక తగ్గించి వెనుకకు జారిరి. అంతట క్రైస్తవుడు తన మిత్రునితో నిట్లనెను.

మనుష్యుల న్యాయతీర్పుకే వీరు నిలువ లేని యెడల దేవుని న్యాయతీర్పున కెట్లు నిలువగలరు? మంటి పాత్రలమైన మన యెదుటనే వీరి నోరులు మూతబడిన యెడల దహించు అగ్నిజ్వాలలు గద్దించు నపుడు వీరి పని యేమగును?

## బద్ధకమను మైదానమును
## ధననిధి యను కొండయును

క్రైస్తవుడును నిరీక్షణచిత్తుడును తిరిగి వారిని దాటి పోయిరి. అంత వారొక మైదానమునకు వచ్చిరి. దాని పేరు బద్ధకము. వారు దానిగుండా త్వరగా నడచి పోయిరి. అది

సన్నసై నందున త్వరలోనే దానిని దాటిపోయిరి. ఆ మైదానమున కవతలివైపున యొక చిన్న కొండగలదు. దాని పేరు ధన నిధి. అందులో వెండిగని గలదు. అంతకు ముందు యాత్రికులై ఆ మార్గమున వెళ్లువారు దానిని చూచి దగ్గరకు పోయి పరిశీలించుటకు దానివైపు వెళ్లుచుండిరి. గాని ఆ గని ద్వారమునకు సమీపించు సరికి అక్కడి నేల బహు మోస కరమైన దైనందున అది పగిలి వారిని మ్రింగివేయు చుండెడిది. అట్టివారు కొందరు కాళ్లుచేతులు విరిగిన వారై తమ జీవితాంతమును బాగుపడ లేకుండిరి.

## దేమా

మరియు నేను స్వప్నమునందు చూడగా మార్గమునకు కొంచెము ప్రక్కగా నా వెండిగనిదగ్గర పెద్దమనిషివలె యున్న దేమాయను వాడుండెను. వచ్చి చూడుడని వాడు యాత్రికుల నందరిని పిలుచుటకద్దు. వాడు క్రైస్తవుని, అతని స్నేహితుని చూచి యిట్లనిపిలచెను: ఓయీ యిటుతిరిగి రండి. మీకొక వింత చూపెదను.

క్రైస్త:-ఏమి! మమ్ములను మార్గమునుండి మళ్లించగల గొప్ప వింతయా? ఏమిటది?

దేమా:-ఇక్కడ గొప్ప వెండిగనియున్నది. కొందరు దానిని త్రవ్వుకొనుచున్నారు. మీరును వచ్చినయెడల శ్రమ

పడ నక్కర లేకుండ ధనికులు కావచ్చును.

అంతట "పోయి చూతమా" యని నిరీక్షణచిత్తు డనెను.

క్రైస్తు:-నేనుమాత్రము రాను. ఇంతకుముందెన్నిసారు లీస్థలమునుగూర్చి వింటిని. ఇక్కడ యెందరు తమ ప్రాణములను పోగొట్టుకొనిరో నేనెరుగుదును. మరియు దాని వెదకువారికి నిధి గొప్ప వలగానున్నది. ఎందుకనగా దీనిని సమీపించువారు తమయాత్రను కొనసాగించలేరు.

అంతట క్రైస్తవుడు దేమానుపిలిచి యిట్లనెను: ఓయీ, ఈస్థలము అపాయకరమైనది గదా? దీనివలన అనేకులు తమ యాత్రను విడిచిపెట్టుకొన లేదా? (హోషేయ 4 : 16-19).

దేమా:-ఏమంత గొప్ప అపాయము లేదు. జాగ్రత్తగా వచ్చిన భయములేదు. (ఈమాటలు చెప్పుచున్నను అతని ముఖమున లజ్జ కనబడుచునే యుండెను.)

క్రైస్తు:-మిత్రుడా, మనముమాత్రము మన మార్గమునువిడిచి ఒక్కయడుగు ప్రక్కకు వేయరాదు. నేను చెప్పుచున్నాను, సమయానుసారి యీ స్థలమునకు వచ్చుసరికి వానికిని యిట్టిపిలుపు వచ్చిన యెడల వాడు తప్పక పోవును.

క్రైస్తు:-దానికి సందేహము లేదు. ఎందుకనగా వాని పేరే సమయానుసారి. వానిమతమే ఏనాటికాయీమాట. గాని వాడిక్కడ చచ్చుటకూడ తప్పదు.

అంతట దేమా మరలపిలచెను: అయితే మీరువచ్చి చూడరా? దానికి క్రైస్తవుడిట్లు కఠినముగా జవాబిచ్చెను.

క్రైస్తు:-దేమా, ఈమార్గమున కధిపతియగు ప్రభువు మార్గములు సరియైనవి. నీవా ప్రభువునకు శత్రువుడవై యున్నావు. అయితే ఆమహోన్నతుని న్యాయమార్గములలో నొకరు నీకింతకుముందే శిక్ష విధించియున్నాడు. (II తిమోథి 4 : 10) మమ్మునుకూడ అట్టి శిక్షక్రింది కే లాగుటకెందుకు ప్రయత్నించెదవు? మరియు మేమిపుడు ప్రక్కకు మళ్లినయెడల మాప్రభునకది వెంటనే తెలియును. అప్పుడు మే మాయనయెదుట ధైర్యముతో నిలుచుటకు బదులు ఆయనముందు మేము సిగ్గుపడవలసి వచ్చును.

అందుకు దేమా వారిని మరల పిలచి తాను వారి బంధువుడేయనియు వారు కొంచె మాగినయెడల తానువచ్చి వారిని కలిసికొందుననియు కేకబెట్టెను.

క్రైస్తు:-నీపేరేమి, నేను పిలిచినట్టు దేమాకదా?

దేమా:-అవును నాపేరు దేమా. నేను అబ్రహాము కుమారుడను.

క్రైస్త:-అవును. నేను నిన్నెరుగుదును. గేహాజీ మీ ముత్తాతయే. యూదా నీతండ్రి. నీవు వారి యడుగుజాడలందు నడచినవాడవే. నీవు చేయుచున్న కుట్ర సాతాను సంబంధమైనది. నీతండ్రి రాజద్రోహమునకు ఉరితీయబడెను. నీకును అదియే తగియున్నది. (II రాజు 5 : 20-27; మత్త 26 : 14-15; 27 : 3-5) మేము రాజును సమీపించినపుడు నీ విషయమును చెప్పక మానము జాగ్రత్త.

అంతట వారు తమదారిని తాము పోయిరి. ఈలోపుగా సమయానుసారియు అతని స్నేహితులును దగ్గరకు సమీపించిరి. వారు మొదటిపిలుపునకే దేమాదగ్గరకు పోయిరి. అక్కడ వారు వెండిగని యంచునుండి జారిపడి నశించిరో, ధనమును త్రవ్వుచు నిలిచిపోయిరో, అప్పుడప్పుడు వచ్చు అగ్నిగంధకపు మంటలలోపడి చచ్చిరో నాకు తెలియదుగాని వారు మరెన్నడును ఆమార్గమునందు కనబడలేదు.

అప్పుడు క్రైస్తవుడీ పాటపాడెను.

సమయానుసారి కెంతో తగినశాస్తి యైనది
ఆశబోతు తనముచేత మోసమైనది
వెండికొండ దేమాకితని స్నేహమైనది
పిలిచినపుడు పలికిపోవ నిష్టమైనది
ధనముజూచి మనస్సు కొంత చలనమైనది
ఘనమునిచ్చు యాత్రయింక వట్టిదైనది.

# ఉప్పుస్థంభము

అంతట నేను చూచుచుండగా యీ మైదానమున కవతల యాత్రికులకొక పెద్దపాత విగ్రహము దారి ప్రక్కను కనబడుచుండును. దానిని చూచి యాత్రికులు చాల విచిత్ర పడుచుందురు. ఎందుకనగా అది విచిత్రమైన విగ్రహము. అనగా స్థంభమువలె మార్చబడిన యొక స్త్రీ ప్రతిమవలె నది కనబడుచుండును. ఇక్కడ యాత్రికులు నిలుచుండి అదే పనిగా దానిని చూచుచుండిరి గాని దాని భావమేమియో వారు కొంత సేపటివరకును గ్రహించలేకపోయిరి. తుదకు నిరీక్షణ చిత్తుడు చూచుచుండగా నా ప్రతిమ శిరస్సుమీద విచిత్రమగు వ్రాతయొకటి కనబడెను. నిరీక్షణచిత్తుడు విద్యావంతుడైనందున దాని యర్థమేమో తెలిసికొనవలెనని చూచెను. అతడు సమీపించి అక్షరములను కొద్దిగా పరీక్షించినపుడు 'లోతుభార్యను జ్ఞాపకముంచుకొనుడి'-అని వ్రాయబడి యుండెను. దీనిని నిరీక్షణ చిత్తుడు తన మిత్రునకు చదివి వినిపించెను. ఆపైన వారిద్దరును ఆ విగ్రహము లోతు భార్య మారిపోయిన ఉప్పుస్థంభమని గ్రహించిరి. సొదొమనుండి పారిపోవునపుడామె ధనాపేక్షచేత వెనుకకు చూచినపుడు ఉప్పుస్థంభముగా మారిపోయెను. (ఆది 19:26) ఈ విచిత్రమైన దృశ్యమును హఠాత్తుగా చూచినపుడు వారీ క్రింది సంభాషణను సాగించిరి.

క్రై స్త:-ఆహా మిత్రుడా, ఇది యొక ప్రాముఖ్యమగు దృశ్య ముగదా. ఘనపుకొండకు రమ్మని దేమా పిలిచినాడు ఆ పిమ్మటనే సమయానుకూలముగా మనకిది కనబడి నది. ఎందుకనగా మన మతనిమాట విని దారితప్ప వెళ్ళియుండిన యెడల మన వెనుక వచ్చిన వారికి హాస్యాస్పదముగ మనము మార్చబడి యుందుము సుమా.

నిరీ:- అయ్యో లోతు భార్యవలె నేనును నాశనమై యుం దునే. వాని మాట విని వెళ్లుదమని కొంచెము ఆశ పడినందుకు నా కిపుడెంతో దుఃఖముగా నున్నది. ఈమె పాపమునకును నాపాపమునకును బేధ మేమి గలదు ? ఆమె వెనుకకు మాత్రము చూచినది. నేనైతే ప్రక్కకుపోయి చూతమని తలంచితిని. దేవుని కృప వలన నేను తప్పించుకొంటిని. నా హృదయము నందిట్టి యోచన పుట్టినందుకు నేను సిగ్గుపడుదును గాక.

క్రై స్త:-మనముందు కాలమునకు మాదిరిగా నుండునట్లు మన మిక్కడ చూచినది గమనించెదముగాక. ఈ స్త్రీ సొదొమనుండి తప్పించబడినందున ఒక విమర్శను దాటినదిగాని ఉప్పు స్థంభముగా మారిపోయినందున మరియొక విమర్శలో పడిపోయినది. నాశనమైనది.

నిరీ:- నిజమే. ఈమెను చూచి మనము గుణపాఠమును హెచ్చరికను పొందవలసి యున్నది. హెచ్చరిక యెందుకనగా ఆమె పడిన పాపమును మనము భయపడి విసర్జించునట్లును అట్లు విసర్జించని యెడల మనకెట్టి తీర్పు కాచుకొనియున్నదో యెరుగునట్లును మనకిది సూచనగానున్నది. కోరాము, దాతాను, అబిరాముఅను వారును తమ రెండున్నర వందలమందితో కూడ తమ పాపమున బడి నశించి తమ వెనుక వారికి జాగ్రత్త కలుగునట్లు హెచ్చరికగా నైరి. (సంఖ్యా 16 : 31,32; 26 : 9,10.) అన్నిటి కంటె ముఖ్యముగా నాకొక సంగతి జ్ఞప్తికి వచ్చుచున్నది. అదేమనగా ఈ స్త్రీ ఆ ధనము కొరకు ఒక్క-అడుగు వెనుకకు వేయకపోయినను చూచినంత మాత్రముచేతనే ఉప్పుస్థంభ మైపోయినదే, మరి దేమాయును వానిస్నేహితులును ధనము కొరకునని అంతధైర్యముగా కాచుకొని యెట్లుండ గలుగుచున్నారాయని. మరియు ముఖ్యముగా నీస్త్రీకి కలిగిన విమర్శన వారికెదురుగా నిక్కడనే సాక్ష్యమిచ్చుచుండగా వారికి కండ్లు తెరువబడనేలేదు. వారి కన్నులు పైకెత్తినయెడల యీామె చక్కగా కనబడియే యుండును.

క్రైస్త:-ఇది నిజముగా చిత్రమైనసంగతియే. మరియు వారి హృదయములు కఠినమైపోయినవని దీనినిబట్టి మనకు తెలియుచున్నది. వీరినేమని పిలువవలయునో నాకు సరిగా తెలియుటలేదు గాని, రాజుగారి జేబుకే కన్నము వేయజూచిన దొంగలవలెను, మెడకు ఉరియుండగానే సంచులు కొట్టు కన్నగాండ్ల వలెను వీరున్నారు. యెహోవాయెదుట వారిపాపము విస్తారమై యుండె నని సొదొమ వారినిగూర్చి చెప్పబడినది. అనగా దేవుడు వారియెడల నెంతటి దయచూపినను వారు నిర్లక్ష్యముతో ఆయన దృష్టియెదుటనే పాపముచేసి రన్నమాట. ఎందుకనగా మొదట ఏదేనువనము న్నట్టే సొదొమపట్టణము దేవుని సన్నిధియందే గల దన్నమాట. (ఆది 13 : 10-13) దీనివలనే ఆయన మరింత రోషముగలవాడై ఆకాశమునుండి దహించు యగ్ని అను కోపాగ్నితో వారిని సంహరించెను. అట్లే వీరినిగూర్చికూడ చెప్పుట సరియైనదే: నేడు మన కండ్లముందిన్ని గుణపాఠములను దేవుడు చూపు చున్నను. వాటి హెచ్చరికను త్రోసివేసి సొదొమ ప్రజలవలె పాపము చేసినయెడల వారివలెనే నాశన మగుదుమనుటకు సందేహమున్నదా? ఇంతకంటెను అత్యంతమైన విమర్శన అట్టివారిమీదకు రాకుండునా?

నిరీ:-నిజమే, సత్యము చెప్పితివి. గాని నీవుగాని నేనుగాని అట్టి గురుతుగా చేయబడకుండుట దేవుని కృపయే గదా! దీనికై మనము దేవునికి స్తుతి చెల్లింపవలయును. మరియు దీనినెల్లపుడును జ్ఞాపకముంచుకొని లోతు భార్య చరిత్రనుబట్టి ఆయనకు భయపడుచుండవలయును.

# దేవునినది

నేనుచూచుచుండగావారిద్దరునుఒక చక్కనినదీతీరమునకు వచ్చిరి. దానినే దేవుని నదియని దావీదు పిలిచినాడు (కీర్త 65 : 9; ప్రక 22 : 1; యెహె 47 : 1-9) ఇప్పుడు వారి మార్గము ఈ నదీ తీరమునందే పోవుచుండెను. గనుక క్రైస్తవుడును అతని స్నేహితుడును బహు ఆనందముతో నడచుచుండిరి. వారా నదీజలమును కూడ పానము చేసిరి. ఆనీరు ప్రాణమునకు హాయిగను వారి ఆత్మలకు తేజోమయముగను ఉండెను. మరియు ఆనది కిరుప్రక్కలను బహు ఫలభరితములగు పచ్చని వృక్షము లుండెను. ప్రయాణముల చేత అలసిన వారికిని గాడ్పుదెబ్బ తినినవారికిని ఆవృక్షముల యాకులు స్వస్థత నిచ్చుచుండెను. మరియు ఆ నది కిరువైపులను చక్కని మైదానముండెను. అది సంవత్సరము పొడవునను పచ్చనైయుండి తెల్లకలువలతో నిండియుండెను.-ఇంద్ధు

పడుండుట క్షేమకరము గనుక యాత్రికులు స్థలమందు పడుండి హాయిగా నిద్రించిరి.(కీర్త 23 : 2; యెషయా 14 : 30) వారు మేల్కొనినప్పుడు తిరిగి ఆవృక్షముల ఫలములను సేకరించి భుజించి ఆ నదీజలమును త్రాగిరి. వారు సేద దీరి మరల నిద్రింప సాగిరి. ఇట్లు వారు పలుదివారాత్రములు గడిపి యీ క్రింది పాటను పాడిరి.

స్ఫటిక నదీ ప్రవాహమెంత చల్లనైనది !
యలసిన యాత్రికుల కెంత హాయి యైనది !
ఘుమఘుమ వాసనల బయలు కమ్మనైనది
ఘనతర ఫలవృక్షములకు స్థానమైనది
దీని రమ్యములను యెరుగు జ్ఞానవంతులగు
దేనినైన దీని కొరకు విడిచివత్తురు.

అంతట వారి ప్రయాణ మింకను తుదముట్టలేదు గనుక అచటి ఫలములను కడుపార తిని చల్లని నీటిని త్రాగి తమ యాత్రను మరల సాగించిరి.

## దొంగత్రోవ బీడు.

వారట్లు ప్రయాణమై పోవుచుండగా కొంతదూరము పోయిన వెనుక వారి మార్గము నదీతీరముననుండి చీలిపోయెను. అక్కడ వారెంతయో విచారించిరి. అయినను వారు

మార్గమును మాత్రము విడిచి పెట్టలేదు. అక్కడనుండి మార్గము చాలా కరకుగా నుండెను. దీర్ఘప్రయాణము చేత వారి పాదములు నొచ్చుచుండెను. ఆ మార్గముచేత యాత్రికుల ప్రాణము సొమ్మసిల్లు చుండెను. (సంఖ్యా 21 : 4.) గనుక వారు పోవుచుండగా మరేదైన సుఖమైన మార్గము దొరకవలెనని ఆశించిరి.

అంతవారి కెదురుగా అనతి దూరమున వారికెడమ వైపున నొక బీడు కనబడెను. దానిలోనికి పోవుటకు చిన్న మెట్లు కూడ కనబడెను. ఆ బయలుపేరు దొంగత్రోవ బీడు. అప్పుడు క్రైస్తవుడు తన సహచరునితో నిట్లనెను. ఈ బీడు మన మార్గమునకు ప్రక్కనే గలదు గనుక మనమిందులోనికి పోదము రమ్ము. ఈ మాట చెప్పి దానిని చూచుటకతడు మెట్లయొద్దకు వెళ్ళెను. ఆ మెట్లెక్కి చూడగా ఆ బీటికంచె కవతలివైపున ఒక మార్గమతనికి కనబడెను. అందుకు క్రైస్తవు డిట్లనెను.

క్రైస్త:-నేను చెప్పినట్లే మనకు దగ్గరదారి యొకటి కనబడు చున్నది. గనుక మిత్రమా, పోవుదము రమ్ము.

నిరీ:- అయితే యొకవేళ యీ దారి మనలను మోసపుచ్చునేమో!

క్రైస్త:-అట్లు తోచదు. ఎందుకనగా నిది రాజమార్గమునకు ప్రక్కగా పోవుచున్నది కదా!

ఇట్లు నిరీక్షణ చిత్తుడు క్రైస్తవుని యాలోచనకు సమ్మతించి మెట్లు దాటి ప్రక్కదారికి వెళ్ళెను. ఆమార్గమునందు వారు చూచినపుడు వారి పాదములకది హాయిగా నుండెను. వారు కన్నులెత్తి చూడగా నొకడా మార్గముననే నడచుచుండెను. వాని పేరు వ్యర్థ సాహసుడు. వారతని పిలిచి, ఆ త్రోవ యెక్కడకు నడుపునని వానినడిగిరి. నిత్యజీవ పురము ద్వారము దగ్గరకు నడుపునని వాడు సాహసముగా చెప్పివేసెను.

ఇదిగో, నేను చెప్పలేదా, మనము సరియైన దారినే యుంటిమి—అని క్రైస్తవుడనెను. గనుక వ్యర్థ సాహసుడు ముందు నడచు చుండగా వీరతనితని వెంబడి పోవుచుండిరి. అయితే అంతలో రాత్రి యాయెను. కారు చీకటులు కప్పెను. గనుక వెనుకనున్నవారు ముందు పోవు వానిని చూడ లేకుండిరి. గనుక ఆ చీకటిని పోవు చుండగా వ్యర్థ సాహసు డొక లోతైన గుంటలో పడెను. ఇట్టి వృథాతిశయులను పట్టుటకు ఆ పొలము యజమానుడు త్రవ్వించిన మచ్చుగుంట యది. అందు పడుట తోడనే వ్యర్థ సాహసుని తల పగిలి చచ్చెను. (యెషయా 9 : 16.) వీడు పడిన శబ్దమును విని వెనుక వచ్చుచున్న క్రైస్తవుడును నిరీక్షణాచిత్తుడును భయపడి "అదేమ"ని కేకబెట్టిరి గాని వారికి మారు పలుకు వాడెవడును లేకుండెను. వారికి మూల్గులు మాత్రము విన

బడెను. అంతట నిరీక్షణుడు తెలివి తెచ్చుకొని, మన మిప్పు డెక్కడ ఉన్నాము—అని ప్రశ్నించెను. క్రైస్తవుని నోట మాట రాలేదు. నేను దారి తప్పించితినా—యని క్రైస్తవుడు తర్కించుకొనుచుండెను. ఇంతలో గొప్ప వర్ష మారంభమాయెను. ఉరుములను మెరుపులును ఆకాశమును పగుల గొట్టుచున్నట్టుండెను. నీరు పైకి లేచుచుండెను. అంత నిరీక్షణ చిత్తుడు నిట్టూర్పులు విడచుచు నా మార్గము నెందుకు విడిచి పెట్టితినా యని దుఃఖించు చుండెను.

క్రైస్త:-అయ్యో, ఈ మార్గము మనలను మోసపుచ్చునని యెవడెరుగును ?

నిరీ:-నాకు మొదటనే భయమైనది. అందుచేతనే నీకు నెమ్మదిగా నా సలహా నిచ్చితిని. నీవు పెద్దవాడవు అనుభవశాలియని యూరకుంటిని గాని లేనియెడల అప్పుడే స్పష్టముగా చెప్పియుందును.

క్రైస్త:-సహోదరుడా, కోపపడకుము. నన్ను క్షమించుము. నిన్ను మార్గమును తప్పించి యిట్టి అపాయమునకు నడిపిన వాడను నేనే. సహోదరుడా నన్ను క్షమించుమని బ్రతిమాలుచున్నాను. మరొక దురుద్దేశముతోనే నీ పని చేయలేదు.

నిరీ:-సోదరుడా, ఊరడిల్లుము. నేను నీ మీద కోపముగా లేను. ఇదియును మన ముందు జాగ్రత్తకే ఉపకరించును.

క్రైస్తు:-సహోదరుడా, నామీద నీ కెంతప్రేమ. అయితే మన మిక్కడ జాగుచేయ వీలులేదు. వెంటనే వెనుకకు పోవలయును.

నిరీ:-అయితే, ఒక్కమాట. నన్ను ముందు నడువనిచ్చెదవా?

క్రైస్తు:-వద్దువద్దు. నేనే ముందు నడతును. నేను చేసినపనికి ఏదైన అపాయమున్న యెడల నేనే నాశనమగుట న్యాయము.

నిరీ:-లేదు, సోదరా, నేనే ముందుపోదును. మనోఖేదము చేత మరల దారి తప్పించిన మనకు కష్టముగదా!

ఇంతలో వారికొక స్వరము వినవచ్చెను. 'నీవు వెళ్లిన రాజ్యము తట్టు నీ మనస్సు నిలుపుకొనుము, తిరుగుము' అనుమాటలు వారి చెవుల బడుసరికి వారి ప్రాణము లేచివచ్చినట్లయ్యెను (యిర్మి 31 : 21). ఇంతలో వర్షపునీరు బహు లోతైనందున వెనకకు పోవుట బహు అపాయకరముగా నుండెను. (అప్పుడు నా మనస్సునకు వచ్చిన దేమనగా దారినుండి ప్రక్కకు పోవుట బహుసులభమేగాని తిరిగి దారికివచ్చుట బహు కష్టము గదా యని) అయినను వారట్లు సాహసించుచు వెనుకకు పోవుచునే యుండిరి. గాని నీరు బహులోతై చీకటిపడి యున్నందున తొమ్మిది లేక పదిసారులు వారు మునిగిపోవుట తటస్థించెను.

వారెంత కష్టపడినను ఆ రాత్రి యంతటిలో వారికి మునుపటి మెట్టు దొరకనేలేదు. గనుక చివరికొక చిన్న

నీడను చూచుకొని తెల్లవారు వరకును దానిక్రిందనుండిరి. గాని అలసినందున త్వరలోనే నిద్రించిరి. ఆ స్థలమున కనతి దూరమునొక దుర్గ మున్నది. దాని పేరు సందేహ దుర్గము. దాని యజమాని నిరాశా రాక్షసుడు. మన యాత్రికులిప్పుడు నిద్రించుచున్న స్థలము వానిదే. వాడు తెల్లవారి పెందలకడనే లేచి తన పొలమునందటునిటు తిరుగుచుండగా నిద్రించుచున్న క్రైస్తవ నిరీక్షణచిత్తులు వాని కంటబడిరి.

## నిరాశా రాక్షసుడు బాటసారులను పట్టుకొనుట.

వాడు వారిని సమీపించి లెండని భీకరస్వరముతో గద్దించెను. వారెక్కడివారని తన పొలమునందు వారేమి చేయుచుంటిరనియు వాడడిగెను. తాము యాత్రికులమనియు దారితప్పి శ్రమపడుచుంటిమనియు వారు జవాబిచ్చిరి.

అంతట రాక్షసుడు గర్జించి; మీరు నా స్థలమును ప్రవేశించి అపరాధ మొనరించిరి గనుక నా వెంట రండని శాసించెను. వాడు బహు బలవంతుడైనందు వాని వెంట పోక వారికి తప్పినదికాదు. వారు చేసినది ఘోరబాటే గనుక యేమి జవాబిచ్చుటకును వారికి నోరురాలేదు.

అట్లా రాక్షసుడు వారిని తోలుకొనిపోయి తనకోట యందొక చీకటికొట్టమున బంధించెను. అక్కడ దుర్వాస

నయు మురికియు యాత్రికులకు భరింపశక్యము గాకుండెను. బుధవారము ఉదయము మొదలుకొని శనివారము రాత్రి వరకును వారక్కడ పడియుండవలసి వచ్చెను. ఈ దినము లన్నిట వారికి తిన నొక్కకబళము లేదు. త్రాగుటకొక్క నీటిచుక్కయును లేదు. వారు చచ్చిరో బ్రతికిరో చూడ నెవ డును లేకుండెను. గనుక అక్కడ వారికి మిత్రులెవరును లేక చీకటియే వారికి బంధువర్గమాయెను. (కీర్తన 88 : 18). ఇక్కడ క్రైస్తవుని దుఃఖము రెండింతలుగా నుండెను. ఎందు కనగా తన బుద్ధిహీనపు యోచన చేత గదా తామింత కష్ట పడుచుంటి మని యతడు కుందుచుండెను.

మరియు నిరాశా రాక్షసుని భార్య పేరు ధైర్యహీన. వాడు నిద్రింప బోవునపుడు తాను చేసిన పని తన భార్య కెరిగించెను. అనగా తన పొలమునందు తిరిగి నందుకు ఇద్దరు వ్యక్తులను ఖైదుచేసి కొట్టమునందుంచితినని చెప్పెను. వారి కేమి చేసిన బాగుండునని యామె సలహా నడిగెను. అంత నామె వారెక్కడి వారనియు, యెక్కడికి పోవుచుండిరనియు, విచారించెను. వారు చెప్పిన విషయము నతడామె కెరిగిం చెను. అందుకామె ఉదయముననే లేచి వారిని చావగొట్టు మని యతనికి సలహా నిచ్చెను. అందు కతడు తెల్లవారి లేచి భయంకరమైన దుడ్డుకర్ర నొకదానిని తీసికొని చీకటి కొట్టము దరికిబోయి కుక్కలను తిట్టినట్లు వారిని తిట్ట మొదలు

బెట్టెను. ఎన్ని తిట్టినను క్రైస్తవుడును నిరీక్షణచిత్తుడును మాత్రము పల్లెత్తియొక్క మాట చెప్పనైన లేదు. ఆ పిమ్మట వారిపై బడి చావగొట్ట మొదలు బెట్టెను. పాపము వారు తప్పుకొనుటకైనను ఇటునటు తిరుగుటకైనను వీలులేకుండ దెబ్బలు తినవలసి వచ్చెను. ఇంతపనిచేసి వారొకని నొకడు ఓదార్చుకొని దుఃఖించునట్లు వారి నక్కడ విడిచిపెట్టి యాతడు వెడలి పోయెను. గనుక ఆ దినమంతయు మూలుగులతోను, ఘోరమగు రోదనలతోను వారికి గడచి పోయెను.

ఆ మరుసటి రాత్రి రాక్షసుని భార్య అతనితో మాటలాడి వారింకను బ్రతికియే యుండిరని తెలిసికొని వారొకరి నొకరు కడతేర్చు కొనునట్లు ప్రేరేపించు మని యతనికి సలహా నిచ్చెను. గనుక తెల్లవారినపు డతడెప్పటివలెనే వారి దగ్గరకు రుసరుసలాడుచు పోయెను. పోయి వారు తమ దెబ్బలచేత శవములవలె పడియుండుట చూచెను. వారికిక తప్పించుకొను ఉపాయము లేదనియు, తమ బాధలు గట్టెక్క వలెనన్న కత్తితోనో, ఉరిబెట్టుకొనియో, విషముత్రాగియో వారక్కడనే చావ వలయునని సలహా నిచ్చెను. మరియు నింత పాపాణ జీవితము మీద మీకిక ఆశ యెందుకని యతడు వారి నడిగెను. అయితే తమ్మును పోనిమ్మని యాత్రికులతని బ్రతిమాలిరి. ఈ మాట కతడెక్కడ లేనికోపము

తెచ్చుకొని ఒక దెబ్బతోనే వారినికడ తేర్చవలెనని ముందుకు దుమికెను గాని అప్పు డప్పుడు వచ్చు మూర్ఛ ఆ సమయమున వానికి వచ్చుటచే వెనుకకు తగ్గివారిపని పిమ్మట పట్టెదనని రోదుచు యింటికి పోయెను. (వీనికి సూర్యరశ్మియున్న నాడు మూర్ఛవచ్చుట మామూలు. అట్టి సమయము లందెల్ల వాని చెయ్యి కొయ్యబారిపోవును.) అప్పుడు బంధితు లిరువురును రాక్షసు డిచ్చిన సలహా గైకొనుట యుచితమా కాదాయని తమలో తాము తర్కించుకొన జొచ్చిరి. వారిట్లు సంభాషించిరి.

## చీకటికొట్టమున యాత్రికుల సంభాషణ.

క్రైస్త:- సోదరుడా, యిప్పుడేమి దారి? మన జీవితమిపుడు దుఃఖమయమైనది. ఇట్లు బ్రతికి యుండుటఉచితమో లేక చచ్చుటమేలయినదో నామట్టుకునాకు తోచుట లేదు కావున నేను ఉరితీయబడవలెనని కోరుచున్నాను. ఈ చీకటి కొట్టము కన్న సమాధియే మేలని నాకు తోచుచున్నది. (యోబు 7 : 15.) గనుక రాక్షసుడు చెప్పినట్టు చేయుదమా?

నిరీ:-నిజమే. నేటి మనస్థితి భయంకరమైనదే. నాకును మరణమే వేయిమడుగులు మేలని తోచుచున్నది. గాని

ఒక్క విషయమును మన మాలోచింపవలయును. నర హత్య చేయరాదని మనము పోవుచున్న రాజ్యపు ప్రభువు చెప్పెనుగదా. ఇతరుల ప్రాణముతీయుటయే ఆయన దృష్టియందు నేరమైనయెడల మన ప్రాణ మును మనము తీసికొనుట మరింత పాపమేగదా? మరియు ఎదుటివానిని చంపువాడు వాని శరీరమును మాత్రమే నాశనముచేయును గాని తన్ను తాను చంపు కొనువాడు తన శరీరమును ఆత్మనుకూడ నాశనము చేసికొనుచున్నాడుగదా! మరియు సోదరుడా, సమాధి యందు నెమ్మగల దనుచున్నావే, నరహంతకులు తమ మరణానంతరము పోవలసిన నరకముసంగతి మరచితివా? ఎందుకనగా నరహంతకు డెవడును నిత్య జీవము పొందడుగదా. ఇంతేగాక ధర్మశాస్త్ర మంతయు నిరాశారాక్షసుని చేతిలోనే గలదనుకొను చున్నావా? నాకు తెలిసినంతమట్టుకు మనమేగాక మరి యనేకులు ఆతనిచేత జిక్కిరి. వారు తప్పించు కొనిరి, మనమును తప్పించుకొందుము. సృష్టికర్త యగు దేవుడు నిరాశారాక్షసుని కడతేర్చునేమో యెవరికెరుక ? లేక ఎప్పుడోయొకనాడు మనలను బంధించుట మరచిపోవునేమో! లేక మొన్నటివలెనే మరొకనాడు మన కన్నులయెదుట వానికి వాతము

వచ్చి కాలుసేతులు పూర్తిగా పడిపోవునేమో! ఎందు కనగా వానికట్టిని మరియొకసారి సంభవించినయెడల నేను అదేసమయమని ధైర్యము చిక్కబట్టి వాని చేతినుండి తప్పించుకొనుటకు నిశ్చయించుకొని యున్నాను. ఈపని మొన్నటిసారియే నేను చేయకుండుట నా బుద్ధిహీనత. ఏమైనను, సోదరుడా, నాహితవు విని కొంత శాంతమువహించి వేచియుందము. మన కానందమగు విమోచనాదినము రావచ్చును. మన లను మనము చంపుకొనకూడదు.

ఈ మాటలచేత నిరీక్షణచిత్తుడు తన మిత్రుడగు క్రైస్తవు నూరడించెను. అట్లు వారిరువురును ఆ చీకటికొట్టు నందు దుఃఖించుచు ఆదినమును గడిపివైచిరి.

సాయంకాలమైనప్పుడు బంధితులు తన సలహా గైకొనిరో లేదో చూచుటకు రాక్షసుడు తిరిగి ఖైదుకొట్టున ప్రవేశించెను. గాని వాడు పోయిచూడగా వారిరువురును బ్రతికియే యుండిరి. రాక్షసుడు తనకన్నులను తానే నమ్మలేకపోయెను. అన్నపానములు లేనందునను తానుకొట్టిన దెబ్బలచేతను యాత్రికులు కొనయూపిరితో నున్నను వారు జీవముతోమాత్ర ముండిరి. గాని వారి మేనులందు ఊపిరి యున్నదని చూచినతోడనే రాక్షసునికి మరింత కోపము వచ్చెను. తనసలహా ననుసరించి వారు చావలేదని చూచి వీరుపుట్టకుండుట మేలై యుండునని రాక్షసుడు గర్జించెను.

ఇదివినగా యాత్రికులు బహుగా వణకిరి, క్రైస్తవుడు మూర్ఛకూడ పొందినట్లు నాకు కనబడెను. గాని త్వరలోనే కొంచెము తేరుకొని రాక్షసుని సలహానుగూర్చి మరల సంభాషింపసాగిరి. తమ జీవితములను చాలించుకొనుటయే మేలని క్రైస్తవుడు మరల తలంచెనుగాని నిరీక్షణాచిత్తుడు మరల నిట్లు జవాబిచ్చెను.

నిరీ:- ప్రియసోదరుడా! ఇంతవరకును నీవెంత శౌర్యముగ నుంటివో మరచిపోతివా? అపొల్యోనంతటివాడు నిన్ను నలుగగొట్టలేక పోయెను; మరణచ్ఛాయగల లోయయందు నీవు కని, విని, యనుభవించిన వెన్నియైనను నీధైర్యమును కదల్పలేవాయెను. ఇప్పటికే యెట్టికష్టములను, భయమును, విభ్రాంతియు నిన్ను దాటిపోయినవి! ఇప్పుడేల నీ మనస్సంతయు భయకంపితమైనది? నన్ను చూచుచున్నావు గదా! నేను నీకన్న బహు దుర్బలహృదయుడనే. నేనును నీతో పాటు ఈ పాయస్థితియందు లేనా? ఈరాక్షసుడు నీతో పాటు నన్నును చావగొట్టెను గదా? నీతోపాటు నన్నును ఆకలిదప్పులకు మాడ్చివేసి పగటివెలుగు కరువుజేసినాడు గదా! నేనును నీవలెనే కుందుచుంటిని. గాని మనము ఇంకింత ధైర్యమూనుదము. మాయాసంతలో నీవెంతటి పౌరుషము చూపితివో

జ్ఞాపకము చేసికొనుము. సంకెళ్లకైనను, యినుప పంజరమున బ్రగ్గుటకైనను చివరకు చిత్రవధ చేయబడి చచ్చుటకైనను నీవు భయపడలేదుగదా. సిగ్గులపాలగుట క్రైస్తవునికి తగదు గనుక అందులకైనను మనకు శక్తియున్నంత మట్టుకు శాంతము వహించుదము.

ఇంతలో రాత్రియైనది. పరుండునపుడు రాక్షసుని భార్య వానితో సంభాషించి ఖైదీలసంగతి విచారించి తన సలహా వారు గైకొనిరాయని అతనిని ప్రశ్నించెను. అందుకు రాక్షసు డిట్లనెను: వారు బండపీనుగులవలె నున్నారుసుమా! శ్రమలనైన పడ నిచ్ఛయించుచున్నారు గాని ప్రాణము తీసుకొన నొప్పుకొనుట లేదు.

అందుకామె యిట్లని యతనికి సలహానిచ్చెను: రేపు వారిని కోట యావరణమునకు తీసికొనిపోయి నీ సలహా ననుసరించనివారి శల్యములను కపాలములను చూపుము. ఈ వారము ముగియకముందే వారిని చంపినట్టు వీరినికూడ తుత్తునియలుచేసి చంపుదునని బెదిరించి నమ్మించుము.

అంతట తెల్లవారినపుడు రాక్షసుడు మరల యాత్రికులను చూడబోయి తనభార్య చెప్పినట్టు చేసెను. మరియు వాడిట్లు చెప్పెను: ఇదిగో యీ యెముకలన్నియు మీవంటి దౌర్భాగ్యుల యెముకలే. మునుపు వారును మీవలె నా

స్థలముజొచ్చి తిరుగాడిరి. గనుక వారిని నా యిష్టమువచ్చి నట్లు చీల్చి చెండాడితిని. మీకును ఒక్కవారము దినములలో నిగతి చే కాచుకొనియున్నది. పొండు. మీస్థానమున వేచి యుండుడి. ఇట్లుచెప్పుచు వారిని చావగొట్టుచు తిరిగి ఖైదు కొట్టునకు అతడు వారిని తోలుకొనిపోయెను. గనుక శని వారమంతయు దుఃఖించుచు వారందే పడియుండిరి.

మరియు రాత్రియైనపుడు ధైర్యహీనయును ఆమెభర్త రాక్షసుడును పడకగదియందు మరల బంధితులనుగూర్చి మాటలాడిరి. తన్నినను బెదరించినను సలహానిచ్చినను ఏ యుపాయముచేత నైనను వారిని కడతేర్చలేనైతినని యా ముసలిరాక్షసుడు తన భార్యవద్ద విలపించెను. అందుకు ధైర్య హీన యిట్లనెను: ఒకవేళ యెవడైనను వచ్చి తమ్మును విడి పించునేమోయని వారాశపడి బ్రతుకుచున్నారేమో. లేని యెడల ఎప్పటికైనను తప్పించుకొనుటకు వారివద్ద దొంగ తాళము లున్నవేమో! అంత నారాక్షసుడు నోరుతెరచి: ప్రేయసీ, ఇదియును సంభవమే సుమా, నేను రేపే వారిని తనిఖీ చేయుదును.

అక్కడ వారిరువురును శనివారమురాత్రి యంతయు ప్రార్థించుచు తెల్లవారువరకును మేలుకొని దేవుని మొరబెట్టు చుండిరి.

# వాగ్దాన బీగము

అంతట తెల్లవారుచుండగా క్రైస్తవుడు ఆశ్చర్యపడిన వానివలె నిట్లు చెప్పసాగెను: అయ్యో, నేనెంత బుద్ధిహీనుడను. స్వాతంత్ర్యముతో వెలుపలికి పోగలిగియుండియు నేనీ చీకటికొట్టమునం దుంటినే, నారొమ్మున నొక తాళపుచెవి గలదు. దానితో నీ సంశయదుర్గమునందలి తాళమును దేనినైనను తీయవచ్చునని నాకు తెలియుచున్నది. ఆమాటలకు నిరీక్షణచిత్తుడు చిరునగవుతో: ఆహా, ఇదెంత సువార్త. వెంటనే యాబీగమును లాగి తాళమును తీయుము.

అప్పుడు క్రైస్తవుడు తన హృదయ పేటికనుండి తాళపు చెవిని తీసి యా చీకటి కొట్టపు తలుపు తెరువగా నది దారి నిచ్చెను. సులభముగా తలుపు విడిపోయెను. అంత క్రైస్తవుడును నిరీక్షణచిత్తుడును వెలుపలికి వచ్చిరి. ఆ పిమ్మట వారు కోట గోడకు వెనుక ద్వారము నొద్దకు వచ్చి తమ చేతనున్న బీగముతో ప్రయత్నింపగా నదియును వెలువడెను. అప్పుడు వారిరువురు యినుప సింహద్వారమునకు వచ్చినపుడు తాళము కఠినముగా తిరిగెను. గాని అదియు విడివడెను. వారా ద్వారమును వేగముగా త్రోసి వెలుపల పడిరి. అయితే నా ద్వార బంధములు లేని పోని ధ్వని చేసినందున రాక్షసుడు మేల్కొని బంధితులు పారి పోయిరని పరుగెత్త యత్నించెను. గాని వాతముచే

నతని కాళ్లు రాలేదు. మునుపటి వలెనే వాని వాతరోగము మరల వచ్చినది. అందుచేత యాత్రికులు తప్పించుకొని పోయి పోయి తుదకు రాజమార్గమునకు వచ్చిరి. రాక్షసుని సరిహద్దులు దాటినందున వారికిక అపాయము లేకుండెను.

మరియు వారు దిగుడు మెట్లకడకు మరల వచ్చినపుడు వారికొక యోచన కలిగెను. మన వెనుక వచ్చు వారు మనవలె మోసపోయి యీ మెట్లు జోలికి పోయి చెడకుండునట్లు మనిమిక్కడ యేమి సాధన కల్పింతుమా యని వారు యోచింప సాగిరి. ఇక ముందు వచ్చు యాత్రికులు నిరాశా రాక్షసుని చేతబడకుండ వలెనని వారి యాలోచన అందుకు వారక్కడ నొక స్థంభమును నిలిపి దానిపై నిట్లు వ్రాయవలెనని యోచించిరి.

"జాగ్రత! ఈ మెట్ల మీదుగా పోవుమార్గము సంశయమార్గమునకు పోవును. దాని ప్రభువు నిరాశా రాక్షసుడు. వీడు నిత్యజీవపురము రారాజును ద్వేషించి ఆయన బాటసారులను నాశనముచేయ జూచుచున్నాడు."

ఈ మాటలు చదివిన వారనేకులు ఆ దారిని తొలగి భద్రతా మార్గమున చరించి మేలు నొందిరి. ఈ పని చేసి మన యాత్రికులు తమ దారిని పోవుచు నీ పాట పాడిరి:—

త్రోవ దప్పి తిరిగినాము
చావుగోతి కరిగినాము

పోవరాని చోటు నందు
పోవరాదని యెరిగినాము
వెనుకవచ్చు వాడెవడైన
కునికి దారికి దూరమైన
సంశయ దుర్గంబునందు
నిరాశ గాడికి చిక్కగలడు

## ఆనంద పర్వతములు.

అంతటవారు నడచి నడచి ఆనంద పర్వతముల చెంతకు వచ్చిరి. మన మింతకు ముందు చెప్పుకొన్న కొండకు ప్రభు వగు వాడే వీటికిని యజమాని. గనుక ఆ పర్వతములమీాద నున్న తోటలను ఫలవృక్షపు తోపులను, ద్రాక్షతోటలను, నీటి యూటలను చూచుటకు పైకి పోయిరి.

ఈ కొండ శిఖరములందు గొఱ్ఱెల కాపరులు తమ మందలను కాచుకొనుచు మార్గమున కిరుప్రక్కలను వారికి కనబడిరి. యాత్రికులు వారి యొద్దకుపోయి ఆయాసముచేత తమ చేతి కఱ్ఱలమీాద గడ్డముల నానించుకొని వారి నిట్లని ప్రశ్నింప సాగిరి. అన్నలారా, ఈ ఆనంద పర్వతము లెవ రివి? ఇందు మేయుచున్న గొఱ్ఱెలకు ప్రభు వెవడు?

గొఱ్ఱెలకాప:-ఈ పర్వతములు యిమ్మాను యేలు స్వాస్థ్యము. ఆయన పరిశుద్ధ పట్టణమునకు కనుచూపుమేరలో నివియున్నవి. ఈ గొఱ్ఱెలు ఆయన సొత్తే. వీటికొఱకు ఆయన తన ప్రాణమును పెట్టెను.

క్రైస్త:-ఆ నిత్యజీవ పురమున కిదియేనా మార్గము?

గొఱ్ఱెలకా:-మీరుపోవుచున్నదే ఆ మార్గము.

క్రైస్త:-అది యిక్కడికి కెంత దూరముండును?

గొఱ్ఱెలకా:-అక్కడకు పోవువారికి దగ్గర. మిగిలినవారికి దూరమే.

క్రైస్త:-అక్కడికి పోవుమార్గము అపాయకరమైనదా ?

గొఱ్ఱెలకా:-అది యెవరికి క్షేమకరమో వారికి క్షేమకరమే గాని తిరుగుబాటు చేయువారు మాత్రము దానిలో తొట్రిల్లుదురు. (హోషేయ 14 : 9)

క్రైస్త:-మార్గమునందు అలసి. నలిగిన యాత్రికుల కేదైన శరణ్యమున్నదా ?

గొఱ్ఱెలకా:-లేకేమి ? ఈ పర్వతములకు ప్రభువగు వాడు పరదేశులను పరామర్శించుట మానవద్దని మాకాజ్ఞ యిచ్చెను. గనుక మీ ముందున్న ఫలాది సంపద యంతయు మీదే. (హెబ్రీ 13 : 2)

మరియు నేను స్వప్నమునందు చూచిన దేమనగా

వారు దూరదేశమునుండి వచ్చుచున్న వారని గొఱ్ఱెలకాపరులు తెలిసికొని వారి యోగక్షేమములను గూర్చి ప్రశ్నించిరి. మీదే దేశము ? మీరీ మార్గము నెట్లు తెలిసికొంటిరి ? ఇందు నడచుట మీకెట్లు సాధ్యమైనది? బైలుదేరిన వారనేకులు మార్గమధ్యముననే విడిచిపోవుచుండగా మీకు చివరివరకును కొనసాగించుట కెట్లు సాధ్యమైనది? మొదలగు అనేక ప్రశ్నలను ఆ గొఱ్ఱెలకాపరు లడిగిరి. యాత్రికులును తమ వృత్తాంతము నాయాచోట్ల చెప్పినట్లే గొఱ్ఱెలకాపరులకు చెప్పిరి. వారిచరిత్ర నాంతముగా వినినపుడు ఆ కాపరులకు అమితానందము కలిగినది. ఆనందముచేత ఆయాత్రికులకు వారు వేనోళ్ల స్వాగతము చెప్పి ఆనందపర్వతముల కాహ్వానించిరి. జ్ఞాని, అనుభవమూర్తి, మెళకువయ్య, పట్టుదలయ్య అనునా గొఱ్ఱెల కాపరులు వానిని తమ గుడారములకు తీసికొనిపోయి అప్పటికి సిద్ధముగానున్న పదార్థముల నొసగి వారిని తృప్తిపరచిరి. మరియు కొంతకాలమక్కడ నుండి ఆనంద పర్వతములందలి ఆనందములతో సేదదేరి తమ్ము నానందపరచి పొండని యాత్రికులకు వారు ప్రార్థించిరి. యాత్రికులందుకుసమ్మతించిరి. అంత ప్రొద్దుబోయి నందున వారందరును నిద్రించిరి.

# పొరబాటు కొండ.

అంతట నేను నాకలయందు చూచిన దేమనగా మరునాడు తెల్లవారినపుడు గొఱ్ఱెల కాపరులు తమ పడకలనుండి లేచి ఆయా ప్రాంతముల విశేషములను జూపెదము రమ్మని క్రైస్తవుని నిరీక్షణచిత్తుని పిలచిరి. అట్లువారు పోయినపుడు నలుదిక్కులను అనేక భాగ్యములు వారికగుపడెను. అంతనా గొఱ్ఱెలకాపరులు యిక్కడ గల వింతలను కొన్నిటిని వీరికి జూపుదమా యని తమలో తాము యోచించుకొనిరి. అట్లు వారు జరిగించిన పిమ్మట వారు యాత్రికులను పొరబాటు కొండ యను శిఖరమునకు దీసికొని పోయిరి. అది వెనుకప్రక్క మిక్కిలి యేటవాలుగా నుండెను. దానిపైకెక్కినపుడు క్రిందికి చూడుడని యాత్రికులకు కాపరులు చెప్పిరి. క్రైస్తవుడును నిరీక్షణచిత్తుడును క్రిందికి చూచినపుడు అంతకు ముందు పొరబాటు శిఖరమునుండి జారిపడి తుత్తునియలైన కళేబరము లనేకములు వారికి కనబడెను.

అంత క్రైస్తవు డిట్లనెను: దీని భావమేమై యుండును? దానికి కాపరులిట్లు జవాబిచ్చిరి: హుమేనై యొక్కయు ఫిలేతు యొక్కయు మాటలు విని చెడిపోయి, శరీర పునరుత్థానము గతించెనని చెప్పుకొనుచు దారి తప్పినవారు వీరే. ఈసంగతి మీరింతకు ముందు విననే లేదా? ( II తిమోతీ

2 : 18, 19 )అందుకు యాత్రికులు : అవును. వింటిమనిరి. అప్పుడు గొఱ్ఱెలకాపరులు: వారే పలిగి ముక్కముక్కలై యీ కొండక్రింద మీకు కనబడుచున్నారు. వారిశవములు భూస్థాపనపొందక అట్లే మిగతవారికి గుణపాఠముగా నిలచి యున్నవి. ఎందుకనగా నీకొండపై నెక్కకుండగను దాని యంచునకు పోకుండగను మిగతవారికిది సూచనయైయున్నది.

# హెచ్చరిక కొండ

నేనప్పుడు చూడగా వారినింకొక కొండశిఖరమునకు కాపరులు తీసుకొనిపోయిరి. దానిపేరు హెచ్చరికకొండ. అక్కడినుండి యెదురుగా దూరమునకు వారు చూడుమనిరి. యాత్రికులట్లు చూడగా అక్కడనున్న సమాధుల మధ్య కొందరు జను లటునిటు తిరుగుచుండిరి. వారు జాగ్రత్తగా చూచినపుడు ఆ తిరుగుచున్న వారు గ్రుడ్డివారనియు ఎప్పుడో ఆ సమాధులమధ్య అప్రమత్తులై తగులుకొని వెలుపలికి రాలేక కొట్టాడుచున్నారనియు గ్రహించిరి. దీని భావమేమని క్రైస్తవుడడుగగా గొఱ్ఱెల కాపరులిట్లు చెప్పసాగిరి: ఈ పర్వతములకు కొంత దిగువను త్రోవ కెడమప్రక్కనున్న మైదానములోనికి చిన్న మెట్లదారి మీకు కనబడలేదా? ఆమెట్లు దాటిపోయినయెడల దారియొకటి తిన్నగా సంశయదుర్గము

నకు పోవుచున్నది. దాని స్వంతగాడు నిరాశా రాక్షసుడు. మీకు కనబడుచున్న ఆమనుష్య లోకప్పాదు యాత్రికులై యిలు జేరి ఆ మార్గమువరకు వచ్చినవారే. ఆస్థలమున సరియగు దారి కొంచెము కరకుగాను కఠినముగాను ఉన్నందున వారు ప్రక్కకుమళ్లి యీతప్పుదారి త్రొక్కిరి. అంతట వారు నిరాశా రాక్షసుని చేతజిక్కి సంశయ దుర్గమునందు బంధింప బడిరి. అట్లు వాడు వారినక్కడ కొంతకాలముంచి వారి కన్నులు తీసివేసి యిట్లు వదలిపెట్టినాడు. అట్లు గ్రుడ్డివారై వీరు నేటివరకును యీ సమాధులమధ్య తిరుగుచున్నారు. అందుకనియేగదా జ్ఞాని చెప్పినాడు : వివేకమార్గము విడిచి తిరుగువాడు ప్రేతలగుంపులో కాపురముండును. (సామె 21 : 16) జ్ఞానులమాట వ్యర్థమగునే!

ఈమాటలు విని క్రైస్తవుడును నిక్షణచిత్తుడును ఒకరిరీ వంక నొకరు చూచుకొని తమ పూర్వఅనుభవమును జ్ఞాపకము చేసికొని కన్నీరువిడచిరి. అయితే గొఱ్ఱెలకాపరులతో నేమియు చెప్పక ఊరకుండిరి.

## నరకమునకుపోవు గొంది

అంతట నేను చూచుచుండగా నా గొఱ్ఱెలకాపరులు క్రైస్తవ నిరీక్షణచిత్తులను మరియొకచోటికి తీసికొనిపోయిరి. అదియొక లోయ. అందు కొండప్రక్క నొకద్వారము కన

బడెను. ఆద్వారమును తెరచి లోపలచూడుడని యాత్రికులను నడపిరి. వారు చూచినప్పుడా బిలములోపల యంతయు గొప్ప చీకటియు పొగయు నిండియుండెను. అందు మంటల ధ్వనియు, భీకర నినాదములును వారికి వినవచ్చెను. గంధకపు వాసన గప్పున కొట్టుచుండెను.

దీని యర్థమేమని క్రైస్తవు డడిగెను. అందుకు కాపరులు ఇదియే నరకమునకుపోవు గొంది. వేషధారులు దీనిలోనికి పోవుదురు. యేశావువలె తమ జ్యేష్ఠత్వము నమ్ముకొనువారికిదియే దారి. యూదావలె తమ యజమానులను విక్రయించువారును, అలెక్సంద్రువలె సువార్తను నిరసించువారును, అననీయ సప్పీరాలవలె అబద్ధమాడి మోసగించువారును యీమార్గమున పోయి నశింతురు. అంతట నిరీక్షణ చిత్తు డిట్లని ప్రశ్నించెను: వీరందరును మావలెనే చాలకాలము యాత్ర చేసియే చెడిపోయిరికదా?

గొర్రెలకా:-ఆహా. చేసి చాలదూరము వచ్చియే పడిపోయిరి.

నిరీ:-వీరిట్లు దౌర్భాగ్యులై చెడిపోవుటకు ముందెంతదూరము ప్రయాణముచేసి యుండిరి?

గొర్రెలకా:-కొందరీ పర్వతముల వరకువచ్చిరి; మరికొందరింకను దూరముపోయియే యుండిరి.

అప్పుడు క్రైస్తవులు తమలోతామిట్లు చెప్పుకొనిరి. ఆహా! మనము సర్వశక్తివంతుని శక్తికొరకు ప్రలాపింపవలయునుసుమా!

గొల్లలకా:-ప్రలాపించుటయే కాదు. పొందినప్పుడు దానిని ఉపయోగించుటకూడ అవశ్యము.

## యాత్రికులు గొల్లల కాపరులవద్ద సెలవు పుచ్చుకొనుట

ఇంతటితో సాగిపోవలయునని యాత్రికులు తలంచిరి. గొల్లలకాపరులును దానికి సమ్మతించిరి. అట్లు వారందరును పర్వతముల తుదకు నడచివచ్చిరి. అక్కడినుండి నిత్యజీవ పురముయొక్క ద్వారమును చూపవలెనని కాపరులు తలంచిరి. తమయొద్దనున్న దూరదర్శిని అద్దములతో వారు చూడగలరేమో యత్నింతమని యోచించిరి. ఆ యాలోచనకు యాత్రికులు కడుమోదముతో సమ్మతించిరి. అంత వారందరును స్పష్టిశిఖరమను కొండ నెక్కిరి. దూరదర్శిని అద్దములను కాపరులు యాత్రికుల కందించిరి.

వారుచూడ యత్నించిరిగాని అంతకుముందు కనివిని యున్న నరక బిలద్వారము సంగతివలన వారి చేతులింకను వణకుచునే యుండెను. అందువలన వారికి అద్దములగుండా చూచుటకు వీలులేకపోయెను. అయినను మబ్బుమబ్బుగా నా పరమపుర ద్వారము కనబడుచున్నట్టును అచటి మహిమా ప్రకాశములు కొంచెము గోచరించు చున్నట్టును వారికి తోచెను. వెంటనే వారిట్లు పాడసాగిరి.

అందమైన మహిమ కనుల కండియుండెను
మందుల కన్నులకు మునుపు దాగియుండెను
మందల పాలకుల దయచే - మర్మమైన వింతలెల్ల
చూడవచ్చు నిపుడుగదా - జారిపోయె వంతల్లె ॥అంద॥

అంతట వారు సెలవుపుచ్చుకొన నుద్యమించుచుండగా నొక కాపరి త్రోవను తెలియజేయు మార్గదర్శిపత్రము నిచ్చెను. మరియొక పాలకుడుఇచ్చకాలమారియనువానినిగూర్చిజాగ్రత సుమీ యని చెప్పెను. వేరొక వృద్ధుడు మంత్రభూమిలో నిద్రింపకుడని సలహానిచ్చెను. ఇంకొక బుద్ధిమంతుడు దేవుని కృపను పొందుడని దీవించెను. ఇంతలో నాకు మెలకువ వచ్చినది.

నేను మరలనిద్రించి యింకను కలగంటిని. ఆకలయందా యాత్రికులే రాజమార్గమునబడి పరమపురికి పోవుచుండుట చూచితిని.

## అజ్ఞానిసంగతి

ఈమార్గమున కెడమవైపున కొండలదిగువగా నొక దేశమున్నది. దాని పేరు అహంభావ దేశము. ఆ దేశము నుండి యొకచిన్న వక్రమార్గమువచ్చి యాత్రికులు నడచుచున్న మార్గమునందు కలిసికొనుచున్నది. ఆ మార్గమువెం

బడి నడచుచు వడిదుడుకుగా వచ్చుచున్న యొక పడుచు వాడు వారికగుపడెను. వాని పేరు అజ్ఞాని. నీదేయూరు, యెక్కడికి పోవుచుంటివని క్రైస్తవుడతని నడిగెను. అందుకు :

అజ్ఞా:- స్వామీ, అదిగో అనతిదూరమున మీా కెడమ ప్రక్కగా కనబడుచున్న దేశమున నేను పుట్టితిని. పరమపురికి పోవుచున్నాను.

క్రైస్త:-అయితే పరమపురి ద్వారమును ప్రవేశించుట కొంత కష్టమే. నీవేయుపాయమున ప్రవేశింపగలవు?

అజ్ఞా:-సత్పురుషులందరెట్లు ప్రవేశింతురో నేను నట్లే.

క్రైస్త:-గాని ద్వారము తెరువబడునట్లు నీవు చూపుటకేదైన అధికారపత్ర మున్నదా?

అజ్ఞా:-నేను నా ప్రభువు చిత్తమును యెరుగుట మాత్రము యెరుగుదును. నా జీవితము కొంత మేలయినదే. ప్రార్థన, ఉపవాసము, దశమార్పణ. పేదలయందాదరణ మొదలగు వాటికి లోటులేదు. మరియు బంగారమువంటి దేశమును కూడ విడిచి పెట్టితిని (అహంభావ దేశమన్నమాట.)

క్రైస్త:-ఎన్నియైనను నీవు మొదటనున్న దిడ్డి గుమ్మము గుండా ఈ మార్గమునకు రాలేదు. మరియు నీవంకర త్రోవనుబడి వచ్చితివి. గనుక నీ వేమియనుకొన్నను సరే గాని నా మనస్సునందున్న మాటయొకటి చెప్పి

వేసెదను. మార్గము కాని మార్గమున వచ్చినందుకు నీవు తీర్పుదినమున దొంగవనియు దోచుకొన వాడవనియు తీర్చబడుదువు. గాని నిత్యజీవపురమునకు నీకు ప్రవేశము దొరకదు.

అజ్ఞా:- అయ్యలారా, మీరు నాకు కేవలము అపరిచితులు. మీ దారి మీది, నా దారి నాది. మీ దేశాచారమును బట్టి మీరు సాగిపొండి మా దేశాచారమును నేను విడువను. ఎవరేపద్ధతిని వచ్చినను చివరకు అందరమును గమ్యస్థానమును చేరుదుమని నాతలంపు. మరి మీరు చెప్పిన దిడ్డిగుమ్మము సంగతి యేమందురా; అది మా దేశమునకు చాల దూరమన్న సంగతి లోకవిదితమే మా ప్రాంతపు వాడెవడును ఆ ద్వారము సంగతి యెరుగనైన యెరుగడు. ఇంతే గాక యెరిగినను ఎరుగకున్నను చిక్కులేదు ఎందుకనగా మా దేశమునుండి యీ దారికి వచ్చుటకు అదిగో, చక్కని, సుఖమయమైన పచ్చని దారి కనబడుట లేదా ? అదియే చాలును.

వీని గర్వపు మాటలలో తనకు తానే జ్ఞానినని తలంచుట క్రైస్తవుడు గ్రహించి, నిరీక్షణచిత్తుని వైపుకు తిరిగి యిట్లనెను. 'తన దృష్టికి జ్ఞాని ననుకొను వాని చూచితివా ? వానిని గుణపరచుట కంటె మూర్ఖుని గుణపరచుట సులభము.'

(సామె. 26 : 12) మరియు క్రైస్తవు డిట్లనెను: 'బుద్ధిహీనుడు తన నడకను గూర్చి అధైర్యపడి! తాను బుద్ధిహీనుడని అందరికిని తెలియజేయును.' (ప్రసంగి 10 : 3.) ఏమి, యింకను వీనితో వ్యర్థ ప్రసంగములు చేయుదమా? లేక యిప్పటికి వీనిని విడిచిపెట్టి మన మిప్పుడు చెప్పిన విషయములను మననము చేసికొన నిచ్చి మరియొకసారి కలసికొందమా? అట్లయిన యెడల క్రమక్రమముగా వీని క్షేమమైన మేలు కలుగునేమో చూడవచ్చును. అందుకు నిరీక్షణచిత్తు డిట్లు పాడసాగెను:

జ్ఞానహీనుని కొంత - ధ్యానింప నిత్తము
హితబోధ నొక్కింత - మతినుంచ మందము
మేలుకోరిన వారి పలుకింత
కాలదన్నుట కీడు కేనంత ॥జ్ఞా॥
అత్యంత యుక్తమగు - ఆత్మీయఫలమేదో
యెరుగ కుండియు నెన్న - డెరుగ గోకరయున్న
స్వస్తచిత్తముతో వెదుకకున్న
హస్తగత మగుమాట యదిసున్న ॥జ్ఞా॥

మరియు నిరీక్షణచిత్తు డిట్లనెను. మొత్తముహితబోధనంతటిని ఒక్కసారియే వానినోట గ్రుక్కుట పాడిగాదు. ఇప్పటి మట్టుకు దీనిని విడిచిపెట్టి నీ కిష్టమైన యెడల మరియొకసారి వీనిని కలిసికొని మాట్లాడుదము. అప్పుడు చెప్పినది గ్రహించి భరించ వీనికి వీలగును.

అట్లు వారిద్దరు ముందునడచి పోయిరి. అయితే అజ్ఞాని వెనుక పోవుచునే యుండెను.

## మార్గత్యాగి యనువాని నాశనము.

వారట్లు కొంత దూరము పోవుసరికి వారొక సన్నని చీకటిసందులో ప్రవేశించిరి. అక్కడ యేడు దయ్యములచేత బంధింపబడిన మనుష్యుడొకడు వారికి కనబడెను. ఆ యేడు దయ్యములును యేడు త్రాళ్ళతో నతనిని కట్టి ముందు వర్ణింపబడిన కొండప్రక్క నరకద్వారమునకు వానిని నడిపించుకొని పోవుచుండెను. (మత్త 12 : 45; సామె 5 : 22.) అది చూచినపుడు సుబుద్ధియగు క్రైస్తవుని శరీరము వణకసాగెను. అట్లే నిరీక్షణచిత్తుడును వణకసాగెను. ఆ దయ్యములు వానిని నడుపుకొని పోవుచుండగా నతడెవడైన పరిచయస్థుడేమో చూడవలెనని క్రైస్తవుడు తొంగి చూచెను గాని కట్టువడిన దొంగవలె అతడు తలవంచుకొని యున్నందున అతనిముఖము సరిగా కనబడలేదు. గాని మొత్తముమీద అతడు సత్యత్యాగమను పట్టణస్థుడైన మార్గత్యాగియను వాడని క్రైస్తవునికి తోచెను. వారట్లు దాటిపోవుచుండగా మార్గత్యాగి వీపుమీద నీ మాటలు కనబడెను. "మాటపుమిన్న భక్తికి సున్న."

అంతట క్రైస్తవు డిట్లు చెప్పసాగెను : మిత్రుడా, నిరీక్షణా, నేనింతకుముందు విన్నసంగతి యొకటి జ్ఞాపకము నకు వచ్చుచున్నది. ఈ ప్రాంతముననే యొక బుద్ధిమంతుని శోకసంగతి జరిగినదట. ఆయన పేరు అల్పవిశ్వాసి. అతడు మంచివాడే. అతని స్వగ్రామము ఆసక్తిపురము. అతనికి సంభవించినది చెప్పుచున్నాను వినుము.

విశాల ద్వార మనుచోటినుండి చచ్చిన వానిసందు అనబడు సన్నని మార్గము ఈ రాజమార్గములో మొదట కలియుచున్నది. ఈ చచ్చిన వానిసందులో నరహత్య లెక్కు వగా జరుగుచుండుటచేత దానికా పేరు వచ్చినది. ఈ యల్ప విశ్వాసి నేడు మనము పోవుచున్నట్లే యాత్రకు బైలు దేరె నట. అతని కక్కడ మార్గాయాసము కలుగగా కూర్చుండి నిద్రించెనట. అంతట జరిగిన దేమనగా విశాల ద్వారము నుండియే ఆయాస హృదయుడు, సందేహయ్య, పాపజ్ఞప్తి యను ముగ్గురు గజదొంగలు నడచివచ్చుచుండిరి. వీరు ముగ్గురును అన్నదమ్ములు. వారు అవిశ్వాసి నిద్రించు చుండుట చూచి ఉరుకుచు వచ్చిరి. ఇంతలో పాపము-అల్ప విశ్వాసి మేల్కొని తన ప్రయాణమును సాగింప నుద్యమించు చుండెను. అందుచేత వారందరును అతని చుట్టు ముట్టి భయ పెట్టుచు లెమ్మని గద్దించిరి. దీనితో అల్ప విశ్వాసి పని యై పోయినది. భయముతో ముఖము వెలవెల బార, వారి

నెదిరించుటకు గాని కాలికి బుద్ధి చెప్పుటకు గాని వానికి తోచలేదు. నీ సొమ్ము సంచి యిటు పారవేయుమని ఆయాస హృదయుడు గర్జించినాడు. డబ్బుపోగొట్టుకొనుటకు అల్ప విశ్వాసికి చేతులాడలేదు. అంతట సందేహాయ్యా చెయ్యిచాపి వాని జేబులోనున్న రొక్కపుసంచిని ఊడలాగినాడు. అప్పుడు దొంగలు-దొంగలని అల్పవిశ్వాసి కేకలు బెట్టినాడు. ఈ మాటతోనే పాపజ్ఞప్తియనువాడు తన చేతనున్న బడితెతో అల్పవిశ్వాసి తల పగులగొట్టినాడు. దెబ్బలతోనే యితడు వెనుకకు పడిపోయి రక్తము ప్రహింప చావ సిద్ధమైనాడు. ఇందంతయు నా మండగీండ్లు చూచుచునే యుండిరి. ఇంతలో రాజమార్గమున సవ్వడియైనది. నిబ్బర విశ్వాసపురము నందుండు కృపాతిశయుడను వాడు వచ్చుచున్నాడేమో యని భయపడి ఆ దొంగలు ముగ్గురును పరుగు జూపిరి. అల్ప విశ్వాసి మాత్రము అట్లే పడియుండెను. కొంతవడి కతడు తెలివి దెచ్చుకొని నెమ్మదిగా నడచిపోవుచుండెను.

## అల్ప విశ్వాసిని గూర్చి సంభాషణ.

నిరీ:- అయితే అతని కున్నదంతయు ఆ దొంగలు దోచుకొనిరా ?

క్రైస్త:-లేదు అతని యమూల్య వజ్రములున్నచోటు వారు వెదుకనేలేదు. గనుక యవి యింకను అతని దగ్గరనే

యున్నవి. గాని తనకు కలిగిన నష్టముచేత అల్ప విశ్వాసి చాల క్రుంగిపోయెనని వింటిని. ఏమనగా, పాపము అతడు ఖర్చున కుంచుకొన్న రొక్కము దొంగలకు చిక్కినది. ఇక వారు విడిచి పెట్టినవి ఆభరణములేనట. కొద్ది చిల్లర తన యొద్ద నింకను ఉండెనట గాని తన ప్రయాణమున కది యెంత మాత్రము చాలకుండెను. గాని తన యాభరణముల నతడు అమ్ముకొనుటకు ప్రాణ మొప్పక తన మార్గ మందంతయు భిక్షమెత్తుకొనుచు యాత్ర సాగించ వలసివచ్చెనని చెప్పుదురు. ఈ మాట నమ్మవలసినదే గాని భిక్షమెత్తినను మరేమిచేసినను అనేక సార్లు పస్తుండియే తుదకు తన గమ్యస్థానమును చేరెనని చూచినవారు చెప్పుదురు. (I పేతురు 4 : 18.)

నిరీ:-అయితే, ఒక్కమాట. ఇతనియొద్ద నిత్యజీవపుర ద్వార మునొద్ద చూపవలసిన యోగ్యతా పత్రిక యుండ వలయును. గదా, ఇది ఆ దొంగలచేత బడకుండు టెంత గొప్పసంగతి!

క్రైస్త:-ఇది ఆశ్చర్యమే. గాని అది వారికి దొరకకుండుట ఈ అల్పవిశ్వాసి ప్రజ్ఞగాదు. ఎందుకనగా వారిని చూడగనే వీనికి పైప్రాణము లెగిరిపోయి యేమిచే యను తోచక నిశ్చేష్టుడై కాళ్లుచేతు లప్పగించి

నిలువబడినాడు. అంత గొప్ప సొత్తును అతడు నిలిపి యుంచుకొనుట అతని నేర్పరితనము కాదు గాని దైవకృపయే. (II తిమొథి 1 : 12,14; I పేతురు 1:5,9)

నిరీ:-ఇట్టి యమూల్యమైన సొత్తు వారి కంటబడకుండుటవలన అతని కెంత ఆనందము కలిగినదో !

క్రైస్త:-ఆనందమే. ఆదరణగ నేయుండును. గాని ఇతడు దానిని తన ప్రయాణ శేషమునందు సరిగా నుపయోగించలేదట. ఎందుకనగా సొమ్ము పోయినదని మనస్సు క్రుంగి దీని సంగతి మరచి పోయినాడు. మరియు చివరి భాగమున దానిని జ్ఞాపకము చేసికొని ఆదరణ పొంద జూచినను అతని మనస్సునకు ముందున్న దుఃఖపు తలంపులే వచ్చెనట. వాటిచేత అతని కానందము మబ్బు క్రమ్మినట్లయి పోయినదట.

నిరీ:-అయ్యో, నిర్భాగ్యమూర్తి. దీనికతడెంత దుఃఖించెనో గదా !

క్రైస్త:-దుఃఖమా ? దుఃఖము గాకింకేమి యున్నది ! మనకు మాత్రము ఇట్టి పరిస్థితులు సంభవించిన యెడల దుఃఖించమా ? సొమ్ము పోవుటమాత్రమే గాక శరీరమునకుకూడ దెబ్బలు తగిలినపుడు, అదియును దిక్కు లేని మార్గమధ్యమున నిట్లు జరిగినపుడు మనమును దుఃఖించక మానగలమా ? ఇంకను కొంత మేలు.

చింతచే ప్రాణమును విడిచిపెట్ట లేదతడు. పాపము భాగ్యహీనుడు! ఇకనతని ప్రయాణ శేషమంతయు దుఃఖముతోను మూలుగులతోనే ముగించినాడట. అతడు పోవుచు దారిపోడుగునను ఎవరెవరు కనబడినను వారికీ కథయే చెప్పువాడట. తన్నెక్కడ దొంగలు యెట్లుకొట్టిరో యేమేమి దోచికొనిరో, ఎంతెంత దెబ్బలు తినెనో. ప్రాణాపాయ మెట్లు తప్పెనో యివన్నియు బాలవయోవృద్ధు లందరికిని చెప్పుచు పోవువాడట.

నిరీ:-అయితే మరొకటి నాకు చిత్రముగా నున్నది. అదేమనగా. తనకు కలిగినలేమి నుండి తప్పించుకొనుటకు అతని యొద్దనున్న ప్రశస్తమణులను అమ్మివారవేయుటయో లేక కుదువబెట్టుటయో చేయలేదు.

క్రైస్త:-నీవింకను పండ్లూడని పావవలె మాటలాడుచున్నావు. వాటిని తాకట్టుపెట్టి యతడేమి సంపాదించును? ఒకవేళ తాకట్టుపెట్టినను పట్టువాడెవ్వడు? ఇతను దోచబడినదేశమంతటను యీ ప్రశస్త మణులు చిల్లిగవ్వకు సరిగావు. మరియు వాటినమ్ముకొనిసంపాదింపనగు సుఖము అతనికి రుచింపలేదు. ఇంతేగాదు. అవి పోయిన యెడల నిత్యజీవపురము ద్వారమునొద్ద వానికి ప్రవేశముదొరకక నేపోయెడిది. అంతటిగతియే

సంభవించిన యెడల యిట్టి దొంగలు లక్షమంది పెట్టు
బాధకంటె నదియే అతనికి ఘోరమై యుండును.
ఈ సంగతి నత డెరిగియే యుండెను.

నిరీ:-సహోదరుడా, నేనేదియో అంటినని యింత చురుకుగా మాటలాడుచున్నావు. ఏశావు గిన్నెడు జావకొరకు తన జ్యేష్ఠత్వము నమ్ముకొనలేదా? అది యతని కొక రత్నమే గదా? ఆ ఏశావు కన్న యీయల్ప విశ్వాసి ఎక్కువవాడా? (హెబ్రీ 12 : 16.)

క్రైస్త:-ఏశావు తన జ్యేష్ఠత్వము నమ్ముకొనిన మాట నిజమే. అతనివలెనే మరియనేకులు కూడ తమ ముఖ్యమగు దీవెనను పోగొట్టుకొందురు. గాని ఏశావుకును మన అల్ప విశ్వాసికిని భేదమును నీవు కనిపెట్టవలయును. వారి ఆత్మీయ స్థితియందు భేదమున్నది. ఏశావుకు కలిగిన కోరిక శరీర సంబంధమైన ఆకలిని గూర్చినది. వాని కడుపే వానికి దేవుడు. అయితే అల్ప విశ్వాసి శరీరేచ్ఛకు లొంగినవాడు కాడు. అతని కడుపును దేవుడని యతడు తలంచలేదు. తన శరీరేచ్ఛలను తీర్చుకొనుట యేతప్ప తదితరమైనది ఏశావు దృష్టి యందు లేదు. నేను చావసిద్ధమై యుండగా నాకీ జ్యేష్ఠత్వమేల-యని అతడనుకొనెను. (ఆది 25 : 32.) అయితే మన యల్పవిశ్వాసి విశ్వాసము అల్పమైన

దైనను తన కొద్ది విశ్వాసముతోనే అట్టి శరీరేచ్ఛలను విసర్జించి తన యొద్దగల రత్నముల విలువనెరిగి వాటినమ్మ నిశ్చయించలేను. అయితే ఏశావు మాత్రము అమ్ముకొనినాడు. ఏశావుకు విశ్వాసమున్నదని యెక్కడనైనను చదివితివా ? లేదు. కొంచెమైనను లేదు గనుక ఈ మాట సత్యమని నమ్ముము. ఏమనగా : శరీరము నెదిరించి పోరాడుటకు విశ్వాసమనునది లేనియెడల శరీరేచ్ఛయే బలమై గెలుచును. అట్టి యెడల వ్యక్తి తన జ్యేష్ఠత్వమునే గాక, తన ప్రాణమును సమస్తమును కూడ నరకాధికారి యగు సాతానున కమ్ముకొనును. దీని కాశ్చర్యమేమున్నది? అట్టి వారే అడవి గాడిదెవంటి వారని చెప్పబడినది. ఎందుకనగా దాని కాలమందు అడవి గాడిదను మళ్లించగల వాడెవడు ? (యిర్మి 2 : 24) వారి బుద్ధి తమ యిచ్ఛలవైపు మళ్లిన యెడల ఎంతటికైనను సాహసించి ఆ యిచ్ఛలను తీర్చుకొందురు. అయితే అల్పవిశ్వాసి సంగతివేరు. అతని దృష్టి పరలోక సంబంధమైన వాటియందే యున్నది. అతని జీవనాధారము ఆత్మీయ విషయములే. అట్టి వాడు ఒకవేళ తన వజ్రములను వేరొకడు కొనదలచినను అమ్మునా ? అమ్మి తన మనస్సును వ్యర్థమైన వాటితో నింపుకొ

నునా ? ఎవడైనను సొమ్మునిచ్చి దుమ్మునోట గొట్టు కొనునా ? కమ్మని పూదేనెను త్రాగు తుమ్మెద నీచ జలములకు పోవునా ? విశ్వాసహీను లయితే శరీరే చ్ఛల కొరకు తమ సొత్తును తుదకు తమ్మునుకుదువ బెట్టుకొనవచ్చును. గాని విశ్వాసులైతే, కొద్ది విశ్వా సమున్ననుఅది రక్షణార్థమైన విశ్వాసమైన యెడల అట్టి పనికి సమకట్టరు. గనుక సహోదరుడా, యిక్కడ నీవుపొరబడి యున్నావు.

నిరీ:-నిజమే. ఇంతవరకు నేను యోచించనేలేదు. నీవుకొంచెం చురచుర మంటివని నేను కోపగించుకొంటిని.

క్రైస్త:-ఊరకనే అన్యాయకముగా మాటలాడుచున్నా వంటిని గాని నేను కోపపడలేదు. దానికేమిగాని ప్రస్తు తిము మనము తర్కించుచున్న విషయమును యోచిం చవలయును.

నిరీ:-అవును గాని. క్రైస్తవా ! నీవు చెప్పిన యీ దొంగలు ముగ్గురును పిరికిపందలవలె నున్నారు. లేని యెడల యెవరో వచ్చుచున్న సందడి విని వారు పారిపోదురా? అసలు వారినెదిరించుటకు అల్పవిశ్వాసి సాహసించి యుండిన బాగుండును. గట్టిగా పోరాడి చూచి సాధ్య ముగానిచో లొంగుట బాగుండి యుండును.

క్రైస్త:-వారు పిరికి వారనుటకు సందేహమేమియు లేదు గాని ఆపదలో నీ సంగతి నెరుగుట యెదుట వానికి సాధ్య

ముకాము. అల్పవిశ్వాసి సాహసించుట సంగతియా, వాని కసలు సాహసమే లేదు. మొదట కలిగియుబడి చూడవలెనని నీవు చెప్పుచున్న మాట నిజమే. ఆ దుష్టులు దగ్గర లేరు గనుక నీ వింత సులభముగ చెప్పివేయుచున్నావు. గాని వారే నేడిక్కడ నీమీద బడిన యెడల నీవు కూడ కొంచెము సంశయింపక మానవని నా యుద్దేశము. మరి యొక సంగతి కూడ నీవు మరువగూడదు. వారు ఆరితేరిన దారి దొంగలు. మహా అగాధమునకు రాజైనవాడు వీరికి ప్రభువు. వాడు అవసరమైన యెడల నీ దొంగలకు సహాయము వచ్చును. వాడు గర్జించు సింహమువలె తిరుగు చున్నాడు. (I పేతురు 5 : 8) నేను కూడ నీ యల్పవిశ్వాసివలెనె యొకసారి కష్టమునందు చిక్కుకొంటిని. అది నాకు చాల భయంకరమగు అనుభవము. నేను క్రైస్తవుడనుగనుక వీరునాపై బడి నపుడు నేను వీరి నెదిరింప జూచితిని. అయితే యా దొంగలు వారి ప్రభువును పిలచిరి. పిలువగానే వాడును ప్రత్యక్షమయ్యెను. సామెత చెప్పినట్లు నా ప్రాణము గడ్డిపరకకైన గాకుండ పోవలసినదే గాని దైవకృప వలన నా శరీరముపైన శోధన నెదిరించ గల కవచముండెను. అట్లయినను గుండె నిబ్బరము చేసికొని శత్రువుల నెదిరించి నిలువగలుగుట నాకు

చాల కష్టమైనది. ఎందు కనగా వారు నన్ను చుట్టు ముట్టి యుండిరి. గాని ఆ పోరాటమున యనుభవ మున్న వాడే తప్ప అందు మనకు కలుగు పరిస్థితి మరెవ్వడును చెప్ప లేడు.

నిరీ:- అయితే కృపాసమృద్ధుడు వచ్చుచున్నాడని యెరిగి యా దొంగలు పరుగు జూపిరికదా?

క్రైస్త:-నిజమే. పరుగెత్తుట మామూలే. వారును వారి రాజును కూడ పరుగెత్తవలసినదే. ఎందుకనగా కృపాసమృద్ధుడు రారాజు. ఆ స్థానమున శక్తిగల వాడు. అల్పవిశ్వాసికిని ఈయనకును భేదమున్నది. రారాజు ప్రజలందరును వీరులు కారుగదా! అంద రును వీర కార్యములు చేయవలెనన్నను చేయలేరు కదా! పిల్లలందరు గొల్యాతును చంపిన దావీదు వంటి శూరులు కాగలరా? లేగ దూడను తెచ్చి ఆబోతుపై పోరాడింపవచ్చునా? అట్లనే కొందరు మహా బలము గల వారందరును మరి కొందరు దుర్బలకాయులుందురు. కొందరు విశ్వాసమున దిట్ట లుందురు. మరికొందరు అల్పవిశ్వాసులుగా నుందురు. ఇతడు కొంత దుర్బలహృదయుడు గనుకనే భయపడి నాడు.

నిరీ:- గాని కృపాసమృద్ధుడు వారి పని పట్టెడివాడే!

క్రైస్త:-కృపాసమృద్ధుడైతే చెప్పవలయునా, వారికి తగిన శాస్తి చేసియుండును. ఎందుకనగా కృపాసమృద్ధునికి

ఆయుధముల నుపయోగించుట బాగుగా తెలి యును గనుక వారు తనపై బడకముందే కత్తిదూసి వారిని బారెడు దూరమునందుంచి తుదకు వారిని సంహరించి యుండెడి వాడే. గనుక నీ దుష్టులు కృపాసమృద్ధుని చూచినతోడనే కాలికి బుద్ధి చెప్పు దురు. ఎవడైనను అల్పవిశ్వాసివంటి బలహీనుని జూచినగదా వారికి లోకువ.

కృపాసమృద్ధుని చూచిన యెడల అతని ముఖము మీద మానసిగాయపు మచ్చలు చూచి నేను చెప్పినదంతయు సులభముగ నీవు నమ్మనచ్చును. ఈ బలాఢ్యులగు దుర్మార్గులు దావీదునెట్లు మూలుగునట్లును దుఃఖించి యెలుగెత్తి యేడ్చు నట్లు చేసిరో గదా. ( కీర్తన 88 ) మరియు హేమాను హెజ్కియా యను వారు తమ కాలమునందు మిక్కిలి బల సమన్వితులైనను ఈ దుర్మార్గులచేత జిక్కినపుడు ఘోర ముగ పోరాడవలసి వచ్చినది. ఇట్లయినను ఈ దుర్మార్గులు వారి దుస్తులను దులిపి విడిచిపెట్టిరి. పేతురు అపొస్తలుల యందు ఘనుడని చెప్పుదురుగదా, అట్టివాడు సహితము నా బలము చూపుదునని వీరి నెదుర్కొనినపుడు ఒక చిన్న పిల్లకు భయపడవలసి వచ్చినది.

మరియు ని దురాత్ములకు తమరాజు చేరువనే సంచ రించి పిలిచినపుడు పలుకుచుండును. వీరికెప్పుడైన ఓటమి

కలుగునని భయపడినపుడు వాడు వెంటనేవచ్చి సాధ్యమైతే వారికి సహాయపడును. వీనిని చంపుటకొకడు ఖడ్గముదూయుట వ్యర్థమే. ఈటెలైనను బాణములైనను అక్కరకురావు. వాడు యినుమును గడ్డిపోచగాను ఇత్తడిని పుచ్చిపోయిన కర్రగాను యెంచును. బాణము వానిని పారదోలజాలదు. వడిసెలరాళ్లు వానిదృష్టికి చెత్తవలె నున్నవి. దుడ్డుకర్రలు గడ్డిపరకలుగా యెంచబడును. వాడు వడిగా పోవుచుండు ఈటెనుచూచి నవ్వును. (యోబు 41 : 26-29) ఇట్టి పరిస్థితులలో వాని నెవడేమి చేయగలడు? అయితే ఒకటిమాత్రము నిజము. ఒకనికి యోబుయొక్క గుర్రముండి ప్రతిసమయమందును దాని చక్కగా స్వారిచేయ నేర్పుగలిగి యున్నయెడల ఇట్టి అపాయమునందైనను గొప్ప శౌర్యమును చూపవచ్చును. ఎందుకనగా ఆగుర్రము జూలు ఉరుముధ్వనితో కప్పబడినది. అది మిడతవలె గంతులువేయును. దాని నాసికారంధ్రధ్వని భీకరము. మైదానములో అది కాలుదువ్వి తనబలమును బట్టి సంతోషించును. అది ఆయుధధారుల నెదుర్కొనబోవును. అది భయముపుట్టించు దానిని వెక్కిరించి భీతి నొందకుండును. ఖడ్గమునుజూచి వెనుకకు తిరుగదు. అంబులపొదియు తళతళలాడు ఈటెలును బల్లెమును దానిమీద గలగలలాడించ బడినప్పుడు ఉద్దండకోపముతో అది బహుగా పరుగులెత్తును. అది బాకానాదము విని యూరకుండదు.

బాకానాదము వినబడునప్పుడెల్ల అది ఆహాఆహా అనుకొని దూరమునుండి యుద్ధవాసన తెలిసికొనును. సేనాధిపతుల ఆర్భాటమును యుద్ధఘోషను వినును. (యోబు 39:20-25) గాని మనబోటి కాలినడకగల పదాతులకు మాత్రము ఇట్టి శత్రువు నెదుర్కొనవలయునను ఆశకూడదు. ఇతరులు వీరితో చిక్కులుపడిరని వినినపుడు మేమైతే చాల పౌరుషముగా పోరాడియుందుమని ప్రగల్భములు పలుకరాదు. మనశక్తిని జూచి మనముప్పొంగరాదు. ఏమనగా మనమట్టి సంఘటన నెదుర్కొనినపుడు మనకది సాధారణముగా ప్రాణసంకటమై యుండును. నేను ముందు పేర్కొనియున్న పేతురు సంగతి యోచింపుము. అతడు డంబములుమాత్రము పలికెను. నిజమే అతని వ్యర్థమైన హృదయమునుబట్టి ధైర్యపుమాటలు పలికెను. మిగతవారెవరు భయపడి పారిపోయినను తాను మాత్రము ప్రభువు నంటియుందునని ప్రజ్ఞలాడెను. అయితే సీ దుర్మార్గులు కలియబడినపు డతడెంత భీరువై పోయెను. అందరి కన్న ముందితడే ప్రభువు నెరుగనని బొంకెను.

గనుక రారాజు మార్గమునందిట్టి దోపిడీచర్యలు జరిగెనని మనము వినినపుడు రెండుపనులు చేయుట మనకు యోగ్యమైయున్నది. మొదటి దేమనగా మనము జాగరూకులమై ఆయుధములను ధరించి మనతో నొకడాలు పట్టుకొనుట అవసరము. అది లేనియెడల సాతాను నెంతటి దెబ్బ

కొట్టినను వాడు లొంగడు. ఎందుకనగా ఆడాలు మనయొద్ద లేనియెడల వాడు మనకు జడియనే జడియడు. అందుచేతనే యీపోరాటమున నేర్పరియైన పౌలు ఇట్లు చెప్పుచున్నాడు. "ఇవన్నియుగాక మీరు విశ్వాసమను డాలుపట్టుకొనుడి; దానితో మీరు దుష్టుని అగ్నిబాణముల నన్నిటిని ఆర్పుటకు శక్తిమంతులగుదురు" (ఎఫెసి 6 : 16).

మరియు మన ప్రయాణమున మన వెనుక రక్షణ సైన్యమును పంపునట్లు రారాజును వేడుకొనవలెను. సైన్యమే కాదు ఆయనే మన వెనుకవచ్చునట్లు ప్రార్థింపవలయును. ఈ రక్షణ మూలమునచే దావీదు మరణచ్ఛాయ గల లోయలో సంచరించినపుడు కూడ భయపడలేదు. మరియు మోషే మరణించుటకైన సిద్ధపడినాడు గాని తన దేవుడు వెంట రాకుండ ఒక్క అడుగు ముందుకు పోవుటకు సమ్మతింపలేదు. (నిర్గ 33 : 15.) ఓహో సహోదరుడా, ఆయనే మన వెంటవచ్చిన యెడల పదివేల మంది మనమీద పడినను మనము భయపడము. (కీర్తన 3:5–8; 27 : 1–3) గాని ఆయన లేనియెడల బలవంతు లెంతమందియైనను హతులైన వారి క్రింద కూలవలసినదే. (యెషయా 10 : 4.)

నా మట్టుకు నే నింతకుముందు అట్టి పోరాటమున పడితిని. గాని సర్వశక్తుడగు వాని సహాయముచేతనే నేను సజీవుడనై నీతో నిపుడు మాటలాడుచున్నాను గాని అది యెంత

హా స్త్రమును నా బలముచేత కాదు. అట్టి తీవ్ర యుద్ధములు
ఎరెన్నడును నాకు రానియెడల నాకెంత ఆనందముగా
ుండును గాని మన యింకను అపాయమును దాటిగట్టెక్కితి
ని తలంచరాదు. అయినను సింహము నోటినుండియు
లుగు బంటినుంటి నోటినుండియు నన్ను తప్పించి సజీవునిగా
ంచిన ప్రభువే ముందు రాబోవు సున్నతిలేని ఫిలిష్తీయుని
ుండి కూడ రక్షించునని నిరీక్షించుచున్నాను.

1, అల్ప విశ్వాసయ్యా, నీవు దొంగల చేతిలో బడినావు
పాపిష్టి మూకలు దోపిడి గాండ్లు దోపిడి జేసి పరుగెత్తినారు
మీరు కూడ విశ్వాసులారా పోరాడవలె దొంగల తోడ
విశ్వాసమనే డాలు లేకున్న గెలిచెదమన్న మాటయె సున్న
విశ్వాసమనే డాలుమీకుంటే అదియే డాలులన్నింటికంటె
పదివేలమస్తు మీమీద బడిన భయమే లేదు యేనాటికైన.

# ఇచ్ఛకాల మారియను వాని వల

అట్లు వారు పోవుచుండగా వారి వెనుకనే అజ్ఞాని
వచ్చుచుండెను. కొంతదూరము వచ్చుసరికి వారి మార్గమును
కలిసియే వేరొక మార్గము వారికనబడెను. అదియును. రాజ
మార్గమువలెనే తిన్నగను సరాళమును కనబడుచుండెను.
ఈ రెండిటిలో నేది చేపట్టవలయునో వారికి తోచలేదు. అందు

చేత యోచించుచు వారక్కడ నిలచిపోయిరి. ఇట్లు వారు మార్గమును గూర్చి ఆలోచించుచుండగా తెల్లని దుస్తులు ధరించిన నల్లని వాడొకడు వారియొద్దకు వచ్చెను. వారక్కడ నిలిచియున్న కారణమేమని యాతడు మన యాత్రికుల నడిగెను. తాము పరమపురికి పోవుచుంటిమనియు, అక్కడ నున్న రెండుమార్గములలో నేది చేపట్టవలయునో తెలియక నిలుచుంటిమనియు యాత్రికులు జవాబిచ్చిరి. అంతనా నూతన వ్యక్తి యిట్లనెను. నావెంట రండు. నేనును అక్కడికే పోవుచున్నాను.

అంతట వారతని వెనుక ననుసరించి నడువసాగిరి. వారు పోవుచున్న యీ మార్గము నెమ్మది నెమ్మదిగా నిత్యజీవపురమునుండి తప్పించినందున వారి దృష్టియిక పరమపురి మీాద లేదు. అట్లే వీరా నూతన వ్యక్తి ననుసరించి పోవుచుండిరి. ఇట్లు వాడు నెమ్మదిగా నడిపించుకొనిపోయి వీరికి తెలియకుండా నొక చిక్కులు పెట్టు వల మధ్యకు తీసికొని పోయి వారిని విడిచి పెట్టెను. అంత చేయునది లేక క్రైస్తవుడును నిరీక్షణ చిత్తుడును ఒకని ముఖము నొకడు చూచుకొనిరి. వెంటనే యా నల్లని వానిమీాద కప్పబడియున్న ధవళవస్త్రము పడిపోయినందున వాని నిజస్వభావము తెలియవచ్చెను. మోసమున బడితిమని యాత్రికు లిప్పుడు గ్రహించిరి. వారు ఆ వలనుండి తప్పించుకొన లేక క్రిందబడి కేకలు పెట్టి దుఃఖించిరి.

అంతట క్రైస్తవుడు నిరీక్షణచిత్తునితో నిట్లనెను: ఇప్పు డుగదా, నా పొరపాటు నా కెరుకబడినది! ఇచ్ఛకాల మారి యనువానిగూర్చి జాగ్రతపడుడని గొర్రెలకాపరులు మనకు చెప్పలేదా? 'తన పొరుగువానితో ఇచ్ఛకములాడు వాడు వాని పట్టుకొనుటకు వలవేయువాడని' పెద్దలు చెప్పు దురుగదా. (సామె 29 : 5) మనపని నేడిట్లే జరిగినది.

నిరీ :–ఇంతేగాక మనము దారితప్పకుండ గుర్తించునట్లు మనకు మార్గదర్శి పత్రికనుకూడ వారిచ్చిరిగదా! దానిని చూచి దారి తెలుసుకొనుట మనము మరచితిమి. అందుచేతనే నాశకునిదారిలో చిక్కుబడితిమి. ఈ విష యము నందు దావీదు మనకంటె బుద్ధిమంతుడై యున్నాడు. ఎందుకనగా: 'మనుష్యుల కార్యముల విషయమైతే బలాత్కారుల మార్గములు తప్పించు కొనుటకై నీనోటి మాటనుబట్టి నన్ను నేను కాపాడు కొని యున్నాను.' అని చెప్పుచున్నాడు (కీర్త 17:4)

ఇట్లు వారిద్దరు దుఃఖించుచు వలలో పెనుగులాడు చుండిరి. ఇంతలో చేతియందు త్రాళ్ళకొరడాను చేతపట్టిన యొక ప్రకాశవంతుడు తమయొద్దకు వచ్చుచున్నట్లు వారికి కనబడెను. అతడు వారిని సమీపించినపుడు మీరెవరు? ఇక్కడ యెందుకుంటిరి? యని వారిని ప్రశ్నించెను.

తాము భాగ్యహీనులగు యాత్రికులమనియు, సియో నుకుపోవుచు తెల్లనిదుస్తులు ధరించిన నల్లనివానిచే తోవ

తప్పించబడి అక్కడ వలలో పడితిమనియు వారతనికి జవా బిచ్చిరి. అందుకు కొరడానుపట్టుకొన్న యాతడు చెప్పిన దేమనగా: మిమ్మును మోసగించినవాడు ఇచ్ఛకాలమారి. వాడు దొంగ అపొస్తలుడు. వెలుగు దూతవేషమున వచ్చిన దుష్టుడు. (దాని 11 : 32; II కొరిం 11 : 13, 14)

అంతట నాపుణ్యమూర్తి వలను ఛేదించి యాత్రికు లను విడిపించెను. మరియు నేను మీమార్గమున తిరిగి మిమ్మును నిలుపుదును నన్ను వెంబడించుడని వారితో చెప్పెను. అప్పుడు ఇచ్ఛకాలమారి నడిపించిన మార్గమున మరల వెను కకు వారిని నడిపించి తిరిగి రాజమార్గమున నిలిపెను. అంత ప్రకాశవంతునికిని యాత్రికులకును ఈ క్రింది సంభాషణ జరిగెను.

ప్రకా:–మీరు గతరాత్రి యెక్కడ విశ్రమించిరి ?

యాత్రి:–ఆనందపర్వతముల మీద గొర్రెల కాపరులతో విశ్రమించితిమి.

ప్రకా:–మీరు మార్గమును తప్పకుండునట్లు వారు మార్గ దర్శి పత్రిక నియ్యలేదా ?

యాత్రి:–ఇచ్చిరి.

ప్రకా:–మరి మీరు దాని చూచుకొనుచు నడువ లేదా ?

యాత్రి:– లేదు.

ప్రకా:–ఎందుచేత ?

యాత్రి —మరచితిమి.

ప్రకా:—ఇచ్ఛకాలమారిని గూర్చి కాపరులు హెచ్చరించ లేదా?

యాత్రి:—బహులుగా హెచ్చరించిరి. గాని ఇంత చక్కగా మాటలాడుచున్న వీడు యిచ్ఛకాలమారి యని మేము తలంచనే లేదు. (రోమా 16 : 17,18).

అంతట నేను చూచుచుండగా ప్రకాశవంతుడువారిని వీపు నొగ్గుడని చెప్పి కొరడాతో గట్టిగా దండించి వారు నడువ వలసిన మార్గమును మరల బోధించెను. (ద్వితియో 25 :2; II దినవృ 6 : 27) మరియు వారి నతడు దండించుచు నిట్లనెను: 'నేను ప్రేమించు వారి నందరిని గద్దించి శిక్షించుచున్నాను గనుక నీవు ఆసక్తి గలిగి మారు మనస్సు నొందుము.' (ప్రక 3 : 19) ఇట్లు వారిని సాగనంపి కాపరు లిచ్చిన మిగిలిన సలహాలను మరువ వద్దని హెచ్చరించెను. గనుక వారతని మహాకృప కొరకు ప్రకాశవంతుని స్తుతించి తమ దారిని పోవుచు కొన్ని పాటలు పాడుకొనిరి.

## నాస్తికుడు యాత్రికులను కలసికొనుట

అంతట మార్గమునందు ఒంటరిగా నడచివచ్చుచున్న నాస్తికుడు దూరమునందు యాత్రికులకు కనబడెను. అతడు

వారికెదురుగా నడచి వచ్చుచుండెను. క్రైస్తవు డతనినిచూచి అదిగో సియోనుకు విముఖుడై పోవుచున్నవానిని చూచితివా? అతడు మనకెదురు వచ్చుచున్నాడని నిరీక్షణ చిత్తునితో ననెను?

నిరీ:—అదిగో కనబడుచున్నాడు. వీడుకూడ ఇచ్ఛాకాలమారియే నేమో జాగ్రత్తపడుదము.

అంతట వాడు దగ్గరకువచ్చెను. వానిపేరు నాస్తికుడు. మీరెక్కడకు పోవుచుంటిరని వాడు యాత్రికుల నడిగెను. సియోను పర్వతమునకని వారు జవాబిచ్చిరి. అంత నాస్తికుడు కడుపు బ్రద్దలగునట్లు నవ్వసాగెను.

క్రైస్త:—నీనవ్వునకు భావమేమి?

నాస్తి:—మీరెంత యజ్ఞానులో గదాయని నవ్వుచున్నాను. ఇంతటి కష్టమైన ప్రయాణమును తలపెట్టినను మీకు శ్రమతప్ప వేరొక ఫలితముండదుగదా!

క్రైస్త:—ఇదేమయ్యా, మమ్ములనక్కడ ప్రవేశింప నియ్యరనియా నీభావము?

నాస్తి:—ప్రవేశమా! మీరనుకొన్న ఆస్థల ముండినగదా ప్రవేశముండుట? ఆస్థలము మిథ్యయే, ప్రవేశము అంతకన్న వట్టిది. అట్టిదీ లోకములో లేదు.

క్రైస్త:—గాని రానున్నలోకములో లేదా?

నాస్తి:—నాదేశమునం దుండగా మీరు చెప్పుచున్న ఈరకము గు మాటలనే వింటిని. విని దానిని చూడవలెనని

బైలుదేరితిని. గత యిరువది సంవత్సరములనుండియు వెదకుచునే యుంటినిగాని అప్పుడెంత చూచితినో ఇప్పుడును అంతే చూచుచున్నాను. (ప్రసంగి 10:15; యిర్మి 17 : 15)

క్రైస్త:-అట్టి స్థలమున్నదని మేమువింటిమి. దానిని విశ్వసించుచున్నామే!

నాస్తి:-నేనుమాత్రము నమ్మలేదా? నాయింటియొద్ద నుండగా నేనుకూడ నమ్మినందువలననే యింతదూరము వచ్చియుంటినిగాని మీకంటే ముందుగా చాలదూరము పోతినిగాని అట్టిదెక్కడను కనబడలేదు. గనుక డొంకలోనున్న నెమలికంటె చేతిలోనున్న తిత్తిరిమేలని నేనేదియో దొరకునని బుద్ధిహీనుడనై విడిచివచ్చిన సుఖముల ననుభవించుటకై మరల పోవుచున్నాను.

అందుకు క్రైస్తవుడు నిరీక్షణ చిత్తునివైపు తిరిగి యితడుచెప్పుమాటలు సత్యమేనా? యని అడిగెను.

నిరీ:-జాగ్రత్త, వీడును ఇచ్ఛకాలమారి వంటివాడే. ఇట్టివాని మాట మునుపు విని మన మెట్లుచెడితిమో జ్ఞాపకము చేసికొనుము. ఏమి, సియోను పర్వతము లేదా? ఆనంద పర్వతముల మీదినుండి మనము నిత్య జీవపురముగ విని చూడలేదా? అయ్యో, మన మిప్పుడు విశ్వాస మూలమున నడచి పోవద్దా?

(2 కొరింథీ 5 : 7) నడిచి పోదము రమ్ము లేనియెడల కొరడా శిక్షించువాడు మరల మనలను గద్దించుటకు రావచ్చును, జ్ఞానమార్గమునుండి మనలను తప్పించు దురుపదేశమును మనము వినరాదు. నీవునాకు చెప్ప వలసినది నేను నీకు బోధింపవలయునా. గనుక వీని యుపదేశమును లక్ష్యపెట్టవద్దు. ఆత్మను రక్షించు కొనుటకు విశ్వాసము కలిగినవారమై యుందము. (హెబ్రీ 10 : 39)

క్రైస్త:-సహోదరుడా, మన విశ్వాసమునుగూర్చి అపనమ్మ కముచేత నేనాప్రశ్న వేయలేదుగాని నిన్ను పరీక్షించుటకును నీ హృదయమునందు దీనివిషయమై యేమి తలంచుచున్నావో తెలిసికొనుటకును నే నిట్లడిగితిని. వీనిసంగతి యేమందువా, వీడీ లోకాధిపతివలన గ్రుడ్డితనమును పొందినవాడు. మనము సత్యము నెరిగిన వారము, మరియు సత్యమునం దేవిధమైన కళంక మును లేదుగనుక మనము ముందుకు సాగిపోవుదము. (I యోహాను 2 : 21)

నిరీ:-ఇప్పుడు నేను దేవుని మహిమనుగూర్చి నిరీక్షణగలవాడనై ఆనందించుచున్నాను.

అంతట వారా మనుష్యుని విడిచిపెట్టి తమదారిని పోయిరి. వాడుమాత్ర మక్కడనే పిచ్చినవ్వు నవ్వుచు ంలబడిపోయెను.

# మంత్రభూమి

అంతట నేను చూచుచుండగా వారు నడచి నడచి ఒకానొక దేశమునకు వచ్చిరి. ఆ దేశమునం దెవడైనను తెలియక ప్రవేశించినయెడల అందలి వాయువు వానికి నిద్ర మత్తును కలిగించును. ఈస్థలమునందు నిరీక్షణచిత్తునికి మంద బుద్ధిగలిగి నిద్రవచ్చుటకు మొదలిడెను. అందుకతడు క్రైస్తవు నితో నిట్లనెను: నాకు చాల నిద్రమత్తుగా నున్నదిగనుక మనమిక్కడ కొంచెము విశ్రమించి చిన్నకునుకు వేయుదమా?

క్రైస్త:-అది కూడనేకూడదు. నిద్రించినయెడల మనము తిరిగి మేలుకొనుట కుదరదేమో!

నిరీ:-అదేమి? అలసినవానికి నిద్ర మధురమైనది గదా? మన మొక్కింత నిద్రించినయెడల శ్రమతగ్గి మనము సేద దేరవచ్చును.

క్రైస్త:-మంత్రభూమిని గూర్చి జాగ్రత్తపడుడని ఆకాపరులలో నొకడు మనకు చెప్పలేదా? అనగా మనము నిద్రించ రాదనియే అతడిచ్చిన సలహా. 'కావున యితరులవలె నిద్రపోక మెళకువగాఉండి మత్తులముకాక యుందము' (1 థెస్స 5 : 6)

నిరీ:-నా యోచన పొరబాటని ఒప్పుకొనుచున్నాను. నేనొం టరిగా నిక్కడకు వచ్చినయెడల నేను నిద్రించి మర ణమై యుందునుగదా! అందుచేతనే 'ఒంటిగాడై

యుండుటకంటె యిద్దరు కూడియుండుట మేలు' అని జ్ఞాని చెప్పియున్నాడు. (ప్రసంగి 4:9) ఇంతవరకును నీ సహవాసముచేత నేను మేలుపొందితిని. గాని నీవు చేసిన మేలుకు నీకు ప్రతిఫలముండును.

క్రైస్త:-సరియేగాని మనకీచోట నిద్రమత్తు కలుగకుండునట్లు మంచి సంభాషణచేయుట మంచిది.

నిరీ:-నాకును అదియే మహాసంతోషము.

క్రైస్త:-ఏ విషయమునుగూర్చి మాటలాడుకొందము?

నిరీ:-ఏవిషయ మేమున్నది, దేవుడు మనకుచేసిన మహాకార్యములను గూర్చియే మాటలాడుకొందము.

క్రైస్త:-మంచిది, గాని మొదట నీకొక పాటపాడి వినిపింతును.

నిద్రమత్తునందు తూలు భక్తులార రండి, రండి
భద్రముగ మాసంభాషణను బాగుగ వినిపొండి, రండి
యాత్రికులమగుమాదుసలహామాత్ర మేవిని మేలుపొంది
రాత్రికావిది కండ్లుతెరచి, రాజమార్గమునందు పొండి
పరిశుద్ధులసహవాసమెపుడు పరమయోగ్యమైనమందు
నరకబాధ నిద్రలనుండి నరులను తప్పించుమందు.

# నిరీక్షణచిత్తుడు మార్పునొందిన సంగతి చెప్పుట.

అప్పుడు క్రైస్తవు డిట్లనెను. నీవీ మార్గమున మొదట చ్చుట యెట్లు తటస్థించినది ?

ీ:-అనగా నాయాత్మను గూర్చిన జాగ్రత్త నాకు మొదట యెట్లు కలిగినదనియా నీ ప్రశ్న ?

స్త:-అవునదియే నా భావము.

ీ:-మా పట్టణపు మాయ సంతలో అమ్మబడుననియు, కనబడు నట్టివియునగు సరకుల యందు నేను చాలకాలము ఆనందించుచు వచ్చితిని. వాటియందే నేనింకను మునిగియున్న యెడల నన్నవి నిత్యనాశనమునకును మరణమునకును నడిపించి యుండునని నేనిప్పుడను కొనుచున్నాను.

స్త:-ఆ సరకు లేవివై యుండును ?

రీ:-లోక భాగ్యములును సమస్తమైన సంపదలును. ఆత్మను నశింపజేయు కలహము, భోగేచ్ఛ, త్రాగుడు, దుర్భాషలు, బూతులు, అబద్ధములు, అపవిత్రత, సబ్బాతును మీరుట మొదలగువాటి యందు నే నానందించుచుంటిని. అయితే నీ మాటలును, హతసాక్షియైన మన ప్రియుడగు విశ్వాసి మాటలును వినిన

ప్పుడును వాటిని యోచించినపుడును నేననుభవించు చుండిన లోకవిషయముల అంతము మరణమే యని నేను గ్రహించితిని. (రోమా 6 : 21-23) మరియు వీటిని బట్టియే దేవుని యుగ్రత అవిధేయులైన వారి మీదికి వచ్చునని గ్రహించితిని. (ఎఫెసీ 5 : 6)

క్రైస్త:-అయితే నీకిట్టి గద్దింపు వెంటనే కలిగినదా ?

నిరీ:-లేదు పాపము చెడ్డదని మొదట ఒప్పుకొనుటకు నాకు మనస్కారము లేదు. అట్టి పాపము చేత కలుగు మరణమును కూడ మొదట నేను గ్రహింపలేదు. అయితే దేవుని వాక్యము నా హృదయమును కదలించ నారంభించినపుడు మొదట ఆవాక్య తేజస్సునకు నా కండ్లు మూసుకొనుటకే నేను పెనుగులాడి ప్రయత్నించితిని.

క్రైస్త:-అయితే దేవుని యాత్మ నీయందిట్లు పని చేయుచుండగా నీవిట్లు ప్రవర్తించుటకు కారణమేమి ?

నిరీ:-కారణములు చాల గలవు. 1. ఇది దేవుడు నాయందు జరిగించుచున్న పని యని అప్పుడు నాకు తెలియ లేదు. హృదయమునందు పాపభీతిని మొదట కలిగించి మానవుని హృదయమును దేవుడు మార్చునని నే నెరుగకుంటిని. 2. మరియు పాపమింకను నా హృదయమునకు మధురముగనే యుండెను. గనుక దానిని విడిచి పెట్టుట నాకు మనస్కారము లేదు. 3. మరియు

నాపాత స్నేహితుల మాటలును చెలిమియు నాక
త్యంత ప్రియముగ నుండినందున వారిని విడుచుట
యెట్లో నాకు తెలియలేదు. 4. నాకు పశ్చాత్తాపము
కలిగిన సమయములందు నా హృదయ మెంతయో
బాధగా నున్నందున వాటిని తలంచుటకైనను నాకు
శక్తి లేకుండెడిది.

స్త:-గాని అప్పుడప్పుడు నీ కష్టమును జయించ గలుగు
చుంటివా ?

:-నిజమే. అప్పుడప్పుడు జయించు చుంటిని గాని తిరిగి
ఆ బాధ నా మనస్సుకు మరల వచ్చుచుండెడిది.
ఆ సమయములందు అంతకు ముందు కంటె మరింత
పాడైన స్థితిలో పడుచుంటిని.

స్త:-నీకు మరల పాపభీతి, పశ్చాత్తాపము కలిగించిన
విషయములేవి ?

:-చాల యున్నవి.

1. వీధియందు సత్పురుషు నెవనినైన చూచినను,
2. ఎవడైన బైబిలు చదువుట వినినను,
3. నా తలనొప్పి మొదలు బెట్టినను,
4. నా బంధువు లెవరైన జబ్బుపడిరని విన్నను,
5. ఎవరైన చనిపోయినట్టు గుడిగంట వినబడినను,
6. నేనే చనిపోవుదునని భయము కలిగినను,

7. ఇతరులెవరైన హఠాత్తుగా మరణించిరని నేను విన్నను,

8. మరియు ముఖ్యముగా నన్ను గూర్చి నేను యోచించుట మొదలు బెట్టినను, నేను తీర్పులోనికి పోవలసి నదని తలంచినను, ఈ సమయము లందెల్లను నేను మరలపాప భీతియందు పడి గుణపడుచుండు వాడను. మిగత సమయము లందు మామూలే.

క్రైస్త:-ఇట్టివి కలిగి నపుడెప్పుడైన నీవు సులభముగా పాపపు డాగును నిర్మూలించుకొన గలిగితివా!

నిరీ:-లేనేలేదు. ఆ సమయములందీ తలంపులు నా మనస్సాక్షిని బాగుగాగద్దించి మరింత బాధకరముగనుండెడిది.

క్రైస్త:-అట్టి సమయములందు నివేమి చేసెడివాడవు?

నిరీ:-నాజీవితమును మార్చుకొన వలయునని నిశ్చయించు కొనుచుంటిని. లేనియెడల నేను నిత్యనాశనమునకు పోవలయునని అనుకొను చుండెడివాడను.

క్రైస్త:-అప్పుడు నీజీవితమును మార్చుకొన యత్నించితివా?

నిరీ:-యత్నించకేమి, పాపముల నుండియేగాక పాపపు సహవాసమునుండి కూడ పారిపోయెడివాడను. అప్పుడు మతవిషయములలో పనిగలిగి యుండసాగితిని. ప్రార్థించుట, వాక్యము చదువుట, పాపములకొరకు దుఃఖించుట, పొరుగువారితో సత్యము పలుకుట మొదలగు

పనులను చేయుచుంటిని. ఇవియును మరియు ననేక సత్కార్యములను చేసితిని. వాటినికూడ చెప్పుటకు సమయము లేదు.

స్త్ర:–అట్టి సమయములందు నీసత్ప్రవర్తన విషయమై నీకు సంతృప్తి కలుగుచుండెడిదా?

– కొద్దికాలము కలుగుచుండెడిది. గాని నేనెంత సంస్కారణజీవితము జీవించినను నా హృదయభారము తిరిగి నామీదికి మరల వచ్చుచుండెడిది.

స్త్ర:–అయితే నీకిప్పుడున్న సంపూర్ణమైన మార్పు యెట్లు వచ్చినది?

:– నాకిట్టి మార్పు తెచ్చిన విషయము లనేకములున్నవి. ముఖ్యముగా ఈమాటలు: మన నీతిక్రియలన్నియు మురికిగుడ్డవలె నున్నవి. (యెష 64 : 6) ధర్మశాస్త్రమును నెరవేర్చుటచేత యెవడును నీతిమంతుడుగా తీర్చబడడు. (గలతీ 2 : 16) మీరు మీకాజ్ఞాపింపబడినవన్నియు చేసి తరువాత నిష్ప్రయోజకులమయిన దాసులమని అనుకొనవలెను. (లూకా 17 : 10) ఇట్టి వనేక వాక్యములు నామనస్సునకు మార్పు తెచ్చినవి. వీటినిబట్టి నాలో నేనిట్లు తర్కించుకొన సాగితిని: నిజముగా నీ వాక్యములనుబట్టి చూడగా ధర్మశాస్త్ర సంబంధమైన కార్యములచేత మనకు పర

లోకము దొరకదుగదా! మరియు నే నిట్లనుకొంటిని: ఒకడొక షాహుకారునకు వెయ్యిరూపాయలు బాకీ పడినయెడల వీడెంత కష్టపడినను ఆబాకీ తీరకపోతే వీనిగతియేమి? ఆ షాహుకారు వీనిని ఖైదున వేయుంచునుగదా!

క్రైస్త:-ఈపోలిక నీకెట్లు సరిపుచ్చుకొంటివి?

నిరీ:- సరిపోకేమి! నే నిట్లనుకొంటిని. నా పాపములచేత దేవునికి చాల బాకీపడితిని. నేనెన్ని మంచికార్యములు చేసినను ఆబాకీ దేవుని గ్రంథమునుండి తుడుపు పెట్టించుకొనలేను. గనుక నేనెన్ని సత్కార్యములు చేసినను దేవునికి నేనింకను ఋణస్థుడనే. నా పూర్వ పాపములచేత నేను తెచ్చుకొన్న మరణశిక్షనుండి నేనెట్లు తప్పించుకొనగలను?

క్రైస్త:-చక్కగా యోచించితివి. తరువాత!

నిరీ:- ఇంతేగాక మరొకవిషయము నన్ను బాధించినది. నేను జీవితము మార్చుకొనినను నేను చేయు సత్కార్యములను జాగ్రత్తగా పరీక్షించిన యెడల అందింకను పాపమున్నదనియు క్రొత్తపాపము కలియుచునే యున్నదనియు గ్రహించితిని. గనుక ప్రస్తుతము నేనెంత మంచిగా జీవించినను గత కాలమందు ఒక్క దినమున చేసిన పాపము నన్ను నరకమున త్రోయుటకు సరిపోవునని నేను తెలిసి కొంటిని.

క్రైస్త:-అంతట నీ వేమి చేసితివి?

నిరీ:-చేయుట కేమున్నది. ఏమి చేయను తోచక నా హృదయభారమును విశ్వాసి కెరిగించితిని. ఎందుకనగా మా కిద్దరకును మంచిపరిచయముండెను. అతడు చెప్పిన దేమనగా: పాప మెన్నడును యెఱుగని నీతిమంతుని నీతి పొందవలయునె గాని, నా నీతి యైనను లోకమందలి సమస్తజనుల నీతియైనను నీ కేమియు లాభము లేదని విశ్వాసి చెప్పెను.

క్రైస్త:-మరి నీవతని మాట నమ్మితివా?

నిరీ:-నావినోదములలో మునిగిఆడుచున్నప్పుడైతే యీమాట నమ్మక విశ్వాసిని బుద్ధిహీనుడని విడిచిపెట్టెడివాడనే. గాని యిప్పుడైతే నా బలహీనతను నేనెరిగి యున్నందునను, నా సత్ప్రవర్తన యంతటి యందును పాపమలినమంటి యున్నందునను అతని మాట నమ్ముట నాకు తప్పని సరియైనది.

క్రైస్త:-అయితే విశ్వాసి చెప్పినట్లు పాపమెన్నడును యెరుగని నరుడొకడున్నాడని నీవు నమ్మితివా?

నిరీ:-నిజమే, అతని మాటలు నాకు చిత్రముగనే వినబడెను. గాని అతనితో మరింత సంభాషణయు సహవాసమును చేసిన పిమ్మట అతని మాటలు నిజమని నమ్మితిని.

క్రైస్త:-మరి యీ పాపగహితుడైవనో ఆయన నీతిని పొందుట యెట్లో విశ్వాసి నడిగితివా ?

నిరీ:-అడిగితిని. ఆయనే సర్వశక్తుడగు తండ్రికుడిచేతి వైపున కూర్చుండి యుండు యేసు ప్రభువని విశ్వాసి చెప్పెను. (హెబ్రీ 10 : 12, 21) మరియు ఆయన తన శరీర మునందుండగా నాకై చేసిన ప్రాయశ్చిత్తమును నమ్మిఆయన సిలువపై చేసిన తన శరీరయాగమునందు విశ్వసింపవలెనని విశ్వాసి చెప్పెను. (రోమా 4 : 5; కొలస్సీ 1 : 14; I పేతురు 1 : 19.) అయితే ఆయన నీతి దేవుని యెదుట మనలను నిర్దోషులనుగా తీర్చుటకు దానియందున్న శక్తి యేమి అని నేనడిగితిని. అందు కతడు చెప్పిన దేమనగా యేసుప్రభువు శక్తిగల దేవుడనియు, ఆయన చేసిన దంతయు అనగా మరణముకూడ తన కొరకు కాదు గాని నా కొరకే నేను ఆయన యందు విశ్వసించిన యెడల ఆయన పుణ్యమును ఆయన చేసినదంతయు నా పక్షమున లెక్కకు వచ్చునట.

క్రైస్త:-అప్పుడు నీవేమి చేసితివి ?

నిరీ:- నేను నమ్మిన నమ్మవచ్చును గాని ఆయనకు నన్ను రక్షించుట కిష్టముండవద్దాయని అడిగితిని.

క్రైస్త:-దీనికి విశ్వాసి నీతో నేమనెను ?

నిరీ:- ఆయన యొద్దకు వెళ్ళి చూడుమని చెప్పెను. అయితే అది వట్టి భ్రమయేమో అని నే నంటిని. కాదని విశ్వాసి చెప్పెను. మరియు ఆయన నన్ను పిలచుచున్నాడని చెప్పెను. (మత్త 11 : 28) అప్పుడతడు క్రీస్తుప్రభుని గ్రంథ మొకటి నాకిచ్చి తన మాటయందు నేను విశ్వసించునట్లు ఆయనే దాని రచింపజేసెనని చెప్పెను. మరియు భూమ్యాకాశములు నశించినను ఆ గ్రంథమునందలి ఒక్క పొల్లయినను నాశనము కాదని చెప్పెను. (మత్త 24 : 35.) మరి ఆయనను సమీపించి నపుడు నేనేమి చేయవలెనని యడుగగా మోకాళ్ళపై నిలచి ప్రార్థింపవలెననియు (కీర్త 95 : 6; దాని 6 : 10) నా పూర్ణహృదయముతోను పూర్ణాత్మతోను ప్రార్థింపవలెననియు (యిర్మీ 29 : 12,13) అప్పుడు తండ్రియైన దేవుడు తన్ను తాను నాకు బయలు పరచుకొనుననియు చెప్పెను. నా విన్నపము నాయన కెట్లు తెలియజేయ వలయునని కూడ నేనడిగితిని. నీవు మాత్రము వెళ్లుము ఆయన నిరంతరమును తన కృపాసింహాసనము మీద కూర్చుండి ఆయన యొద్దకు వెళ్ళు ప్రతివానికిని క్షమాపణను పాప పరిహారమును అనుగ్రహించుచుండునని చెప్పెను. (నిర్గమ 25 : 22; లేవీ 16 : 2; సంఖ్యా

7 : 89; హెబ్రీ 4 : 16.) నే నాయన యొద్దకు వెళ్ళి ఏమి చెప్పవలెనని విశ్వాసి నడిగితిని. ఈలాగు చెప్పుమని విశ్వాసి నాకు సారాంశము నెరిగించెను: దేవా పాపినైన నన్ను కరుణించుము. క్రీస్తుప్రభు నెరిగి ఆయన యందు విశ్వసించుట నాకు నేర్పించుము. ఎందుకనగా ఆయన నీతివంతుడును, తన నీతిని నా కనుగ్రహించువాడును గనుకనే నేను జీవించగలను. లేని యెడల నేను నాశనము పొందవలసిన వాడనే. తండ్రీ నీవు కృపాసమృద్ధి గలవాడవని వింటిని. లోక రక్షణ కొరకు నీ కుమారుడగు క్రీస్తుప్రభువును ప్రతిష్ఠించితివనియును వింటిని. ఆయనను నా వంటి ఘోర పాపులకు బయలు పరచుదువని కూడ వింటిని. నేను నిజముగా పాపినే. ప్రభువా, ఈ సమయమున నన్ను కరుణించి నా యాత్మను రక్షించి నీ కృపను విస్తరింపజేయుమని నీ కుమారుడగు యేసుప్రభువుద్వారా వేడుకొను చున్నాను. ఆమెన్. ఈ మాటలను విశ్వాసి నాకు నేర్పించెను.

క్రైస్త:-మరి విశ్వాసి చెప్పినట్టు చేసితివా?

నిరీ :- చేసితిని. పదేపదే అనేకసారులట్లు చేసితిని.

క్రైస్త:-అప్పుడు తండ్రి యేసుప్రభువును నీకు బయలుపరచెనా?

నిరీ :- లేదు. మొదటిసారి యీభాగ్యము నాకు కలుగలేదు. రెండవసారి లేదు. మూడవసారియును లేదు. తుదకు ఆరవసారికూడ నాకేమియు ఆత్మశాంతి కలుగలేదు.

క్రైస్త:-అంతట నీవేమి చేసితివి?

నిరీ:- ఏమిచేయను నాకు తోచలేదు.

క్రైస్త:-మరి ప్రార్థన విడిచిపెట్టవలయునని నీకు బుద్ధిపుట్ట లేదా?

నిరీ:- ముమ్మాటికీ ఆ బుద్ధియే గట్టిగా పుట్టినది.

క్రైస్త:-అయినను నీవు ప్రార్థన విడువలేదేల?

నిరీ:- నేను వినినసంగతి దృఢముగా నమ్మితిని. అనగా క్రీస్తు నీతితప్ప లోకములో నన్ను మరేదియు రక్షింపనేరదని నమ్మితిని. దీనిని విడిచిపెట్టినయెడల నేను మరణింతును. మరణమైనను కృపాసింహాసనము దగ్గరనే దొరకిన మంచిదిగదాయని నేననుకొంటిని. 'ఆ దర్శనము ఆలస్యముగా వచ్చినను దానికొరకు కనిపెట్టుకొని యుండుము, అది తప్పక జరుగును, జాగుసేయక వచ్చును' అనుమాటలు నా మనస్సునకు వచ్చెను. (హబక్కూకు 2 : 3) గనుక తండ్రి తనకుమారుని నాకు బయలుపరచు వరకును ప్రార్థించుచునేయుంటిని.

క్రైస్త:-ఆయన నీకెట్లు బయలుపరచబడెను?

నిరీ:- నా శరీరనేత్రములతో నే నాయనను చూడలేదుగాని నా మనోనేత్రము వెలిగింపబడినందున నా హృదయము

ముతో ఆయనను చూడగలిగితిని. (ఎఫెసి 1:18,19) అదెట్లు జరిగెననగా: ఒకనాడు నేను చాల దుఃఖము నందుంటిని. నా జీవితమునం దెన్నడును లేనంత విచారమా దినమందు నాకుండెను. ఈ దుఃఖమెందుకు కలిగినదనగా నాపాపము ఘోరమైనదనియు, భరింప లేనిదనియు మరల ఒక్కసారి నా హృదయమున గ్రహించుటచేతనే. అప్పుడు నాకిక నరకమును నిత్య నాశనమును తప్పవని నా యాత్మనుగూర్చి నిరాశ చెందియుండగా హఠాత్తుగా యేసుప్రభువు పరలోకమునుండి నావైపు చూచుచున్నాడని నేను తలంచితిని. 'ప్రభువైన యేసుక్రీస్తునందు విశ్వాసముంచుము. అప్పుడు నీవు రక్షింపబడుదువు' అనుమాట లాయన నోటినుండి నాకు వినవచ్చెను. (అపొ 16 : 31) అప్పుడు, ప్రభువా నేనుపాపిని! ఘోరపాపిని!! అని నేనరచితిని. అందుకాయన 'నాకృప నీకుచాలును' అని జవాబిచ్చెను. (II కొరింథి 12 : 9) అప్పుడు నేను, 'ప్రభువా, విశ్వాసమనగా నెట్టిది?' అని ప్రశ్నించితిని. అంతట నాయొద్దకు వచ్చువాడెన్నటికిని ఆకలిగొనడు, నాయందు విశ్వసించువా డెన్నటికిని దప్పిగొనడని వినబడెను. ఆయనయొద్దకు వెళ్లుటయన్నను ఆయనయందు విశ్వసించుట యన్నను ఒక్కటేయని

నాకప్పుడు గోచరమయ్యెను. మరియు ఆయనయొద్దకు పోవువాడెవడైనను అనగా తన హృదయపూర్తిగా ఆశతో క్రీస్తురక్షణను కోరినవాడెల్లను ఆయనయందు విశ్వసించినవాడే యని నేను గ్రహించితిని. అప్పుడు నాకన్నులనిండ నీరునిండెను. మరియు నే నిట్లడిగితిని: ప్రభువా, సరియేగాని, నావంటి ఘోరపాపిని నీవంగీకరింతువా? నావంటివాడు కూడ రక్షణ పొందగలడా? అందుకాయన యిట్లని సెలవిచ్చెను. 'నా యొద్దకు వచ్చువానిని నే నెంతమాత్రమును బయటకు త్రోసి వేయను'- (యోహాను 6 : 37) మరియు నేనిట్లంటిని: ప్రభువా, నావిశ్వాసము నీమీద సరిగా నుండునట్లు నీయొద్దకు ఎట్లురాగలను'- దానికి ప్రభువు చెప్పిన దేమనగా: 'పాపులను వెదకి రక్షించుటకే క్రీస్తు యేసు లోకమునకు వచ్చెను'- (I తిమోతీ 1 : 15) మరియు విశ్వసించు ప్రతివానికిని నీతి కలుగుటకై క్రీస్తు ధర్మశాస్త్రమునకు సమాప్తియై యున్నాడు. (రోమా 10 : 4; 4 : 1-25) ఆయన మనపాపముల కొరకు చనిపోయి మనము నీతిమంతులముగా తీర్చబడునట్లు తిరిగిలేచెను. (రోమా 4 : 25) ఆయన మనలను ప్రేమించి తన స్వరక్తముచేత మనపాపములను కడిగివేసెను. (ప్రక 1 : 5) దేవునికిని మనకును మధ్య

నున్న మధ్యవర్తి ఆయనయే. (I తిమోతి 2 : 5) ఆయన సజీవుడై నిత్యమును మనకొరకు విజ్ఞాపన చేయుచున్నాడు (హెబ్రీ 7 : 25) వీటన్నిటినుండి యు నేను గ్రహించినదేమనగా ఆయనయందే నాకు నీతి దొరుకుననియు ఆయన రక్తముద్వారానే మనకు పాపక్షమాపణ గలదనియును. తండ్రి చిత్తమునకు విధేయుడై పాపశాపమును వహించి ప్రాయశ్చిత్తము చేయుట తన పాపములకొరకు కాదుగాని ఆయన యందు విశ్వాసముంచి కృతజ్ఞతగలిగి జీవించువా డెవడో వానికొరకని గ్రహించితిని. అంతట నాహృదయము సంపూర్ణానంద భరితమై నా కన్నులనిండ నీరుగ్రమ్మి నాహృదయము క్రీస్తుప్రభుని కార్యముల వైపును ఆయన నామమువైపును ఆయన ప్రజల తట్టును పరుగెత్తెను.

క్రైస్త:-నిజమే. ఇది ప్రభువైన యేసుక్రీస్తు నీ కనుగ్రహించిన ప్రత్యక్షతయే. గాని దీనివలన నీ హృదయమున గలిగిన మార్పేమియో కొంచెము వివరింపుము.

నిరీ:-అంతట లోకమంతయు, దాని స్వనీతి యెంతయున్నను శపించబడి శిక్షావిధి యందున్నదని గ్రహించితిని. మరియు తండ్రియైన దేవుడు కేవలము న్యాయస్థుడై యుండి తన యొద్దకువచ్చు పాపుల నెల్లను నిరీక్షిం

తులుగా న్యాయముగానే తీర్పునని గ్రహించితిని. నా పూర్వ జీవితము సందలి పాపములిస మును చూచి నేను సిగ్గుపడితిని. నాయజ్ఞాన మెంత ఘోరమైనదా యని నేను విభ్రాంతి నొంది తిని. ఎందుకనగా ఇంతకు ముందెన్నడును ప్రభువైన యేసుక్రీస్తు యొక్క మహిమను గూర్చి కొంచెమైన నేను గ్రహింప లేకుంటిని. దీనిచేత పవిత్ర జీవితము మీద నా కాశ పుట్టెను. మరియు ప్రభువైన యేసు క్రీస్తు యొక్క మహిమార్థమును ఆయన కీర్తి కొరకును ఏదైన చేయవలయునని ఆశ పుట్టెను. ఆహా ఇంతేకాదు. నా శరీరమందు వేయి మడుగుల రక్త మున్నను దానిని క్రీస్తు కొరకు చిందించి ధన్యుడను నగుదునని ఆశ పుట్టెను.

## క్రైస్తవుడు అజ్ఞానితో సంభాషించుట.

అంతట నేను చూచిన దేమనగా నిరీక్షణ చిత్తుడు వెనుకకు చూచినపుడు తామింతకు ముందు వెనుక విడిచి వచ్చిన అజ్ఞాని వారిని సమీపించెను. అప్పుడు క్రైస్తవునితో నతడిట్లనెను. చూచితివా ఆతడింకను ఎంత దూరమున బడి యున్నాడో !

క్రైస్త:-అవునవును. నేను చూచుచునే యుంటిని. మన సహవాసము మీద అతనికి మనస్సు లేదు.

నిరీ:-గాని నామాట నమ్ముము. వాడు మనతో కలసివచ్చిన యెడల ఇంత అలసియుండడు.

క్రైస్త:-ఆ మాట నిజమే, గాని వాని బుద్ధి కీరీతిగా తోచుట లేదు.

నిరీ:-నిజమే. అయినను కొంత ఆగి వాడు వచ్చు వరకు చూతము.

క్రైస్త:-(అజ్ఞానితో) రమ్ము, ఏమి యింత వెనుకబడితివి !

అజ్ఞా:-నాకు ఒంటరిగా నడచుటయే ఇష్టము. నలుగురితో కలసి యుండుట నాకు కుదురదు.

క్రైస్త:-(నిరీక్షణ చిత్తునితో నెమ్మదిగా) నేను చెప్పలేదా, మన సహవాసము వానికి గడ్డి పోచవంటిదని. అయినను చూతము. ఒంటరిగా నున్న యీ సమయమున వానితో కొంచెము సంభాషించిన మంచిది. (అజ్ఞానితో) రమ్ము రమ్ము ప్రయాణ మెట్లున్నది? ఇప్పుడు దేవునికి నీ హృదయము నకును మధ్య సంబంధము బాగున్నదా ?

అజ్ఞా:-బాగుగనే యున్నదను కొనుచున్నాను. ఎందుకనగా యోచన లెప్పుడును చక్కగనే యుండును. నా ప్రయాణమునందా యోచనలు నన్ను ఆదరించు చున్నది.

క్రైస్త:-ఆ మంచి యోచన లేనియెడల కొంచెము చెప్పుము చూతము.

అజ్ఞా:-ఇంకేమి కావలయును. నేనెల్లప్పుడును దేవునిగూర్చియు పరలోకమును గూర్చియు తలంచుచుందును.

క్రైస్త:-నీ వన్న మాట కేమిటి? దయ్యములును శిక్షావిధి యందున్న ఆత్మలును అట్లు తలంచుచునే యుండును.

అజ్ఞా:-నేను తలంచుట మాత్రమే కాదు, దేవునిని పరలోకమును ఆశించుచుందును.

క్రైస్త:-ఆశించుట కేమి ఎవరైనను ఆశించుదురు గాని ఆశించిన వాటిని పొందుటకు రావద్దా? సోమరి ఆశపడును గాని వాని ప్రాణమున కేమియు దొరకదు. (సామె 13:4)

అజ్ఞా:-గాని నేను వాటికొరకు తలంచుటయే కాదు. వాటి కొరకు సమస్తమును విడిచి పెట్టుదును.

క్రైస్త:-ఈ మాట నా కనుమానమే. ఎందుకనగా సమస్తమును విడిచిపెట్టుట చాల కష్టమైన సంగతి. ఇదెంత కష్టమైనదో అనేకమందికి తెలియనే తెలియదు. అయితే నీవు దేవుని కొరకును పరలోకము కొరకును సమస్తమును విడిచితివని యెట్లు చెప్పగలవు?

అజ్ఞా:-ఈ మాట నా మనస్సు నాకు చెప్పుచున్నది.

క్రైస్త:-అయితే తన మనస్సును నమ్ముకొనువాడు బుద్ధిహీనుడని జ్ఞాని చెప్పుచున్నాడే? (సామె 28 : 26)

అజ్ఞా:-అది చెడ్డమనస్సును గూర్చి చెప్పబడిన మాట. నామనస్సు చెడ్డదిగాదు మంచిదే.

క్రైస్త:-దీనికి నీకు ఋజువేమి ?

అజ్ఞా:-అది పరలోక సంబంధమైన నిరీక్షణలతో నాకు సంతృప్తి నిచ్చుచున్నది.

క్రైస్త:-అసంతృప్తి హృదయము యొక్క మోసమేమో, ఎందుకనగా పొందుటకు వీలులేని వాటివిషయమై కూడఒక్కొక్కని హృదయము ఆశ జూపి ఆదరణ నిచ్చుచుండును.

అజ్ఞా:-గాని నాహృదయమును జీవితమును ఒకేరీతిగా నున్నవి. గనుక నా నిరీక్షణ వ్యర్థము కాదనుకొనుచున్నాను.

క్రైస్త:-నీహృదయమును జీవితమును ఒకేరీతిగా నున్నవని నీకు చెప్పినవాడెవడు ?

అజ్ఞా:-నాహృదయమే చెప్పుచున్నది.

క్రైస్త:-నేను దొంగనేమో నా తోడిదొంగ నడుగమన్నాడట. నీ హృదయము నీకట్లు చెప్పుచున్నదా! దేవుని వాక్యము ఈవిషయమై సాక్ష్యమిచ్చిననే తప్ప లేని యెడల మరెవరి సాక్ష్యమైనను ప్రయోజనములేనిదే.

అజ్ఞా:- అవునుగాని, మంచి యోచనలున్న హృదయము మంచిదే అగునుకదా ? దేవుని యాజ్ఞలననుసరించు జీవితము మంచి జీవితముకదా ?

స్త:-నిజమే మంచి యోచనలున్న హృదయము మంచి హృదయమే. దైవకట్టడల ననుసరించు జీవితమును మంచిజీవితమే. వీటిని కలిగియుండుటకును కలిగియున్నామని భ్రమించుటకును చాల భేదమున్నది.

జ్ఞా:-అయితే మీ యుద్దేశమునుబట్టి మంచియోచనలనగా నెట్టివి? దైవవిధుల ననుసరించు జీవితమనగా నేది?

## మంచితలంపులు

క్రైస్త:-మంచితలంపు లనగా చాలరకము లున్నవి. కొన్ని మనలను గూర్చినవి, మరికొన్ని దేవునిగూర్చినవి, మరికొన్ని క్రీస్తునుగూర్చినవి. ఇంకకొన్ని యితర విషయములను గూర్చినవి.

అజ్ఞా:-మనలనుగూర్చిన మంచితలంపు లెట్టివి?

క్రైస్త:-దేవుని వాక్యానుసారమైనవి.

అజ్ఞా:-మన యోచనలు దేవునివాక్యముతో నెప్పు డేకీభవించును?

క్రైస్త:-దైవవాక్యము మనల నేవిధముగా తీర్పుతీర్చునో అట్టి తీర్పునే మనలనుగూర్చి మనము తీర్చుకొనిన యెడల అప్పుడు. మన తలంపులు దైవవాక్యముతో నేకీభవించిన వన్నమాట. దీని భావమేమనగా: నీతిమంతు

యొక్కటైనను లేదు అని దేవునివాక్యము చెప్పుచున్నది. నరుల హృదయముయొక్క తలంపులలోని ఊహ అంతయు ఎల్లప్పుడును చెడ్డది అనియు (ఆది 6 : 5; రోమా 3) మరియు నరుల హృదయాలోచన వారి బాల్యమునుండియు చెడ్డది- అనియు (ఆది 8:21) దేవునివాక్యము స్వాభావికమైన నరులను గూర్చి చెప్పుచున్నది. గనుక మనమును మనలనుగూర్చి యిట్లుతలంచి, ఇది నిజమని యెరిగినయెడల మన తలంపులు మంచివే. ఎందుకనగా అవి దైవ వాక్యాను సారమైనవి గనుక.

ఆజ్ఞా:-నీవెన్ని చెప్పినను నా హృదయమంత చెడ్డదని నేను నమ్మనేనమ్మను.

క్రైస్త:-అందుచేతనే నీ జీవితమునందొక్క మంచితలంపైనను లేదన్నమాట. సరియేగాని యింకను చెప్పెదను వినుము. మన హృదయమిట్టిదని వాక్యము తీర్పు తీర్చుచున్నది కదా? అట్లే మన మార్గములు కూడ యిట్టివని ఆ వాక్యము తీర్పుతీర్చుచున్నది. మరియు మన హృదయాలోచనలును మన ప్రవర్తనా మార్గములును దేవునివాక్యము ననుసరించిన వైనయెడల వాటినిగూర్చి ఆ వాక్యముతీర్పు తీర్పు నంగీకరించును.

ఆజ్ఞా:-అనగా దీనియర్థమేమి?

క్రైస్త:-అర్థమున కేమున్నది. మానవుల మార్గములు వంకరై పనియు, మంచివి కావనియు చెడిపోయినవనియు, నరులుతమవంకరత్రోవలకుపోవువారని దేవునివాక్యము చెప్పుచున్నది. (కీర్త 125 : 5; సామె 2:15; రోమా 3 : 12) గనుక ఒకడు తన హృదయపూర్తిగా ఈ సంగతిని గ్రహించి వినయముతో నొప్పుకొనినయెడల వాని యోచనలు క్రమమైనవే. ఎందుకనగా దేవుని తీర్పును అనుసరించిన యోచనలవి.

అజ్ఞా:-మరి దేవునిగూర్చిన మంచితలంపు లెట్టివి?

క్రైస్త:-మనలనుగూర్చి నేనెట్లు చెప్పితినో అట్లే దేవునిగూర్చి ఆయన వాక్యమునందున్నట్లే మనమును తలంచిన యెడల అప్పుడు మనతలంపులు సరియైనవి. అనగా ఆయన స్వభావమునుగూర్చియు గుణ లక్షణములను గూర్చియు దైవవాక్యమునందున్నట్టుగా మనము నమ్మినయెడల మన తలంపులు మంచివి. ఆయన గుణ లక్షణములను గూర్చి యిప్పుడంతగా విస్తరించి చెప్ప జాలను. గాని ఆయనకు మనయెడల గల సంబంధ మునుగూర్చి చెప్పవలసినచో మనకంటె యెక్కువగా ఆయనకే మన హృదయస్థితి తెలియును. మన పాప మును మనము చూచుకొనలేము గాని ఆయనయే

బాగుగా చూడగలడు. ఈతలంపులు దేవునిగూర్చి మనకున్న యెడల అవి ఆయన వాక్యానుసారమైన తలంపులే. ఆయనకు మన హృదయాంతరంగము స్పష్టముగానున్నది. అందున్న సమస్త యోచనలును ఆయనకంటికి స్పష్టముగా నున్నవి. మన నీతియంతయు ఆయనకు మురికిగా నున్నది. గనుక మన మెన్ని మంచికార్యములు చేసినను మనము ధైర్యముగా ఆయనముందు నిలచుట కాయన సహించలేడు.

అజ్ఞా:-నాకంటె దేవు డెక్కువ స్పష్టముగా చూడగలడని నాకు మాత్రము తెలియదా? నేను బుద్ధిహీనుడ ననుకొను చున్నావా? నా నీతికార్యములతో దేవుని సమీపింపెద ననుకొనుచున్నావా?

క్రైస్త:-మరి యీవిషయమునందు నీ యుద్దేశమేమి?

అజ్ఞా:-ఉద్దేశమున కేమియున్నది? ఒక్కమాటలో చెప్పిన యెడల నీతిమంతునిగా తీర్చబడుటకు నేను క్రీస్తుయేసు నందు విశ్వాస ముంచవలయును.

క్రైస్త:-క్రీస్తునందు విశ్వాసముంచుటకు ముందు నీ హృదయ స్థితి నెరిగి ఆయన నీకగత్యమని గ్రహించవలయును గదా? నీ యాదిపాపమును గాని దినదినమును చేయు అపరాధములను గాని నీవు చూడకనేయున్నావు. నీ స్థితినిగూర్చియు నీ కార్యములనుగూర్చియు నీకున్న

తలంపులు చూడగా, దేవునియొక్క నీతిమంతునిగా తీర్చుటకు క్రీస్తు అవసరమని నీవు గ్రహించినట్టులేదు. అట్టియెడల క్రీస్తునందు విశ్వసింతునని నీవెట్లు చెప్ప గలవు?

జ్ఞా:-ఇవన్నియు నిజమేగాని నేను విశ్వాసముమాత్ర ముంచు చున్నాను.

స్తు:-నీవెట్లు విశ్వసించగలవు?

# అజ్ఞాని పొరబాటు

జ్ఞా:-పాపులకొరకు క్రీస్తు చనిపోయెనని విశ్వసించుచున్నాను ఆయన ధర్మశాస్త్రమునకు నేను విధేయుడ నైతిని గనుక క్రీస్తుయేసు నన్నంగీకరించి కరుణించి దేవుని యెదుట నన్ను నీతిమంతునిగా తీర్చును; నన్ను పాపమునుండి తప్పించును. అనగా నేను చేయుచున్న మతసంబంధమగు నీతికార్యము లన్నియు క్రీస్తు తండ్రి యైన దేవునికి అంగీకారము లగునట్లుగా చేయును. వాటి విలువవలన నేను నీతిమంతునిగా తీర్చబడుదును.

క్రీస్తు:-దీని విషయమై నేను నమ్ముచున్న దానిని నీకు చెప్ప వచ్చునా?

1. నీ విశ్వాసము నిర్ధారమైనది. ఎందుకనగా దేవుని వాక్యము నందెక్కడను ఇట్టి విశ్వాసమును గూర్చి చెప్ప బడలేదు.

2. నీ విశ్వాసము మోసకరమైనది. ఎందుకనగా క్రీస్తు యొక్క నీతిని అందుకొని అది నీ స్వనీతియనుకొను చున్నావు.

3. నీ విశ్వాసము క్రీస్తు నీతిని వెదకుటలేదు గాని నీ కార్యముల నీతిని వెదకుచున్నది. నీ స్వనీతి లేనేలేదు. గనుక నీ విశ్వాసము దొంగ విశ్వాసము.

4. గనుక ఈ విశ్వాసమంతయు మోసపుచ్చు విశ్వాసమై యున్నది. సర్వశక్తుడగు దేవుని తీర్పు దినమందు ఈ నీతి నిన్ను ఉగ్రతయందుంచును. ఎందుకనగా నీతియుక్త మైన విశ్వాసము ధర్మశాస్త్రముపై ఆధారపడదు. ధర్మ శాస్త్ర పక్షముగా చూచిన యెడల మనము చెడిపోయిన వారమని అట్టి నిజవిశ్వాసము మనకు తెలియజేయును. అట్టి విశ్వాసము మనలను క్రీస్తునొద్దకు నడిపించును. క్రీస్తునీతి మనకప్పుడు లభించును. క్రీస్తు నీతి మన కార్యములను బట్టి కలిగినది కాదు గాని దేవునికి సంపూర్ణ విధేయత ద్వారా క్రీస్తు సంపాదించిన నీతియే. మరియు మనము చెల్లించవల సిన అపరాధ శిక్షను ఆయనే చెల్లించి శ్రమనుభరించి నందు ననే ఆయన నీతి అంత విలువైనది. నిజమైన విశ్వాసము

స్తు యొక్క ఈ నీతినే అంగీకరించును. ఇట్టి నీతిచేతనే
మనయాత్మ పవిత్రపరచబడి ఆనీతియనెడి వస్త్రమును ధరించి
దేవుని యెదుట నిర్మలముగా కనబడును. అప్పుడు దేవుడట్టి
యాత్మనంగీకరించి పాపశిక్ష నుండి తప్పించును.

అజ్ఞా:- ఇదేమిటి! మన పని లేకుండా క్రీస్తు చేసి వేసినదాని
యందు మనము నమ్మికొనవలయునా? ఇది యొక
పన్నాగమువలె నున్నది. ఈ పన్నాగముచేత మన
శరీరేచ్ఛ యెక్కువై మన యిష్టానుసారముగ
మనము జీవించునట్లు చేయునే. ఎందుకనగా క్రీస్తు
నందు విశ్వసించు వారందరు ఆయన నీతిచేతనే
రక్షింపబడిన యెడల మనమిక యెట్లు జీవించినను
తొందర లేదుగదా!

క్రైస్త:- ఓ యజ్ఞానీ, నీ పేరునకు తగినట్టుగనే యున్నది నీ
యజ్ఞానము. నీవు చెప్పిన యీ మాటలు చూడగా
నీవజ్ఞానివని వేరెవరును చెప్పనక్కరలేదు. అజ్ఞానివి
గనుక పాపశిక్షనుండి తప్పించు నీతియేదియో నీవెరు
గవు; విశ్వాసముద్వారా నీయాత్మకు అట్టి నీతిని
సంపాదించుకొనుట యెట్లో నీ వెరుగవు; అట్టి విశ్వా
సము ద్వారా నీ యాత్మను దేవుని యుగ్రతనుండి
తప్పించుకొనుటయును నీవెరుగవు. క్రీస్తు నీతియందు
రక్షణార్థమైన విశ్వాసము ఎట్టి ఫలములను కలిగిం

చునో కూడ నీ వెరుగవు. అట్టి విశ్వాసము ద్వారా నీ హృదయము దేవుని వశమై ఆయనకు లోబడును. ఆయన నామమును, ఆయన వాక్యమును నీ కత్యంత మధురమగును. ఆయన కార్యములన్నను ఆయన భక్తుల సహవాసమన్నను నీ కత్యంత ప్రియముల గును. ఇది నీ వెరుగనే యెరుగవు.

నిరీ:-ఇతని కెప్పుడైన క్రీస్తు పరలోకమునుండి తన్ను తాను బయలు పరచుకొనె నేమో అడుగుము.

అజ్ఞా:-ఓహో, నీకు దర్శనములు కావలసినట్లున్న దే! నీవును నీతోటి యితరులును దర్శనముల సంగతి చెప్పి మతి హీనులగు చున్నారు. అది వెడబుద్ధి.

నిరీ:-ఇదియేమయ్యా, క్రీస్తు యేసు దేవుని యందు గుప్తపర చబడి శరీర నేత్రములకును మనుష్యుల జ్ఞానమునకు మరుగై యున్నాడు. గాని తండ్రి ఆయన నెవరికి బయలుపరచునో వారికి రక్షణార్థమై కనబడు చున్నాడు.

అజ్ఞా:-అది నీ నమ్మకము. గాని నా నమ్మకము వేరు. గాని నీకున్న పిచ్చిఊహలు నా యందు లేవుగాని నీ విశ్వా సము కన్న నావిశ్వాస మెంతమాత్రమును తీసిపోదు.

క్రైస్త:-ఒక్కమాట చెప్పుటకు సెలవిమ్ము. ఈ విషయమై నీ వింత చులకనగా మాటలాడరాదు, ఎందుకనగా

నా స్నేహితుడు చెప్పిన మాట కేవలము సత్యము. తండ్రి ఎవరెవరికి ఆయనను బయలుపరచునో వారు తప్ప మిగతా వారు క్రీస్తునెరుగలేరు. మరియు క్రీస్తునందు ఆధారపడియుండు విశ్వాసము కూడ అది నిజమైన విశ్వాసమయిన యెడల సర్వశక్తుడగు దేవుని కృపచేతనే మనయందు కలుగుచున్నది. (మత్తయి 11 : 27; I కొరింథీ 12 : 3; ఎఫెసి 1 : 17-19) గాని పాపము, నీ వజ్ఞానివగుటచేత యీ విశ్వాసము యొక్క కార్యమును గూర్చి ఆవంతయు నెరుగకున్నావు. గనుక కన్నులు తెరచి, నిజస్థితి నెరుగుము క్రీస్తు నాశ్రయించుము. అయన నీతి దైవనీతి. ఎందుకనగా ఆయనే దేవుడు. అట్టిదైవనీతితో నీవు మరణశిక్షనుండి తప్పించుకొనగలవు.

అజ్ఞా:—మీరు చాల వేగముగా నడచుచున్నారు. నేను మీతో నడువలేకున్నాను. గనుక మీరు ముందు పొండి నేను నేను నెమ్మదిగా వచ్చెదను.

# క్రైస్తవునికి నిరీక్షణచిత్తునికి జరిగిన సంభాషణ

అంతట క్రైస్తవుడు నిరీక్షణచిత్తునితో నిట్లనెను

క్రైస్త:-రమ్ము. మనమిరువురమును మరల ఒంటరిగానే నడువవలయును. (అంతట వారుముందునకు నడచుచుండగా అజ్ఞాని వెనుకను తొందరగా వచ్చుచుండుట నా కలయందు చూచితిని.) ఈ అజ్ఞాని పాపము తప్పుడు బోధలోనున్నాడు. చివరి కితని గతి నాశనమే యని విచారించుచున్నాను.

నిరీ:-అయ్యో, మన పట్టణమునందిట్టివారు వందల కొలది యున్నారు. కొన్ని కుటుంబములు, వీధులు ఇట్టివారితో నిండి యున్నవి. మన ప్రాంతమునందే యింతమంది యున్నయెడల, ఈ అజ్ఞాన దేశమునందింకను యెంతమంది గలరో.

క్రైస్త:-నిజమే. 'వారు చూడకుండునట్లు వారి కన్నులు మందము చేయబడినవి'—అని దేవుని వాక్యము చెప్పుచున్నది. మనలో మన మాట చెప్పుకొందము, వారిని గూర్చి నీ యభిప్రాయమేమి? వారి కెన్నడైన పాప చింతకలిగిన దను కొందువా? ఆ పాప చింత కలిగినపుడు తమస్థితి భయంకరమైనదని వారు తెలిసికొన గలిగిరా?

నిరీ:-నీవు నాకన్న పెద్దవాడవు నీవే దీనికి జవాబుచెప్పుము.

క్రైస్త:-అయిన చెప్పుచున్నాను వినుము. వారి కట్టిస్థితి కలిగియే యుండును. గాని వారు అజ్ఞానులైనందున అట్టి పశ్చాత్తాపము తమ ఆత్మీయమైన మేలు కొరకైనదని గ్రహించరు. అందుచేత ఆయా సమయములను వారు అణచివేసి వారి హృదయ మార్గము ననుసరించి గర్వముగ మాటలాడుదురు.

నిరీ:-నిజమే. నీవు చెప్పినట్లు పాపభీతి మానవులకు ఎంతో మేలుకరము. ముఖ్యముగా నాశన స్థలమునుండిబైలు దేరిపోవుట కది యెంతయు సహాయపడును.

క్రైస్త:-అది సరియైన భీతియైనచో ఆ పని చేసితీరును. ఎందుకనగా "యెహోవాయందు భయభక్తులు కలిగి యుండుట జ్ఞానమునకు మూలము"—అని దేవుని వాక్యము చెప్పుచున్నది. (యోబు 28 : 28; కీర్తన 111 : 10; సామె 1 : 7; 9 : 10).

నిరీ:-సరియైన పాపభీతి యనగా నెట్టిది ?

క్రైస్త:-దీనిని తెలిసికొనుటకు మూడు గుర్తులున్నవి.

1. దాని పుట్టుకచేత ఆభీతి మనపాపములను మనకు చూపును.

2. రక్షణకొరకు క్రీస్తుపై నాధారపడునట్లు అట్టి భయము ఆత్మను వేగిరపరచును.

3. అట్టిభయము మన హృదయమునందు దేవుడన్నను ఆయన వాక్యమన్నను ఆయన మార్గములన్నను అమితమైన భక్తిని పుట్టించును. మరియు అట్టిభక్తిని నిలిపియుంచును. అది హృదయకాఠిన్యమును పోగొట్టును. దేవుని మార్గములను విడిచిపెట్టుటకు భయపడునట్లు చేయును. ఆయన మార్గములనుండి కుడికి గాని యెడమకుగాని తొలగనీయదు. దేవునికి అవమానమును తెప్పించు వాటియందుగాని, మన హృదయశాంతిని చెరగొట్టు వాటియందుగాని, దేవుని పరిశుద్ధాత్మను దుఃఖపరచువాటి యందుగాని, శత్రువు హేళనచేయునట్టి కార్యములందుగాని మనలను పడకుండ నిట్టి పాపభీతి కాపాడును.

నిరీ:–చక్కగా చెప్పితివి. ఇదంతయు కేవలము సత్యము. మన మిప్పుడు మంత్రభూమి దాటిపోతిమా?

క్రైస్త:–ఏమి, నీకీ సంభాషణ విసుగుగానున్నదా?

నిరీ:–లేదు, లేదు. మన మెంతదూరము వచ్చితిమో యెరుగగోరి అడిగితిని.

క్రైస్త:–మనమింకను ఒకక్రోసు నడచినయెడల దీని దాటిపోవుదుము. సరియేగాని మన సంభాషణను మరల సాగింతము. గనుక నేను చెప్పినట్టు వారియందు పుట్టిన పాపభీతి వారి ఆత్మలకు మేలుకరమైనదని యెరుగరు. అందుచేతనే దానిని వారణచివేయ ప్రయత్నింతురు.

నిరీ: వాటిని కప్పిపెట్టుటకు వారెట్లు ప్రయత్నించెదరు?

క్రైస్త:-1. ఆ భీతి దేవునివలన పుట్టినదైనను అది మనుష్యునివలన పుట్టినదని వారనుకొందురు. అట్లుతలంచి వారాభీతిని నెదిరించి పోరాడి అణచివేతురు. 2. ఆ భయముచేత వారి విశ్వాసము చెడునని కూడ వారు తలంతురు. గాని అసలు వారియందు విశ్వాసమే లేదు. ఈసంగతి వారికి తెలియదు. అందుచేత వారి హృదయములను కఠినపరచుకొందురు 3. వారు భయపడకూడదని అనుకొందురు గనుక వారి హృదయములు చల్లారి పాపమును గుర్తించలేకుండ పోవును. 4. అట్టిభయము చేత వారికున్న స్వనీతి పోవునని తలంచి దానిని వారు అణచివేతురు.

నిరీ:-ఇది నాకు కొంచెము అనుభవమే. ఎందుకనగా నన్ను నే నెరుగకముందు నాకును ఇట్లే జరిగినది.

క్రైస్త:-సరియే. ఇక నిక్కడితో అజ్ఞానిసంగతి విడిచిపెట్టి మరేదైన ప్రయోజనకరమగు సంగతినిగూర్చి మాటలాడుకొందము.

నిరీ:-మంచిది. అయితే దానినికూడ నీవే ప్రారంభించుము.

# ఈషత్కాలికుడు పతనమగుట

క్రైస్త:-అయిన వినుము. సుమారు పదిసంవత్సరముల క్రితము ఈ ప్రాంతములందు ఈషత్కాలికు డను పేరుగల వాడొక డుండెను. వాని నెరుగుదువా? అతడు మత విషయములందు చాల నిష్టగలిగి యుండెడివాడు.

నిరీ:-ఎరుగ కేమి, యెరుగుదును. వాడు కృపారహిత పట్టణము నందుండెడివాడు. ఈ కృ పా ర హి త పట్టణము యదార్థపురమునకు క్రోసెడు దూరము. వీనియిల్లు మార్గత్యాగియను వాని యింటిప్రక్కనే యుండెడిది.

క్రైస్త:-సరిగా చెప్పితివి. వారిద్దరును ఒకయింటనే నివసించిరి. ఆమనుష్యు డొకప్పుడు చాల ఉద్రేకమును పొంది నాడు. నేను విన్నదేమనగా అతనికి పాపభీతియు తనకు రాబోవు శిక్షనుగూర్చిన భయమును కలిగెను.

నిరీ:-నేనును అట్లేవింటిని. ఎందుకనగా మాయిల్లు వానియింటికి క్రోసున్నర దూరముమాత్రమే యుండెడిది. అతడప్పు డప్పుడును మాయింటికి వచ్చువాడు. అదియును కన్నీటితో వచ్చువాడు. నేను నిజముగా అతనిని గూర్చి జాలిపడువాడను. అతని కేమైన ఫలితముకూడ దొరకు ననుకొనువాడను. గాని ప్రభువా ప్రభువా అనువాడు ప్రతివాడును రక్షింపబడడు అనుమాట సత్యమని యిప్పుడు తేలుచున్నది.

క్రైస్తు:-ఒకప్పుడతడు నాతో చెప్పిన దేమనగా యాత్రకు బైలుదేరవలెనని నిశ్చయించుకొనెనట. గాని అంతలోనే ఒకనాడు స్వరక్షయ్య అనువానితో పరిచయ మైనదట. అప్పటినుండియు తాత్కాలికుడు నాకు కనబడలేదు.

సిరీ:-వానిసంగతి సంభాషణకు రానేవచ్చినది గనుక వాడంతత్వరగా పడిపోవుట యెట్లు తటస్థించినదో కొంత పరిశీలింతము.

క్రైస్తు:-ఆవిషయము మనకు లాభకరమైనదే గనుక చర్చింతము. గాని నీవు ప్రారంభింతువా?

సిరీ:-అయిన వినుము. నేను గ్రహించగలిగినంత మట్టుకు దీనికి నాలుగు కారణములు కనబడుచున్నవి.

1. అట్టిమనుష్యుల మనస్సాక్షి రేపబడినను వారి హృదయమింకను మారలేదు. నరకబాధను గూర్చిన భావములును భయమును వారికి కలిగి దానివలన మాత్రమే వారికి తాత్కాలికమైన పరలోకచింత ఉద్రేకము కలుగును. గాని నరకభయమును, శిక్షా భీతియు చల్లారిపోగానే వారి పరలోకవాంఛయురక్షణ విషయమైన కోరికయుకూడ చల్లారిపోవును. అప్పుడు జరుగున దేమనగా వారి భయముపోయి పరలోకమును గూర్చియు ఆనందమును గూర్చియు ఆశనశించి వెనుకటి దుస్థితికే మరల పోవుదురు.

2. రెండవ కారణమేమనగా, వారియందున్న బానిస భయములన్నియు వారి నణచివేయును. అనగా మనుష్యులయెడల వారు చూపు భయమనియే నాభావము. "భయపడుట వలన మనుష్యులకు ఉరి వచ్చును." (సామె 29 : 25)

3. మతమును గూర్చి వారియందున్న సిగ్గుచేత కూడ వారు చెడుదురు. వారు గర్విష్ఠులును దుష్ట మనస్సు గలవారునై మతవిషయము లనగా చిన్న చూపు చూచుచు అసహ్యించు కొందురు. అందుచేత నరక భీతియు రాబోవు శిక్షను గూర్చిన తలంపును కొంచెము తగ్గగానే వారు మరల తమ పూర్వ స్థితిలో పడుదురు.

4. నేరము నెరుగుటయు, నరక భీతియు వారికి బాధకరముగా నుండును. వారికి రాబోవు దుస్థితిని కానరు. ఒకవేళ ఆ మహా శిక్షలో పడకముందే దానిని గుర్తించిన యెడల దానినుండి పారిపోయి పరిశుద్ధులతోపాటు క్రీస్తు నాశ్రయించి యుందురు గాని ముందు వారు కండ్లు తెరువరు గాని నేనింతకుముందు చెప్పినట్లు నేరమును గూర్చియు, శిక్షను గూర్చియు వచ్చు తలంపులనణచి వేసికొనుటచేత, వీటిని కొంచెము మరచిపోగానే మరల వారి హృదయములు

కలిగినవారై ఎప్పటి సుఖములలోనగు అంతకంతకు హృదయకాఠిన్యతను పొందుదురు.

ప్రస్త:-నీవు చెప్పినది నిజమే. ఎందుకనగా వీని కంతటికిని మూలకారణము వారి మనస్సు కరిగిపోవుటయే. వారి చిత్తమును మార్చుకొనక పోవుటయే. అందుచేతనే వారు న్యాయమూర్తి యొక్క సెలవిచ్చిన బందిపోటు దొంగవలె యున్నారు. వాడు న్యాయాధిపతి యెద్దనున్నంతసేపును వణకుచు భయపడుచుండును మరియు తాను చేసిన నాటికష్టములన్నిటికై యెంతో పశ్చాత్తాప పడుచున్నట్లు కనబడును. దాని కంతటికిని కారణమేమనగా కొరడాదెబ్బల భయము ఖైదుకొట్ల భయమును మాత్రమే. గాని వాని అపరాధము యొక్క ఘోరస్థితి వానికి కనబడనే కనబడదు. ఎందుకనగా వీనికి తిరిగి విడుదల దొరకగానే మరియెప్పటి యట్లు దొంగతనమునకును మోసమునకును దిగును. గాని వాని మనస్సు మారియుంటె ఈ పని చేయుడు.

## దేవునినుండి వెనుకకు జారు విధము.

నిరీ:-ఇట్టి వారు వెనుకకు పడిపోవుటకు కారణములు లిప్పుడు నేను చెప్పితిని. వారు పడిపోవు నపుడేమి జరుగునో నీవు చెప్పగలవా?

క్రైస్త:- నాకు తెలిసినంతమట్టుకు చెప్పెదను వినుము.

1. వారు తమ తలంపులను దేవుని నుండియు, మరణమునుండియు తీర్పు నుండియును మళ్ళించి మరచి పోవుదురు.

2. అంతట ఏకాంత ప్రార్థన, శరీరేచ్ఛను చంపుట, పాపమునకు దుఃఖించుట మొదలగు స్వాంతవిధులను క్రమముగా విడిచిపెట్టుదురు.

3. పిమ్మట జీవముగల క్రైస్తవుల సహవాసమును విడిచి పెట్టుదురు.

4. అంతట వారు భక్తులకు వంకలుబెట్టి తప్పులు పట్ట జూతురు. అదియును వారి యందున్న చిన్న బలహీనత నొకదానిని ఆధారముగ జేసికొని వారి విశ్వాసము భ్రష్టమగునట్లు వీరు సాతానువలె వారి వెనుక పనిచేయుదురు.

6. అప్పుడు వారు శరీరానుసారులగు దుష్టులతోను, కామాతురులతోను సాంగత్యము చేసి వారిపొందును కోరుదురు.

7. అదియైన వెనుక రహస్యమందు శరీర సంబంధమైన పాప ప్రసంగములను చేతురు. మరియు నెవరైన యదార్థపరుడని పేరుపొందిన వాడిట్టి సంభాషణలో దిగినచో వారు మరింత సంతోషపడుదురు. ఎందు కనగా వారిమాదిరిని తాముకూడ చేయవచ్చునని.

8. అక్కడినుండి వారు చిన్నచిన్న పాపములతో బహిరంగముగనే చెలగాటము లాడుదురు.

9. అంతట తమహృదయము కఠినమైపోయి నందున తమ నిజస్వభావమును బయలు గ్రక్కుచుందురు. అంతట తిరిగి తమ పాత దుఃఖసాగరమున బడిపోవు దురు. దేవుడు కనికరించి అద్భుతరీతిగా నిట్టివారిని రక్షించితే సరిగాని లేనియెడల అట్టివారు నిత్యనాశనమునకు పోవలసిన దే.

## యాత్రికులు బ్యూలాయను చోటికి వచ్చుట

అంతట నేను నాకలయందు చూడగా ఇప్పటికి యాత్రికులు మృత్యుభూమిని దాటి బ్యూలాయను దేశమునకు వచ్చిరి. (యెషయా 62 : 4–12; పరమగీతము 2 : 10–12) (ఈ దేశమునకే పతివ్రతా దేశమని మరియొక పేరుగలదు.) అచటి వాతావరణము మధురముగను హాయిగను ఉండును. వారి మార్గ మా దేశ మధ్యముగుండా పోవుచున్నందు అక్కడ యాత్రికులు కొంతకాలము విశ్రమించిరి. అక్కడ వారికి మధురముగు పక్షుల పాటలును, సుమధుర వాయువులనేను పుష్పలతాదులును గువ్వల పలుకులును వారి నానందపర చెను.

ఈ దేశమునందు రాత్రింబగళ్లు సూర్యుడు అస్తమింపక ప్రకాశించును. అందుచేత గాఢాంధకారమగు లోయను దాటియున్న దేశమిది. మరియు నిరాశారాక్షసుని కిక్కడ రాపీలులేదు. ఇంతేగాక వాని సంశయదుర్గ మిక్కడికి కనుపించనైన కనుపించదు. ఇక్కడ యాత్రికులకు తాము పోవుచున్న పట్టణము కనుపించినది. మరియు ఆపట్టణ వాస్తవ్యులు కొందరీ బ్యూలాదేశమున వీరికి కనుపించిరి. ఎందుకనగా మహిమాప్రకాశ స్వరూపులగు వారీ దేశమున సంచరించుచుందురు. ఈదేశము పరమపురి సరిహద్దునందే యున్నది. ఈ దేశమునందే పెండ్లికుమార్తెయగు సంఘమునకును పెండ్లికుమారుడగు క్రీస్తుకును గల సంబంధము ధృఢమగును. ఇక్కడ ఆహార పానీయములకు లోటులేదు. వారి యాత్రకాలమంతటిలోను వారు వెదకుచువచ్చిన సమస్త భాగ్యములు నీదేశమునం దుండెను. 'ఇదిగో నీరక్షణ వచ్చియున్నదని సియోను కుమార్తెతో చెప్పుడి. ఇదిగో ఆయనయిచ్చు బహుమానము ఆయన చేతియందున్నది' అను కేకలు ఆ పరమపురము నుండి మన యాత్రికులకు వినవచ్చుచుండెను. ఇక్కడ దేశస్తులందరును పరిశుద్ధ జనులనియు, ప్రభువుచే విమోచింపబడిన వారనియు యాత్రికులను పిలుచుచుండిరి. ఈ దేశముగుండా వారు పోవునపుడు తామువచ్చిన ఆ సూప్రాంతములం దెక్కడను లేని ఆనందము వారికి కలిగెను. మరియు పరమపట్టణమును సమీపించినపుడు వారికది స్పష్ట

ముగ కనుపించెను. ఆ నగరము రత్నములతోను ముత్య ములతోను కట్టబడెను. అందలి రాజవీధులు బంగారుమయ ములై యుండెను. మరియు దాని శృంగారముచేతను ఆ నగరియందు సూర్యకిరణములు ప్రతిఫలించుట చేతను క్రైస్త వునికి ఆనందమెక్కువై యెప్పుడు చేరుదునాయని తీవ్రమగు కోరిక కలుగుచుండెను, నిరీక్షణచిత్తునికి కూడ నిట్లే ఆత్రముగ నుండెను. గనుక అక్కడ కొంత సేపునిలచి తమ హృదయ వేదనచేత నిట్లరచిరి: 'మీకు నాప్రియుడు కనుపించినయెడల నే నతనికొరకు బెంగగొంటినని చెప్పుడు'.

అయితే త్వరలో కోలుకొని వారు తమదారిని నడ చుచు అంతకంతకు ఆపట్టణమును సమీపించుచుండిరి. ఆపట్ట ణము చేరువను పండ్లతోటలును, ద్రాక్షతోటలును, వన ములు నుండెను. వాటి గుమ్మములు రాజమార్గముమీదికే తెరువబడి యుండెను. యాత్రికులీ తోటలదగ్గరకు వచ్చి విశ్ర మించినపుడు ఆతోట కాపరులు వారి నెదుర్కొనిరి. ఈ చక్కని తోటలును ద్రాక్షతోపులును యెవరివని యాత్రి కులు వారి నడిగినపుడు అవి రారాజునవనియు ఆయన వినో దముకొరకును, యాత్రికుల మేలుకొరకును అవి నాటబడి యున్నవని తోటకాపరులు జవాబిచ్చిరి.

అంతట తోటకాపరులు వారిని లోనికి తీసికొనిపోయి అందలి రమ్యఫలతములతో తృప్తి పొందుడని చెప్పి (ద్వితీ

23 : 24) అక్కడినుండి రారాజు లతాగుమ్మములను పూదోటలను వారికిచూపి ఆనందింప జేసిరి. మరియు వారక్కడ విశ్రమించి నిద్రించిరి.

అంతట నేను నాకలయందు చూడగా యాత్రికులిద్దరును నిద్రించుచు బహుచక్కగా మాటలాడుచుండిరి. అంతట నేనెక్కువ ఆశ్చర్యపడుచుండగా తోటమాలి నాతోనిట్లనెను: నీవెందుకు ఆశ్చర్య పడుచున్నావు? ఈతోట ద్రాక్షపండ్లయొక్క లక్షణమిదియే. ఈ చక్కని ద్రాక్ష రసము ఆనందమైన నిద్రనిచ్చి నిద్రితుల పెదవులను మాట్లాడ జేయును. (పరమగీ 7 : 9)

## పరమపురమును సమీపించుట.

అంతట నేను నా స్వప్నమందు చూచుచుండగా వారు నిద్రమేల్కొంచినపుడు పరమ పట్టణమునకు ప్రయాణమునకు మరల సన్నిద్ధులైరి. గాని నేనింతకు ముందు చెప్పినట్టుగా ఆ పట్టణము బంగారు మయమై (ప్రకటన 21 ; 8) సూర్యకాంతుల నీనుచున్నందున వారా మహిమగల పట్టణమును వట్టి కన్నులతో చూడలేక దానికొరకై ప్రత్యేకముగ నేర్పరచబడిన యంత్రముగుండా చూచుచుండిరి. (II కొరింథి 3 : 18.) అంతట వారు పోవుచుండగా బంగారు

వంటి ప్రకాశమానమైన వస్త్రములు గల వారిద్దరు వారి కెదురైరి. వారి ముఖములుకూడ సూర్యబింబములవలె ప్రకాశించుచుండెను.

మీరెక్కడినుండి వచ్చుచున్నారని వారు యాత్రికులను ప్రశ్నించిరి. దానికి యాత్రికులు ఉచితరీతినిజవాబిచ్చిరి. మరియు మీరెక్కడ బసచేసిరనియు మార్గమందు మీరే యే కష్టములను దాటితిరనియు, ఏయే ఆనందసౌఖ్యముల ననుభవించితిరనియు వారు యాత్రికులను ప్రశ్నించగా వీరు వారి కుశల ప్రశ్నల నన్నిటికిని జవాబిచ్చిరి. అంతట నా ప్రకాశమూర్తు లిట్లనిరి:

ఇంక మీకు రెండు గండములు మాత్రమున్నవి. అవి దాటిన పిమ్మట మీరు పరమపురమునందు అడుగిడినట్టే, అందుకు క్రైస్తవుఁను నిరీక్షణచిత్తుడును తమవెంట రమ్మని ఆ ప్రకాశమానమూర్తుల నడిగిరి. వారును వచ్చెదమనిరి గాని యాత్రికులు తమ విశ్వాసముచేత వారి సహవాసమును పొందవలెనని చెప్పిరి. అంతట వారందరును సాగిపోయి పరమపురి గవిని చెంతవరకును నడచి వచ్చిరి.

# యాత్రికులు నదిని ప్రవేశించుట

అంతట నేను చూచిన దేమనగా వారున్నచోటికి పరమపురి గవినికిమధ్య నొకనది యుండెను. ఆ నదికి వంతెన

లేకుండెను. అది బహు లోతైన నది. ఆ నదిని చూచినపుడు యాత్రికులు బహుగ జడిసిరి. అయితే వారికూడ వచ్చిన ప్రకాశమానమూర్తులు చెప్పిన దేమనగా: మీరీ నదిని దాటి పోనియెడల పరమ గవినిని చేరలేరు. మరొక మార్గ మేదైన లేదా, యని యాత్రికులు వారి నడుగగా వారిట్లు జవాబు చెప్పిరి.

ఉన్నదిగాని, ఇంతవరకును ఆ వేరు మార్గమునపరమ పురిని చేరిన వారిద్దరు మాత్రమే. వారెవనగా హానోకు, ఏలియా యను వారు. వీరిద్దరే లోకమునకు పునాదులువేసి నప్పటినుండియు ఆ మార్గమున పోయినవారు. మరల ప్రధాన దూత బూరనూదు పర్యంతమును ఆ మార్గమున పోవుటకు మరెవరికిని సెలవులేదు. అంత నా యాత్రికులు తమ హృదయమున నిరుత్సాహపడ సాగిరి. అందును క్రైస్తవుడు మరింత దిగులు పడెను. వారొకరిముఖము లొకరు చూచుకొని దిక్కులు వెదుక సాగిరి. గాని వారి కెవరికిని మరేదారియు కనబడలేదు. అంత నా నది లోతైనదాయని వారా మనుష్యుల నడిగిరి. అందుకు ఆ మనుష్యులు: లేదు, గాని దాని లోతు మెరకలు పరమపురి రాజుపై మీకున్న విశ్వాసమును బట్టి యుండును అనిరి. అంత వారు నదినిదిగిరి. క్రైస్తవుడు నీట మునగ సాగినందున మునిగిపోవుచున్నానని నిరీక్షణచిత్తునికి కేకలు పెట్టెను. కెరటములు నన్ను ముంచివేయుచున్నవి.

ప్రవాహమూ నా తలపై పారుచున్నదని యతడు వాపోయెను. అందుకు నిరీక్షణచిత్తు డతనికి ధైర్యపరచి, సోదరుడా భయ పడకుము నాకీనది యడుగు తగులుచున్నది భయములేదు. అది చక్కగానున్నదని చెప్పెను.

అందుకు క్రైస్తవుడు: అయ్యో, అన్నా, మరణదుఃఖ ములు నన్ను చుట్టుకొన్నవి. పాలుతేనెలు ప్రవహించు దేశ మును నేను చూడనేలేను. అంతట గొప్పభయమును, అంధ కారమును క్రైస్తవుని చుట్టుకొనెను; గనుక వానికి ముందు దారి యేదియు కనబడలేదు. మరియు అతనికిక్కడ చాల మట్టుకు ఇంద్రియజ్ఞానము తగ్గిపోయెను; గనుక అతనికి దారి యందు దొరికిన సౌఖ్యముల జ్ఞాపకముగాని వాటి సంభాషణ గాని అతనికి లేకుండెను. గాని అతని నోటినుండివచ్చు మాట లన్నియు అతనికి మరణభయ మున్నట్టును పరమపురికి పోవు దునన్న ఆశ లేనట్టును కనబడుచుండెను. మరియు అక్కడ చూచుచున్నవారికి కనబడిన దేమనగా క్రైస్తవుడు తాను యాత్రకు బైలుదేరకముందును ఆపిమ్మటను తానుచేసిన పాపములన్నిటిని గూర్చియు బహు వ్యాకులపడుచుండెను. మరియు అతడు దయ్యములను గూర్చియు భూతములను గూర్చియు భయపడుచుండెను. ఎందుకనగా అప్పుడప్పుడా నదియం దతడు వాటినిగూర్చి మాటలాడుచుండెను.

అందుచేత నిరీక్షణచిత్తుడు క్రైస్తవుని కొంచెము నీటి పైకి తలయుండునట్లు పైకెత్తి పట్టుచుండెను. అప్పుడ

ప్పుడు అతడు నీటియడుగునకు పోవుచు మరొకప్పుడు చచ్చిన వానివలె పైకి తేలుచుండెను. మరియు అతని నాదరించు టకు నిరీక్షణచిత్తు డిట్లు చెప్పుచుండెను.

సోదరుడా, నాకు పరమపురి గనిని కనబడుచున్నది. అక్కడ కొందరు మనల నెదుర్కొనుటకై నిలిచియున్నారు. క్రైస్తవుడుని స్పృహతో, సహోదరుడా, వారు నిలిచియుండుట నీకొరకే. నీవు నిరీక్షణచిత్తుడవు, నీవే పరమపురమున ప్రవే శించుట. నేను కాదు. అని జవాబిచ్చుచుండెను. నీవును ప్రవేశించెదవు. అని నిరీక్షణచిత్తుడు ధైర్యపరచువాడు. క్రైస్తవుడు : సహోదరుడా, నేను మంచివాడనైనచో రారాజు నాకిపుడుసహాయము చేయువాడే గాని నాపాపముల చేత నేనిచట నశించుటకే యిక్కడ దేవుడు నన్ను విడిచి పెట్టెను. అందుకు నిరీక్షణచిత్తుడు : సహోదరుడా నీవు వాక్యమును మరచిపోయితివా. దుర్మార్గులను గూర్చి యిట్లు న్నదిగదా. 'మరణమందు వారికి యాతనలు లేవు. వారు పుష్టిగా నున్నారు. ఇతరులకు కలుగు యిబ్బందులు వారికి కలుగవు'– (కీర్త 73 : 4, 5) నీకిప్పుడీ నదియందు కలుగు చున్న భాధలను బట్టి దేవుడు నిన్ను విడిచి పెట్టెనని తలంచ వద్దు. గాని ఇంతకుముందు నీకు కలిగిన దీవెనలను జ్ఞాపకము చేసికొనట్లును, ఈ కష్టమునందు నీ వాయనమీద ఆనుకొను నట్లును, పరీక్షగా నీకీ కష్టములు కలిగియున్నది. ఈ మాటలు నిరీక్షణ చిత్తుడు చెప్పుచుండగా కొంత వరకు క్రైస్తవుడు

యోచించుచుండెను. మరియు నిరీక్షణచిత్తు డిట్లనెను; ధైర్యముగా నుండుము. యేసు క్రీస్తు నిన్ను స్వస్థపరచును. అంతట క్రైస్తవుడిట్లని యెలుగెత్తి చెప్పెను. ఓహో ప్రభువు మరల నాకు కనబడుచున్నాడు. నీవు జలములలో బడి దాటు నప్పుడు నీకుతోడై యుందుననియు, నదులలోబడి వెళ్లున పుడవి నీ మీదికి పొర్లి పారవనియు ఆయన నాకు చెప్పుచు న్నాడు. (యెషయా 43 : 2)

అంతట వారిద్దరును ధైర్యము పొందిరి. తుదకు వారు నదిని దాటువరకును సాతాను నోరుమూసుకొనెను. తటాలున క్రైస్తవుని కాలు నదియడుగునకు తగిలెను. అక్కడి నుండి నది లోతులేనందున వారు చక్కగా నడచిపోయి ఒడ్డుకెక్కిరి.

ఆనది కవతలి యొడ్డున వారికొరకై వేచికొనియున్న యిద్దరు ప్రకాశమాన వ్యక్తులను వారు మరల చూచిరి. యాత్రికులు గట్టెక్కినపుడు వారు వీరికి శుభము చెప్పి; మేము రక్షణ స్వాస్థ్యమును పొందబోవు వారికి సేవచేయుటకు పంపబడిన పరిచారకులము, రండని వారిని తోడుకొని పోయిరి. వారందరును పరమపురి గవిని తట్టు నడిచిపోయిరి. పరమపురము పెద్దకొండపై నున్నదని మీరు తెలిసికొనవలయును. గాని మన యాత్రికు లిద్దరిని పరిచారక దూతలు చేతులుపట్టి నడిపించి నందున వారు

సులభముగ కొండ నెక్కిపోయిరి. మరియు మన యాత్రికుల అనిత్య వస్త్రములు నదియందే విడువబడెను. ఆపట్టణమున్న కొండమేఘములకన్న నెత్తయినది. అయినను వారు వాయు వేగమున సులభముగా నెగిరిపోయిరి. వారాకాశ మండలము నందెగురుచు భయంకరమగు నదిని దాటినందున ఆదరణ పొందుచు తమకు తోడుగా వచ్చుచున్న దూతల సహవాసముచేత ఆనందించుచు సాగిపోయిరి.

## పరమపురి యానందమును వర్ణించుట

ప్రకాశమూర్తులగు దూతలతో వారు పరమపురి మహిమనుగూర్చి సంభాషించుచుండిరి. అక్కడి మహిమయు సౌందర్యమును చెప్ప నలవిగాదని దూతలు వారికి వర్ణించిరి. వారిట్లనిరి: ఇప్పుడైతే సియోనను కొండకును జీవముగల దేవుని పట్టణమునకు అనగా పరలోకపు యెరూషలేమునకును వేవేల కొలది దేవదూతలు యొద్దకును, పరలోకమందు వ్రాయబడియున్న జ్యేష్ఠుల సంఘమునకును, వారి మహోత్సవమునకును అందరి న్యాయాధిపతియైన దేవునియొద్దకును సంపూర్ణసిద్ధి పొందిన నీతిమంతుల ఆత్మలయొద్దకును, క్రొత్త నిబంధనకు మధ్యవర్తియైన యేసునొద్దకును, హేబెలుకంటె మరి శ్రేష్ఠముగ పలుకు ప్రోక్షణరక్తమునకును మీరు వచ్చి

యున్నారు. (హెబ్రి 12 : 22-24) మీరిప్పుడు దేవుని పర దైసునకు పోవుచున్నారు. అక్కడ దేవుని జీవవృక్షము మీ కగపడును, వాడబారని దాని ఫలములను మీరుతిందురు. మరియు మీరక్కడికి వచ్చినపుడు మీకు మహిమగల ధవళ వస్త్రము లియ్యబడును. అక్కడ మీపలుకులును మీ నడకలును రాత్రింబగళ్లు నిరంతరము రారాజు సహవాసమునందుండును. (ప్రక 2 : 7; 3 : 4, 5; 22 : 5) మీరు లోకమునందుండగ చూచినట్టి విషయములు మీరిక అక్కడచూడరు. అనగా దుఃఖము, రోగము, బాధ, మరణము మీకు కనబడవు. ఎందుకనగా పాతవిగతించెను. (యెషయా 65:16-17) మరియు అక్కడ అబ్రహాము, ఈసాకు, యాకోబు, ప్రవక్తలు నున్నారు. లోకమందలి పాపమును చూడకుండునట్లు దేవుడు పిలుచుకొనిపోయిన ఆత్మ లక్కడనుండి వారిపడకలపై విశ్రమించుచు ఒక్కొక్కరును తమతమ నీతియందు నడచుకొనుచున్నారు.

అందుకు యాత్రికులు వారి నిట్లడిగిరి. 'ఆ పరిశుద్ధస్థలమున మేమేమి చేయవలెను?' దూతలిట్లని జవాబిచ్చిరి: గనుక మీశ్రమకు తగిన ఆదరణ మీరక్కడ పొందవలసి యున్నది. మీదుఃఖమునకు తగిన ఆనంద మిక్కడ అనుభవింపవలసి యున్నది. మీ ప్రార్థనలచేతను, కన్నీళ్లచేతను మార్గమునందు రారాజుకొరకై పడిన శ్రమలచేతను మీరు

విత్తిన విత్తనములకు తగినకోత మీరిక్కడ కోయవలయును. (గలతీ 6 : 7, 8) అక్కడ మీరు బంగారు కిరీటములను ధరించి పరిశుద్ధుని ముఖమును నిత్యము దర్శించవలయును. ఎందుకనగా మీరు ఆయన ఉన్నట్టుగానే ఆయనను చూతురు. (1 యోహాను 3 : 2) లోకమునందుండగా ఆయనను మీరు స్తుతించి సేవించవలయునని ఆశించిరిగాని మీ శరీర బలహీనతచేత మీకు చాల కష్టమైనది. అయితే యిప్పుడు మీ రాయనను నిత్యము స్తుతులచేతను, పాటలచేతను, కృతజ్ఞతావచనము వలనను సేవించవలయును. అక్కడ సర్వశక్తుని చూచుటచేత మీ నేత్రముల కానందమును ఆయన స్వరము వినుటచేత మీచెవులకు హాయియు కలుగును. మీకంటె ముందుగా అక్కడికిపోయిన మీ మిత్రులను మీరక్కడ కలిసికొందురు. మరియు మీవెనుక వచ్చుచున్న ప్రియులను ఆనందముతో నెదుర్కొని చేర్చుకొందురు. అక్కడ మీకు మహిమయు ఘనతయు వస్త్రములుగా నివ్వబడును. మహిమగల రాజుతో మీరు బయలువెళ్లుటకు వలయు ఆయుధములు మీ కనుగ్రహించబడును. ఆయన వాయుమండలమునుండి బూరధ్వనితో వచ్చునపుడు మీరును ఆయనతో కూడ వత్తురు. ఆయన న్యాయతీర్పు సింహాసనముపై కూర్చుండునపుడు మీరును ఆయనప్రక్క కూర్చుందురు. ఇంతే కాదు అక్రమము చేయువారు దూతలైనను నరులైనను వారందరిమీద ఆయన నిత్యశిక్ష విధించునపుడు మీరును

వారందరిమీద శిక్ష విధింతురు. ఎందుకనగా అట్టివారు రారాజునకును మీకునుకూడ శత్రువులై యున్నారు. మరియు ఆయన తన పట్టణమునకు తిరిగి వచ్చునప్పుడు మీరును ఆయనతోకూడ బూరధ్వనితో వచ్చి నిత్యము ఆయనతో నివాసముందురు. (I థెస్స 4 : 13-17; యూదా 14, 15; దాని 7 : 9, 10; I కొరింథ 6 : 2, 3)

## ఆకాశ సైన్య సమూహములు వారిని కలసికొనుట

ఇట్లు వారు పరమపురి గవినియొద్దకు సమీపించుచుండగా ఇదిగో, ఆకాశ సైన్యసమూహ మొకటి వారిని ఎదుర్కొనవచ్చెను. వారికి ప్రకాశమాన మూర్తులిట్లు చెప్పిరి: వీరు మనప్రభువును ప్రేమించి లోకమునందున్నపుడు ఆయన పరిశుద్ధనామము కొరకు సమస్తమును విడిచిపెట్టినవారు. వారి నెదుర్కొనుటకు మేము పంపబడితిమి. వీరు లోపలికి వెళ్ళి తమ విమోచకునిచూచి ఆనందించునట్లిక్కడికి తోడుకొని వచ్చితిమి. అందుకు ఆకాశ సైన్యసమూహమిట్లు యెలుగెత్తి చెప్పెను: గొర్రెపిల్ల పెండ్లి విందుకు పిలువబడినవారు ధన్యులు. (ప్రక 19 : 9)

అంతట వారిని కలసికొనుటకు రారాజు యొక్క వాద్యగాండ్రును వచ్చిరి. వారు తెల్లని ప్రకాశమాన మగు

వస్త్రములను ధరించి బిగ్గరమైన సంగీత నాదములు చేయు చుండగా ఆకాశమండలములు ప్రతిధ్వనించు చుండెను. మరియు వారు క్రైస్తవునికిని అతని స్నేహితునికిని వేవేల స్వాగతము లర్పించిరి. సంగీతనాదములతోను పెద్ద స్వరముల తోను వారిని ఆహ్వానించిరి.

ఇట్లు చేయువారందరును క్రైస్తవునిచుట్టును నిరీక్షణ చిత్తుని చుట్టును చేరిరి. ఆకాశమండలమున వారికి రక్షణగా వారి ముందును, వెనుకను ఈతట్టును ఆతట్టును వారు వెళ్లుచు యాత్రికులను కొంచుపోయిరి. వెళ్లు మార్గమందంతను బూరలసంగీతము చేయుచునే యుండిరి. చూచువారికది పరలోకమే వారికెదురైనట్లు కనబడుచుండెను. వారందరు నట్లు సాగి పోయిరి. మరియు బూరల నాదముచేయువారు తమ భావ సూచకములచేతను కనుదృష్టిచేతను వారి యానందమును వెలిబుచ్చుచు క్రైస్తవుడును నిరీక్షణచిత్తుడును తమయొద్ద చేరి నందుకు బహుగా సంతోషించిరి.

మరియు పరలోకమునకు రాకముందే దూతల పాటలచేతను సంగీత స్వరములచేతను యాత్రికులిద్దరికిని పరలోకమువలెనే యుండెను. అక్కడకు పరమపురి కనుపించుచునే యుండెను. మరియు వారిని పరలోకమున కాహ్వానించుటకు అందుండి గంటలు మ్రోగుచున్నట్లును వారికి వినబడెను. అన్నిటికంటె ముఖ్యముగా వారి ప్రియులందరితోను కలసి

నిత్యకాలము అందు నివాసముచేయుదుమను సత్యముచేత వారికి మరింత సంతోషము కలుగుచుండెను. ఆహా, వారి మహిమానందములను వర్ణించుటకు నోళ్ళుచాలవు వ్రాయుటకు భాషలులేవు. తుదకట్లు వారువచ్చి మోక్షపురి ద్వారమును చేరిరి.

# యాత్రికులు నిత్యజీవపురమును చేరుట

వారు పరమపుర ద్వారమునొద్దకు వచ్చినపుడు ఆ ద్వారముమీద ఈమాటలు వ్రాయబడి యుండుట కనబడెను. "జీవవృక్షమునకు హక్కుగలవారై గుమ్మములగుండ ఆ పట్టణములోనికి ప్రవేశించునట్లు తమ వస్త్రములను ఉదుకుకొనువారు ధన్యులు"—(ప్రక 22 : 14)

మరియు నేను నాకలయందు చూచుచుండగా ద్వారమునొద్ద పిలువుడని ప్రకాశించుచున్న మనుష్యులు వారికి చెప్పిరి. కొందరు పైనుండి ద్వారముమీదుగా చూచుచుండిరి. వారే హనోకు, మోషే, ఏలియా మొదలగువారు. యాత్రికులు నాశనపురమునుండి బైలుదేరి రారాజునందును ఆయన పట్టణమందును గల ప్రేమచేత వచ్చితిరని వారికి తెలుపబడెను. అంతట యాత్రికులు తమతమ యోగ్యతాపత్రముల నందించిరి. ఈ పత్రములు వారికి మొదట దడ్డి

గుమ్మమునొద్ద ఇవ్వబడినవి. అవి రారాజునకు చూపబడినపుడాయన వాటినిచదివి యిట్లనెను: ఆమనుష్యు లెక్కడ? వారు ద్వారమునొద్ద నిలిచియున్నారని ఆయనకు చెప్పబడెను. ఆ నీతిగల జనాంగమునకు తలుపు తీయుడనియు, సత్యము ననుసరించువాడు ప్రవేశింప వచ్చుననియు రారాజు సెలవిచ్చెను. (యెషయా 26 : 2)

మరియు నేను నాస్వప్నమందు చూచుచుండగా నీయిద్దరు మనుష్యులును పరమపురి ద్వారమున ప్రవేశించిరి. వారట్లు ప్రవేశించుచుండగా వారు రూపాంతము పొందిరి; వారి వస్త్రములు బంగారువలె ప్రకాశించెను. బంగారు వీణెలును బంగారు కిరీటములును కొందరు వీరికందించిరి. వీణెలతో దేవుని స్తుతించుటకును కిరీటములు ధరించుటకునై యుండెను. మరియు నాస్వప్నమునందు నేను వినుచుండగా ఆనందముచేత పరమపురి గంటలన్నియు గణగణ మ్రోగెను. 'మన యజమానుని సంతోషములో పాలుపొందుడని' వారికి వినబడెను. (మత్తయి 25 : 23) 'మరియు సింహాసనాసీనుడై యున్నవానికిని గొఱ్ఱెపిల్లకును స్తోత్రమును ఘనతయు మహిమయు ప్రభావమును యుగ యుగములకును కలుగునుగాక' అని వారు ఎడుట నేనువింటిని. (ప్రక 5 : 13)

వారిని లోపలికి పోనిచ్చుటకు ద్వారములు తెరువబడినపుడు నేనుకూడ లోనికి చూచితిని. ఇదిగో ఆ పట్టణము

సూర్యునివలె ప్రకాశించుచుండెను. ఆ రాజవీధులన్నియు బంగారుమయములై యుండెను. మరియు బంగారు కిరీటములను తలపై ధరించి ఒక చేత మట్టలును మరియొక చేత బంగారు వీణెలును పట్టుకొనినవారనేకులు స్తోత్రములు పాడుచు ఆ వీధులయందు తిరుగుచుండిరి.

మరియు దేవదూతలనేకులు విడువక ఒకరితోనొకరిట్లు చెప్పుచుండిరి: ప్రభువు పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు. అంతట వారు ద్వారములను మూసివేసిరి. వారితోనుండిన యెంత ధన్యుడను- అని నేను తలంచితిని.

## అ జ్ఞా ని గ తి.

ఇదంతయు చూచిన పిమ్మట నేను వెనుకకు తిరిగి చూడగా అదిగో, అజ్ఞాని నదియొద్దనకు వచ్చెను. ఇతడు మిగిలిన వారివలె కష్టపడ నక్కఱలేకుండ నదిని సులభముగా దాటెను. ఎందుకనగా ఈ సమయమున అక్కడ వ్యర్థ నిరీక్షణ యనువాడు లేడు గాని ఒక పడవ వాడుండి అతనిని నది దాటించెను. మరియు నతడు పరమపురిని చేరుటకు కొండ యెక్కుచు నెవడును జత రానందున ఒంటరిగానే వచ్చుచుండెను. అతనికి ప్రోత్సాహ మిచ్చువాడుకూడ ఎవడును లేకుండెను. అతడు గవినియొద్దకు వచ్చి ద్వారముపైనున్న వ్రాతను చూచి తనకు త్వరగా ప్రవేశము దొరకు

నేమో యని తలుపు తట్టసాగెను. గాని ద్వారముపైనుండి చూచుచున్న వారతనితో ఆగుమని చెప్పిరి. మరియు నీ వెక్కడినుండి వచ్చితివి. నీకు ఏమి కావలయునని వారతని నడిగిరి. అతడు వారి కిట్లనెను, ఈ రాజు మా వీధులయందు బోధించినపుడు ఆయనతో తింటిని త్రాగితిని. మేము రాజునకు చూపునట్లు నీ యొద్ద యోగ్యతా పత్రిక గలదా— యని అడిగిరి. అతడు రొమ్మునతడవి చూచుకొనెను గాని పత్రిక లేదు. పత్రిక లేదాయని వారతని మరల యడిగిరి. గాని అతనినోట మాట రాలేదు.

అంతట వారు రారాజునకు తెలియజేయగా ఆయన వీనిని చూచుటకైన రాలేను. క్రైస్తవ నిరీక్షణ విత్తులను తోడ్కొని తెచ్చిన ప్రకాశవంతులతో ఆయన చెప్పినదేమనగా: మీరు వెలుపలికి వెళ్ళి అజ్ఞానిని కాలుసేతులు బంధించి పంపివేయుడి. అంతట వారతని బంధించి గాలిలో మోసి తెచ్చి కొండప్రక్కన నేనుచూచిన నరకద్వారము నొద్దకు తెచ్చి పడవేసిరి. నాశన పురము నుండియేగాక మోక్షపురము గవిని యొద్దనుండి కూడను ఒకడు నరకమునకు పోవచ్చునుగదా యను సత్యమును అప్పుడు గ్రహించితిని.

అంతట నేను మేల్కొనగా, ఇదిగో ఇదంతయు నొక స్వప్నము.

---

బాక్సుప్రెస్ : రాజమండ్రి.